M.N.S.01M 105

I

# పంకజాక్షి

ఉత్తమ సాంఘిక నాటకము.



Rs 5-00

|||

# పంకజాక్షి

స్త్రీపురుష మనస్తత్వాల వాస్తవికరూపాన్ని
వైవిధ్యాన్ని చిత్రించే
ఉత్తమ సాంఘిక నాటకము.

మూలము :

ప్రపంచవిఖ్యాత ఆంగ్లరచయిత

సోమర్ సెట్ మామ్

రచించిన "పెనిలోపి"

స్వేచ్ఛానువాదము :

ఉపాధ్యాయుల సూర్యనారాయణరావు.

పబ్లిషర్సు :

ఉమా పబ్లిషర్సు

విజయవాడ—1

వెల రు. 3—00

1

# పంకజాక్షి

—: పాత్రలు :—

| పురుషులు : | స్త్రీలు : |
| --- | --- |
| డాక్టర్ రంగధామారావు | పంకజాక్షి |
| ప్రొఫెసర్ పరంధామయ్య | ప్రేమవల్లి |
| సుబ్బారాయుడు | జానకమ్మ |
| రామానుజరావు | సుభద్రమ్మ |
| | ప్రియంవద |

కాలం : అధునాతనం

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలనుంచి
పునర్ముద్రితము.

విఖ్యాత సాహిత్యపరిశోధకులు

# డాక్టర్ యస్వీ జోగారావుగారి

# ప్రశంస

*Dr. S. V. Joga Rao*
M A. PH. D.
**Lecturer in Telugu Andhra University**

**WALTAIR**
20—3—61

మాన్యమిత్రులు

శ్రీ ఉపాధ్యాయుల సూర్యనారాయణరావుగారికి

## నమస్సుమనస్సులు

మీ పంకజాక్షిని ఎగాదిగా వీక్షించాను. ఉల్లాస మూపిరిగా, అడుగడుగునా ఔత్సుక్య వ్యంజకమైన ఒయ్యారంతో, అపురూపమైన మనస్తత్వం పరిజ్ఞానపు హొయలుతో ఎంతో అందంగా కన్పించింది పిల్ల! ఈమె నిదివరకెక్కడో చూచిన జ్ఞాపకం! అవును ఆమధ్య ఆంధ్రప్రభ వారి లోగిటి నుండి మా యిండ్లకు వారం వారం పేరంటానికి వచ్చేది. ఇప్పుడు విజయవాడ 'ఉమా' వారి వాకిట్లో ఒక్కసారి తన

ఏడువారాల నగలూ ధరించి సర్వాంగ సుందరంగా అలంక రించుకొని ముచ్చటగా విచ్చేసింది.

సెబాష్! పాశ్చాత్య సాహిత్య ప్రపంచాన్ని తన విదగ్ధరచనా విన్యాసాలతో మంత్రముగ్ధంచేసిన మహారచయిత శ్రీ సోమర్సెట్‌మామ్‌గారి 'పెనిలోప్'కి చక్కని తెలుగు కచ్చ చిక్కవి నుడిగారపు కుచ్చెళ్లు పోసికట్టి డాబుగా ముస్తాబు చేసిన మీ ఉపాధ్యాయత్వం యదార్థంగా ప్రసంశనీయం.

ఆంధ్రనాటక వాఙ్మయరంగంలో క్రొత్తగా అడుగు పెట్టిన అపూర్వసుందరి మీ పంకజాక్షి, రసిక వసంతులకు రమణీయ ప్రియదర్శన కాగలదని నా విశ్వాసం. ఈమె నాటకరంగంమీదే కాకుండా సినీమాతెర కెక్కినా. అత్యంత సుందరతర నాట్యభంగిమలు ప్రదర్శించగలదని నా ఆశయం.

రచయితగా మీలో ఒక సిద్ధహస్తం గోచరిస్తోంది నాకు. మీరు స్వతంత్రగానే ఆలాంటి నాటకాలెందుకు వ్రాయకూడదు? వ్రాయండి — సెలవు.

భవదీయుడు,

యస్వీ. జోగారావు.

3

సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు

## శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారి

# మెప్పుకోలు

'పంకజాక్షి' సాంఘికనాటకం ఆంగ్లానికి అనువాదం. కాని నమ్మలేకపోయాను పూర్తిగా జదివినతరువాత. ఆంధ్ర దేశీయ వాతావరణానికి అంత సన్నిహితంగా అనువదించడం సాధ్యంకానిపని అయినా శ్రీ సూర్యనారాయణరావుగారు కృతకృత్యులయారు. పంకజాక్షి నిజంగా అమాయికు రాలా ? ఆరిందా ? అంటే చెప్పుకోలేము ఇదమేవం అని-

సంభాషణలు తూర్పు తెలుగుముద్రతో కన్యాశుల్కాన్ని దిగద్రొక్కేవిగా ఉన్నాయి.

ఊహకీ, భావనకీ ప్రతిబింబంగా ఉన్న యీనాటకం తెలుగు నాగరక జీవులకు కొలది మాసాలుకిత్రమే ఆంధ్ర ప్రభ వారపత్రిక సంచికలలో పరిచయమయింది. దానిని చదివి—

'తాతగారి పేరుతో వృద్ధిలోనికి వస్తూన్న శ్రీ సూర్య నారాయణరావుగారు మనుచరిత్రకారునిమాట నిలిపారు' అని సంతృప్తి చెందాను.

నేటి సినిమారంగం అవకతవకగా, అతుకూ, బ్రతుకూ లేక 'కాపీ' కొట్టేతత్వంలో కథలు కూర్చుకుని 'మంచికథలు రాందే!' అనే ఘోరనినాదంతో సతమత మవుతూంది. హృదయంకల 'డైరెక్టర్' దీనిని చదివాక, తప్పక ఈఉత్తమ రచనను వెండితెరపై ప్రతిఫలింపచేస్తాడని అనుకున్నాను.

శ్రీ ఉపాధ్యాయుల ఇంకా యీలాంటి రచనలతో బాటు స్వతంత్రరచనలుకూడావ్రాసి సాహితీవేదికపై ఉత్తమ స్థానం అధిష్ఠించాలని ఆసిస్తున్నాను.

త్యాగరాయనగర్,<br>
మద్రాసు.<br>
26—3—61

యామిజాల పద్మనాభస్వామి.



# పంకజాక్షి

## మొదటి రంగము

[తెర: క్రొత్త అగ్రహారం పెద్దవీధిలో డాక్టర్ రంగధామారావు ఇంట్లో వీధిసావడి ప్రక్కగది. అందులో సామగ్రి ఆడంబరమైందికాదు. అయినా అందంగా మాత్రం అలంకరించబడి వుంటుంది. డాక్టర్ రంగధామారావు, పంకజాక్షి పెద్ద శ్రీమంతులుకారు. మధ్యతరగతిలో పై వర్గానికి చెందిన యువకదంపతులు. సాయంత్రం ఆరు, యేడు గంటల మధ్యకాలం.]

(అప్పుడే సావిట్లో అడుగుపెట్టిన సుబ్బారాయుడుని చూచి చురుకైన దాసీపిల్ల ప్రియంవద ప్రక్కగది తలుపు నెట్టుతుంది. జారిపోతూన్న యవ్వనంతో జోరబడుతూన్న కౌమారం క్రిందూమీదూ అవుతున్న మధ్యవయస్కుడు సుబ్బారాయుడు. మెలితిరిగిన కోరమీసం, సిల్కుఖండువా వల్లెవాటు, సీమనూలుకన్నా సన్నని సరిగంచు ఖద్దరుధోవతి, కల్లీలాల్చీ, కాలికి ఊదా వెల్వెట్టు చెప్పులతో ఎల్లప్పుడూ సుబ్బారాయుడు ఆడంబరం పుట్టిపడుతూ కన్పిస్తాడు. హడావిడిగా అడుగుపెట్టిన సుబ్బారాయుడికి శూన్యంగావున్న గదిలోకి దాసీపిల్ల దారిచూపుతుంది. తన రాకకోసం అక్కడ

ఎవరూ కాచుకు కూర్చోకపోవటం నిజంగా సుబ్బారాయుడికి అంతు పట్టలేదు. ఆశ్చర్యం కలిగిందికూడా. గది మధ్యలో ఆగి వెనుతిరిగి పనిపిల్ల కేసి చూస్తాడు (ప్రశ్నార్థకంగా)

సుబ్బారాయుడు: (ఆశ్చర్యం స్ఫురించే గొంతుకతో) పంకజాక్షి ఇక్కడ్లేదూ ?

పనిపిల్ల: లేరుబాబు.

సుబ్బారాయుడు: సరే! నే వచ్చేనని కాస్త చెప్తావా?

పనిపిల్ల: అమ్మగారు యింట్లోలేరు బాబూ.

సుబ్బా: ఇంట్లోలేదూ?...ఐతే...

పనిపిల్ల: దయచేసి సోఫాలో కూర్చోమని అమ్మగారు చెప్పమన్నారు... కాలక్షేపానికి యీనెల "భారతి" మీచేతికియ్యమన్నారు.

సుబ్బా: (ఆడంబరంగా) ఈ నెల "భారతి" ఇరవయ్యో తేదీ దాకా నేను చూడలేదని పంకజాక్షి యెందుకపోహ పడిందబ్బా!

పనిపిల్ల: (ఏం పట్టించుకోదు) అమ్మగారు చెప్పేరు. మీరు కొంచం కాఫీ తీసుకుంటారా?

సుబ్బా: దానికేం! పంకజాక్షి ఎంతసేపట్లో వస్తుందో?

పనిపిల్ల: ఆసంగతి నాకేం తెలియదు బాబూ!

సుబ్బా: మరి నాకు పంపిన చీటీలో తక్షణం రమ్మనిరాసింద?

పనిపిల్ల: ఔనుబాబు! వెంకాయ చేతి కాచీటీ ఇచ్చింది నేనేగా?

సుబ్బా: పంకజాక్షి యీవేళప్పుడు బైటకెళ్ళటం చాలా వింతగావుందే! బహుశా ఏదో అత్యవసరమైన పని మీద పోయుంటుంది. ఔనా?

పనిపిల్ల: (సవినయంగా) ఔను! బాబు!

సుబ్బా: బాగుంది పరవాలేదు. పంకజాక్షికోసం వోగడియ కూర్చుంటా... కాని అట్టేసేపుమాత్రం ఆగటానికి వీలుండదు... కలెక్టరుగారితో ఈరాత్రికి సినీమాకి... సరిలే దానికేం...

పనిపిల్ల: సరిలెండిబాబు.

[పనిపిల్ల గదిబైటికి పోతుంది. సుబ్బారాయుడు గోడకున్న నిలువుటద్దంలో కోరమీసం వొాడివేస్తూవుంటాడు. పనిపిల్ల ట్రేలో కాఫీకప్పుతో తిరిగి గదిలో ప్రవేశిస్తుంది.]

సుబ్బా: అబ్బా (అని టేబిల్లముందు కుర్చీలో కూర్చుంటూ) "భారతి" వుందనాన్నవుకదూ?

పనిపిల్ల: ఔనుబాబూ! (అంటూ ప్రక్కనున్న బల్లమీంచి "భారతి" తీసి అందిస్తుంది.)

సుబ్బా: (అందుకుని అలవాటుతో "థ్యాంక్సు" అంటాడు. పనిపిల్ల నవ్వుకుని బయటకు నడుస్తుంది. సుబ్బారాయిడు వేడి కాఫీ చప్పరించి సోఫాలో చేరగిలపడి "భారతి"లో గేయం ఒకటి చిన్న కూనిరాగంలో చిరునవ్వు మిళాయించి ఆలాపిస్తూ వుంటాడు.)

[పనిపిల్ల క్షణం తరువాత పంకజాక్షి తల్లి జానకమ్మను తోడ్కొచ్చుకు గదిలో తిరిగి ప్రవేసిస్తుంది. జానకమ్మ మధ్యవయస్సు

రాలు. సహృదయం. స్థూలకాయం. చాలా చురుకైనమనిషి. ఊపిరి చాలక వచ్చే చిన్న జాపోతవల్ల ఆవిడగారు ఎప్పటి కప్పుడే ఏదో నిటారుగావున్న గుట్ట యెక్కి వచ్చినట్టు కని పిస్తుంది. జానకమ్మసుబ్బారాయుడు తోబుట్టువు. అక్కగారు.)

పనిపిల్ల: జానకమ్మగా రొచ్చేరు...

సుబ్బా: (చూస్తున్న "భారతి" లోంచి తల బయటికెత్తి) అక్కయ్యా! రా...రా...

జానకమ్మ: రాయిడూ...నువ్విక్కడున్నావా? ... పంకజాక్షి యేది?

సుబ్బా: (ఏదో అసాధారణవిషయం విన్పిస్తున్నట్లు (గుడ్లు పెద్దవి చేస్తూ) పంకజాక్షి యింట్లో లేదక్కయ్యా! బయటికి వెళ్ళింది.

జానకమ్మ: (ఆశ్చర్యపోతూ బయటకా? అంటూ పనిపిల్ల కళ్ళలోకి జానకమ్మ ప్రశ్నార్థకంగా చూస్తుంది.

పనిపిల్ల: అమ్మా దయచేసి కూర్చోండి. అమ్మాయిగారు కాలక్షేపానికి దేవీభాగవతం మీ కిమ్మన్నారు.

జానకమ్మ: అసలు...

పనిపిల్ల: (ప్రశాంతంగా) అమ్మాయిగారు గ్లాసుడు వేడివేడి పాలు తీసుకోమన్నారు మిమ్మల్ని. పంచదార...

జానకమ్మ: అమ్మాయికి నే నొస్తానని తెలుసు. అయినా వీధిలోకెళ్ళింది. వింతగావుందే?

పనిపిల్ల: (జానకమ్మకు దేవీభాగవతం అందిస్తూ) అమ్మా! ఔను.

జానకమ్మ: (పుస్తకం చెయ్యిచాచి పుచ్చుకుంటూ) ఏమిటిది?

పనిపిల్ల: దేవీభాగవతం.

జానకమ్మ: (సుబ్బారాయుడు కేసి చిరాకుగాచూస్తూ) ఓహో! పంచదార కొంచం కలిపితీసుకురా పాలు... చూడూ! కొద్దిగా చాలు.

పనిపిల్ల: అలాగే అమ్మా!

జానకమ్మ: పంకజాక్షి యీ సమయంలో నేను దేవీభాగవతం చదవాలని యెందుకనుకుందో? అంతు పట్టకుండా వుంది.

సుబ్బారాయుడు: ఉన్నపాళంగా నన్ను రమ్మని పంకజాక్షి వుత్తరం పంపిందక్కయ్యా!

జానకమ్మ: వోహో! నన్నూ నిల్చున్నపాటుగా రమ్మని చీటీ పంపిందిరా! (కొంత ఆశాజనకంగా) బహుశా యీ దేవీభాగవతం తిరగేస్తే అమ్మాయి యెందుకు రమ్మందో అంతు చిక్కుతుందేమో?

సుబ్బా: ఛా ఛా ... రాయబహద్దూర్ దుర్గాప్రసాద్ గారి రెండో భార్యకీ దేవీభాగవతానికీ అక్కయ్యా! ఏమిటి సంబంధం?

జానకమ్మ: రాయిడూ! ఏమిటిరా నువ్వు మాట్లాడేది? (అదే సమయంలో పనిపిల్ల ప్రొఫెసర్ పరంధామయ్యని తోడ్కొని గదిలో ప్రవేశిస్తుంది. ప్రొ॥ పరంధామయ్య చెయ్యెత్తు పొడుగుమనిషి. పండుతమల

పాకులాంటి దేహచ్ఛాయ. దగ్గరగా దువ్వబడ్డ నెరసిన జుట్టూ, నున్నని గడ్డమూ విలువైన దుస్తులతో ఎంతో దర్జాగా మొదటి చూపులోనే ఏదో ఉన్నతపదవిలో ఉన్న మేధావిలా పొడగడతాడు. డాక్టరు రంగ ధామారావుకు మామా, మేనమామా కూడా.)

పనిపిల్ల: అమ్మా! పెద్దబాబుగారొస్తున్నారు.

ప్రొఫెసర్ పరంధామయ్య: హల్లో! సుబ్బారాయుడూ (భార్య జానకమ్మ కేసిచూసి) ఓహో! నువ్వా యిక్కడే వున్నావ్? హరికథకు వెళ్ళేవనుకున్నా.

[పనిపిల్ల 'ట్రే'లో పాలగ్లాసు ఒకటీ ఇంకో గ్లాసుతో బార్లీగంజి 'త్రివేణి' పాత సంచిక ఒకటీ వుంచుకుని ప్రవేశిస్తుంది.]

జానకమ్మ: మెల్లిగా దించు. నిండా తెచ్చినట్టున్నావు. తొణికించగలవు.

పనిపిల్ల: (ప్రొ॥ పరంధామయ్య కేసి తిరిగి) పెదబాబుగారూ! అమ్మాయిగారు బార్లీగంజి మీ కిమ్మన్నారు.

ప్రొ॥పరం: బార్లీగంజా? .

పనిపిల్ల: ఔనుబాబూ! ఈ 'త్రివేణి' కూడా క్రొత్తదింకా దొరకలేదు. అయినా ఫరవాలేదు. మీ కదేనా పనికొస్తుందని అమ్మాయిగారు చెప్పేరు.

ప్రొ॥పరం: (రాని నవ్వు తెచ్చుకుంటూ) పాపం చాలా శ్రమ పడ్డావు.

పనిపిల్ల: దానికే... పరవాలేదు బాబూ! (అంటూ బయటకు పోతుంది.)

ప్రా॥పరం: (ఓ చేత్తో ఓరగా వంచి పట్టుకున్న 'త్రివేణి' పత్రిక పుటలు రెండో చేతి బొటనవ్రేలితో తొందరగా తిరగేస్తూ) ఈ పాత పత్రికా ... బార్లీగంజి ఏమి చెయ్యమనో అమ్మాయి ఉద్దేశం?

సుబ్బా: బావా! బహుశా ఒకటి త్రాగటానికీ రెండోది చదవటానికి...

ప్రా॥పరం: (భార్యకేసి చూస్తూ) చూసేవా? నీ పెంపకం అపురూపంగా పుట్టిన మన ఏకైక పుత్రికారత్నానికి యీదిక్కుమాలిన బార్లీగంజి ఒక్కటే నాకు బాగా నచ్చే పిండివంట అని మప్పిపెట్టేవు.

సుబ్బా: బావా! నువ్వు ఇప్పుడిక్కడికి వస్తావని పంకజాక్షికి తెలిసినట్టుందే?

ప్రా॥ పరం: ఇప్పుడే తొందగా రమ్మని కాలేజీకి చిన్న చీటీ పంపింది.

సుబ్బా: నీకూనా? నిన్నూ ఎందుకు రమ్మందో? అంతా వింతగా వుందే?

జానకమ్మ: అందరికీ కబురుపెట్టి అమ్మాయి యింట్లో లేక పోవటం అగమ్యంగావుంది... నాకెందుకో భయంగా కూడా వుందిరా రాయుడూ!

ప్రా॥పరం: నిజానికి నాకేం తలాతోకా అందక కాలేజీనుంచి అమాంతం వున్నపాళంగా కారెక్కి వచ్చేసేను.

[పనిపిల్ల లాయరు రామానుజరావుని తోడ్కొని గదిలో ప్రవేశిస్తుంది. రామానుజరావు మంచి పేరుగల ప్లీడరు. నడివయస్కుడు. ఆయనలో నమ్రతా సౌహార్ద్రం తొలి దృక్కులోనే ద్యోతక మవుతూవుంటాయి.]

పనిపిల్ల: ప్లీడరుగారొస్తున్నారమ్మా!

ప్రొ॥ పరం: చచ్చేంరా దేవుడా!

సుబ్బా: బావా! మనహోదాకి తగ్గట్టూ మనం హుందాగా వుండాలి. నువ్వాలా బీడుగా మాట్లాడకు.

రామానుజరావు: (ప్రొ॥ పరంధామయ్యకి నమస్కరించి జానకమ్మతో) తక్షణం రమ్మని అమ్మాయి పంకజాక్షి ఫోను చేసిందమ్మా! (అంటూ పనిపిల్ల కేసి తిరిగి) అమ్మాయి గారికి నే వచ్చినట్టు చెప్తావా?

ప్రొ॥ పరం: అమ్మాయి యింట్లో లేందే!

పనిపిల్ల: (లాయరు రామానుజర్రావుతో) బాబూ! అమ్మాయి గారు దయచేసి కూర్చోమన్నారు. కాఫీ తెచ్చిస్తా. ఈ లోగా యీ పత్రిక కావలిస్తేచూడండి. (అంటూ ప్రక్క బల్లమీంచితీసి 'లా రిపోర్టన్' అందిస్తుంది.) [లాయరు రామానుజరావు విస్తుపోయి చుట్టూ చూస్తాడు]

ప్రొ॥ పరం: (లాయరు కేసి చూస్తూ) కొంచం కాఫీ పుచ్చు కొండి (నవ్వుతూ) నా బార్లీగంజికి మీ కాఫీమార్పి డిచ్చినా నాకేం అభ్యంతరం లేదండోయ్!

రామానుజరావు: (పనిపిల్లతో) సర్లే! పట్టుకురా.

పనిపిల్ల: (లా రిపోర్టరు పత్రిక అందిస్తూ) చూస్తూవుండండి బాబూ! (అంటూ బయటికి పోతుంది).

రామానుజరావు: (ప్రొ॥ పరంధామయ్యతో) మేష్టరుగారూ! ఇక్ష్వాకులంనాటి యీ లా రిపోర్టరుతో ఏంచెయ్యమనో మీ అమ్మాయి అభిప్రాయం?

ప్రొ॥ పరం: (నవ్వుతూ) క్షణంక్రితం యీ త్రేతాయుగం నాటి 'త్రివేణి' చూడమని చేతికిస్తే నేనూ అదే ప్రశ్న అడిగా. తడుంకోకుండా తక్షణం "చదవటానికయ్యా" అంటూ అరటిపండు ఒల్చినట్లు చెప్పేశాడండి మా సుబ్బారాయుడు.

రామానుజరావు: సర్లెండి, సుబ్బారాయుడు సంగతి నాకేం క్రొత్తకాదుగాని... నన్ను పిలుస్తూన్నది అత్యావసర పనిమీదనీ, తగిన సలహా యియ్యటానికి తక్షణం బయలుదేరి రావలసిందనీ పంకజాక్షి ఫోన్లో చెప్పిందే!

ప్రొ॥ పరం: అదేం నాకు తెలియదు... నాకుపంపిన చీటీ కూడా చాలా చిత్రంగా వుందండి.

జానకమ్మ: అమ్మాయి యీపాటికేనా యిల్లుచేరుతే బాగుండును. నాకిదంతా ఏమిటో అయోమయంగా కన్పిస్తోంది.

సుబ్బా: (హడావిడిగా) అయోమయం ఏం లేదక్కయ్యా! అసలు దీంట్లో వున్న సంగతేమిటో నే చెప్తా విను. ఈ మధ్య మన రంగధామం, రావుబహద్దూర్ దుర్గాప్రసాద్‌గారి రెండో భార్యకి వైద్యం చేస్తు

న్నాడు. నీకు తెల్సునకదూ? ఆవిడ చాలా అందంగా వుంటుందట. పైగా మంచి సంస్కారం వుంది. గొప్ప శ్రీమంతులు. ప్రత్యేకించి యీవిడ్ని నాకు తెలియకపోయినా వాళ్ల కుటుంబంలో మిగతా అందరినీ నాకు బాగా తెలుసుకదూ? అసలు రంగధామానికి అలాంటి వోనాలుగిళ్ళలో ప్రాక్టిస్‌వుంటే చాలదూ? పూటకి గతిలేని ఎన్ని సంసారి కొంపల్లో వైద్యంచేస్తే ఏం ప్రయోజనం?

ప్రా॥పరం: అసలుకథ కానీవోయ్!

సుబ్బా: ఇదిగో చెప్తున్నాగామరి. రావుబహద్దూరుగారి రెండోభార్య పంకజాక్షిని మర్యాద పురస్సరంగా చూట్టానికి యిక్కడి కొస్తూన్నట్టుంది ... వాళ్ళంతా చాలా హుందాఅయినవ్యక్తుల్లే! రంగధామంకూడా మంత్రం వేసినట్టు ఆవిడగారి వ్యాధి ఇట్టే మాయం చేసేడు. దాంతో ఆవిడగారికి రంగధామంమీద గొప్ప గౌరవం, గురీ కుదిరేయనుకో — ఆ, అన్నిటి కంటే ముఖ్యం, పంకజాక్షి నా మేనకోడలని రాయి బహద్దూర్‌గారికి తెలిసుంటుంది. అస లలాంటి గొప్పింటివాళ్ళకి తెలియని భోగట్టాలంటూ వుండ వనుకో! కాగా యీ కథంతకీ పర్యవసానం యేమి టంటే ఆ రాయిబహద్దూరుగారి రెండవభార్యఈరాత్రి యిక్కడికి విందు కొస్తున్నట్టుంది. మన పంకజాక్షికి అట్లాంటి ఘరానా కుటుంబాలతో నాకు బాగా

మొలాకత్తనే విషయం ముందునుంచీ తెల్సుకదూ? అందుకని ఆ విందు ఏర్పాట్లు కాస్త చూసి పెట్ట టానికి నన్ను పిల్చివుంటుంది. రాయిబహద్దూర్ గారి రెండవభార్య అభిరుచులూ అవీ నాకు బాగా తెలి సుండటంలో అసలు వింతేం లేదు. ఎందుకంటే నేనూ యేదో అట్లాంటి పెద్దింట్లో పుట్టినవాడినేగా? అబ్బెబ్బే మరేంలేదు. నా హోదా అంతా దైవి కంగా వచ్చిందే అనుకో!

ప్రొ॥పరం: ఐతే రాయుడూ! కొంపతీసి అమ్మాయి నిన్ను రమ్మని రాసిన చీటీలో యిదంతా వుందంటా వేమిటోయ్?

సుబ్బా: అందులోనే యిదంతావుంటే అది చీటీ యెలా అవుతుంది? చిన్న గ్రంథం అవుతుంది. బావా! పంకజాక్షి చాలా తెలివైన పిల్ల. అంత భావం మూడే ముక్కల్లో మడిచి పంపిందనుకో!

రామానుజరావు: (తెల్లపోయి) ఎవరో పెద్దింటి శ్రీమంతు రాలు ఇంటికి విందుకొస్తేనా కెందుకు ఫోనుచేసినట్లు? ఆఫీసులో కిటకిటలాడుతూ క్లయింట్లు నాకోసం కాచుకు కూర్చుంటే పంకజాక్షికి నాతో ఎంత జరుగుబాటనో అని వెనకదారిని తప్పించుకు మరీ వచ్చేను... వృథాగా!

ప్రొ॥పరం: ఏదీ! రాయుడు అమ్మాయి నీకు పంపిన చీటీ ఇలా ఇయ్యి! ఏం వుందో చూద్దాం.

సుబ్బా: చూచుకో బావా! కావలిస్తే! (అంటూ కల్లీలాల్చీ ప్రక్క జేబులోంచి చిన్నచీటీతీసి బయటకు చదువు తాడు) "మామయ్యా! తక్షణం బయలుదేరి రా. రావుబహద్దూరు దుర్గాప్రసాద్‌గారి రెండోభార్య" పంకజాక్షి.

ప్రొ॥ పరం: అరె నీ అసాధ్యం కూలా! ఆ మూడుమాటల తోనూ ఆ కథంతా నువ్వే అల్లినట్టుందే? ఏం?

సుబ్బా: ఔను బావా! పంకజాక్షికి నా అపూర్వమేధాసంప న్నత బాగా తెలుసుగా? అందుకనే ముఖ్యమైన మూడు మాటలు రాసి వూరుకుంది. మిగతా విష యం నే తెల్సుకోకపోతేగా?

జానకమ్మ; ఐతే నాకుపంపిన జాబులో అదేంలేదే?

ప్రొ॥ పరం: మరేమిటుంది?

జానకమ్మ: ( చేతి సంచీలోంచి చిన్న ఉత్తరం బయటకుతీసి ) "అమ్మా! గొప్ప హరికథ. హరికథా కేసరి ... ప్రేమకలాపం- పంకజాక్షి.

సుబ్బా: (విసురుగా) ఘోరం! ఎంత ఇదేనా హద్దూ పద్దూ వుండాలి. పంకజాక్షికి పాపం నిజా నిజాలేం తెలిసి నట్లులేదు. ఈమధ్య వూర్లోపుట్టిన గాలికబుర్లునమ్మి నట్టుంది - నాకు తెల్సు. నవనాగరికులూ, కళాపోష కులూ కాబట్టి రాయిబహద్దూర్‌గారి ఇంట్లో ఆడ వాళ్ళు అందరితోనూ, ముఖ్యంగా కళాకారులతో బాగా చనువుగా, కులాసాగా వుంటారు. అంతే!

అంతమాత్రాన రావుబహద్దూర్ గారి రెండో భార్య హరిదాసుతో ప్రేమకలాపం నడుపుతోందనుకోటం ఘోరంకాదటయ్యా!

రామానుజరావు: అబ్బే! నాకు ఫోనులో అవేం చెప్పలేదు. "పరిస్థితి చాలావిషమించింది. ఇరవై రూపాయిల నలభై నయాపైసలు. వెంటనే విధిగారండి" అని మాత్రం చెప్పి వెంటనే ఫోను దించేసింది.

సుబ్బా: విషమించిం దెవరి పరిస్థితి?

రామానుజరావు: అదే తెల్సుకుందాం అని తక్షణంవచ్చేసా.

ప్రొ॥ పరం: (కంటికొస లెగరేస్తూ, మందహాసంతో పెదిమలు చిన్నగా కదిలిస్తూ) రాయిడూ! ఒకటై వుంటుందోయ్! బహుశా రాయిబహద్దూర్ గారి రెండో భార్యకి రంగ ధామం ఎంతో కష్టపడి మంత్రంకట్టినట్లు నయంచేస్తే ఆ హుషారులో- డాక్టరుగారిబిల్లు ఎగ్గొట్టి ఆవిడగారు హరిదాసుతో వుడాయించివుంటుంది. (ఆడబ్బు రాబట్టుకోటానికి లాయరు రామానుజరావు కేసి చూపిస్తూ) ఈయనగారికి ఫోనుచేసి వుంటుందమ్మాయి.

సుబ్బా: నాకేన్నన్సు నీకేం తెలియదు బావా!

జానకమ్మ: (భర్తతో) అమ్మాయి మీకూ యేదో రాసిం దన్నారు?

ప్రొ॥ పరం: అబ్బే అందులో ఏంలేదు. "బాబాయ్ తక్షణం బయలుదేరి రండి- ఆరూ, మూడూ, మూడూ, ఆరూ" పంకజాక్షి అని మాత్రంవుంది.

[అదే సమయంలో మెల్లగా గదితలుపు తెరవబడుతుంది. పంకజాక్షి చల్లగా చడీచప్పుడూ లేకుండా గదిలో ప్రవేశిస్తుంది. క్షణంపాటు చిరునవ్వుతో గదిమధ్య నిల్చున్న ఆమె నెవరూగుర్తించరు. మొదటిసారిగా ప్రొ॥ పరంధామయ్య ఆమెను చూస్తాడు. . ఆ తరువాత అంతా ఆమెకేసి తిరుగుతారు.]

ప్రొ॥పరం: పంకజాక్షీ !

అంతా: పంకజాక్షీ !

పంకజాక్షి: (తల్లి ప్రక్కసోఫాలో కూర్చుంటూ సవినయంగా చేతులు జోడించి) నమస్కారం రామానుజరావుగారూ !

రామానుజరావు: (ఆతృతగా) శుభం! ఏమిటమ్మా సంగతి?

జానకమ్మ: (కొంచం కోపంగా) అమ్మాయి! ఏమిటిదంతా?

పంకజాక్షి: చెప్తా వుండమ్మా!... మామయ్యా! కాఫీ తీసుకున్నావా?... లాయరుగారూ మీరో? బాబాయ్! బార్లీగంజి అట్లాగే వుంచేసేరు.

సుబ్బా: అన్ని అయేయిగాని ఇంతవరకూ ఎక్కడున్నావ్? అమ్మాయి!

పంకజాక్షి: నేనా! ఈ ప్రక్కగదిలోనే కూర్చున్నా ... (చిలిపిగా చిన్నదరహాసం చేస్తూ) మీరంతా లోపలికి రావటం చూస్తూనేవున్నాకూడా.

జానకమ్మ: (దెబ్బతిన్నట్టుగా) పనిపిల్ల నువ్వుబయటికివెళ్లేవని చెప్పిందే?

సుబ్బా: అమ్మాయ్! ఇప్పటికి నీ ప్రవర్తన నిజంగా చాలా చికాకెత్తించిదనుకో.

పంకజాక్షి: చూడు! మామయ్యా! ఇప్పుడొచ్చిన మీ అందరినీ ప్రత్యేకించి ఒకరి తర్వాత ఒకరిని కలిస్తే నేకట్టాలిసిన వేషం నాలుగుసార్లు కట్టాలి. చెప్పిన కథే నాలుగుసార్లు చెప్పాలి. ఇదంతాచేసి అన్నిసార్లు చెపితే కథలో రక్తీ వుండదు ... నాలో వోపికా వుండదు.

ప్రొ॥ పరం: ఐతే కొంపతీసి నువ్విప్పుడు వేషంకట్టి కథ చేస్తా వేమిటి? అమ్మాయ్!

పంకజాక్షి: (ఎంతో తృప్తిగా) బాబాయ్! క్షణంలో నేనొక బాధాకరం, భయంకరం అయిన విషాదగాథ చెప్ప బోతున్నా.

జానకమ్మ: అమ్మా! ఆ గొడవలేవో నువ్వు చెప్పేముందు చిత్ర విచిత్రంగా వున్న నీ వుత్తరాల వృత్తాంతం కాస్త చెప్పు ... తలా తోకా అందక తన్నుకుం టున్నాం యింతసేపాయి.

పంకజాక్షి: అసలా ఉత్తరాలకు తలా తోకా వుంటేకదూ? మీ కందటానికి? నాక్కావలసిందంతా ఒక్కటే! మీఅందర్నీ ఇక్కడికి తక్షణం రప్పించడం. మీలో ఎవరేదంటే, చెవి కోసుకుంటారో అదే - మిమ్మల్ని

వున్నపాటుగా నాగదిలో పడవేయటానికి పన్నాగంగా పనికివచ్చింది.

జానకమ్మ: (భర్తతో) అమ్మాయి చెప్పింది మీ కర్థమవుతోందండీ?

పంకజాక్షి: అర్థంకావటాని కేంవుదమ్మా అందులో? నువ్వు సంగీతమన్నా, హరికథన్నా చెవులు కోసుకుంటావ్ - మా వీధిలో మంచి హరికథ వుందంటే వెంటనే రెక్కలు కట్టుకు వాల్తావ్ ... ఆ విషయం నాకు తెల్సు.

జానకమ్మ: నిజానికి కారు సిద్ధంగా లేకపోతే జట్కా చేయించుకొచ్చేసేను. ఆ హరికథ ఏదో తప్పిపోతుందని ... అసలింతకీ ఇప్పుడు నువ్వనేదేంటి? - హరికథ లేదంటావా?

పంకజాక్షి: (నవ్వుతూ) హరికథలేదు గిరికథాలేదు ... పాపం నిన్ను నిరుత్సాహపరిచినందుకు విచారంగావుందమ్మా.

ప్రొ॥పరం: మరైతే నాకు రాసిన ఆరూ-మూడూ, మూడూ ఆరు సంగతేంటి అమ్మాయ్?

పంకజాక్షి: అబ్బే! అదేంకాదు బాబాయ్! అది మా కారు నెంబరు.

ప్రొ॥పరం: అప్పుడే అనుకున్నా, ఆ వెధవ అంకెలు నాకు ఎక్కడో బాగా గుర్తున్నవే అని.

సుబ్బా: (నవ్వుతూ) ఇరవై రూపాయల నల్భై నయాపైసలంటే అమాంతం లాయరుగారు పరుగెత్తుకొస్తారని పంకజాక్షి ఎత్తేసింది. ఏం రామానుజం?

పంకజాక్షి: (రామానుజరావుతో) మీరు నామీద కోపగించ రనుకుంటా? పనిపాడుచేసినందుకు (లాయరు నవ్వుతూ బాధ లేనట్టుగా బుర్ర ఆడిస్తాడు.)

సుబ్బా: అమ్మాయ్! ఇంక ఇటు చూడు! వాళ్ళందరిసంగతీ అయింది. మరి నాకు రాసిన రావుబహద్దూర్‌గారి రెండో భార్య విషయం?

పంకజాక్షి: (సుబ్బారాయిడుకేసి శూన్యంగాచూస్తూ) రావు బహద్దూర్‌గారి రెండో భార్య? భూలోకంలో లేందే? భావనాప్రపంచంతో నేనే సృష్టించేను. ఎక్కడా లేదు.

సుబ్బా: ఏమిటి నీ వుద్దేశం? నువ్వు సృష్టించటం ఏమిటి? ఆవిడ్ని నే నెరుగుదును. ఆమాటకొస్తే వాళ్ళ కుటుంబంలో వారందరినీ నాకు బాగా తెలుసు.

పంక: (చిక్కులోపడ్డట్టు చూస్తూ, వస్తూన్న నవ్వు ఆపు కొంటూ) అదేంకాదు ... మామయ్యా! నువ్వు కూడా యిక్కడికి రావాలని.

సుబ్బా: అమ్మాయ్! నువ్వనేదేంటో నాకర్థం కావటంలేదు. నాకు బాగా చిరపరిచితమైన కుటుంబంలో ఒక స్త్రీ పేరు చెప్పి, అబ్బే ... అదేంకాదు, భూలోకంలో అలాంటి వ్యక్తేలేదు, ఊరికే నేనే భావకవిత్వం కట్టేను అంటావేం?

పంక: అబ్బే! అదేంలేదు మామయ్యా! వాస్తవంగా అసలలాంటి వ్యక్తి ఒకావిడ వుందనే సంగతే నాకు

తెలియదు. ఇంతదాకా ఆవిడగార్ని నేనే సృష్టించే ననుకుంటున్నాను. (నవ్వుతూ) అయితే తెలివిగా ఎవరో నీకు బాగా తెలిసినావిడ గురించి చెప్పే. గాభరా పెట్టేనన్నమాట నిన్ను.

సుబ్బా: అమ్మాయ్! రావుబహద్దూర్ గారి రెండోభార్య అన్నంతమాత్రాన నే నిక్కడ రెక్కలు కట్టుకు వాల్తా నని ఎందు కనుకున్నావ్!

పంక: నాకు తెలుసుకదూ మామయ్యా! నువ్వెప్పుడు ఆలాంటి పెద్దింటివాళ్ళతోనే నేస్తంకట్టి జోస్తీగా తిరుగుతూవుంటావని నిజానికి రావుబహద్దూర్ గారి రెండోభార్య అనే ఆడదేగానివుంటే ఆవిడగారిని విధిగా నీకు తెల్సేవుంటుంది. మరి (అని వయ్యారంగా చెయ్యివిసురుతూ) చూసేవా! ఆవిడగారెవరో నీకు తెల్సిందే అయింది.

[సుబ్బారాయిడు మాట్లాడడు కాని కొంచం కోపంతో ముక్కుతాడు]

జానకమ్మ: ఇప్పుడు చెప్పమ్మా! ... అమ్మాయ్! అసలు నీ కిప్పుడు కావలసింది ఏమిటో? మాఅందరినీ యెందుకు రప్పించేవో?

పంక: (చిన్న డగ్గుత్తికతో నేర్పుగా వ్యవహారంమాట్లాడు తూనట్టు) ఆయనగారికి నేను విడాకు లిచ్చేయాలను కుంటున్నా!

జానకమ్మ: ఏమిటీ!

ప్రొ॥ పరం: అమ్మాయ్!

సుబ్బారాయుడు: ఆరిదేవుడా!

[పైముగ్గురు ఆశ్చర్యార్థకాలూ ఏకకాలంలో ఉచ్చరిస్తారు]

పంక: (విచారపూరితంగా) ఎంతో ఆర్భాటంచేసి మరీ ఆ విషయం బయటపెడదా మనుకున్నా. కాని మీరంతాకలిసి ఒక్కముక్కలో నాచేత అది కక్కించేశారు.

జానకమ్మ: అయినా, నాకేం అర్థంకాలేదమ్మాయ్!

పంక: అదే మళ్ళీచెపుతా. చెప్పాలా! ఆయనగారిని విడాకులిచ్చి వదలేయాలనుకుంటున్నా... చాలా?

రామానుజరావు: నిజంగా? ఏమిటమ్మాయ్! నిశ్చయంగా అల్లా అనుకుంటున్నావ్! నువ్వు!

పంక: (కోపంగా) ఔను. అలానే అనుకుంటున్నా. అంతేకాదు ఆయనగారితో మరి మాట్లాడటానికికూడా తల్చుకోలేదు. ఇప్పుడే ఏదోలా కజ్జాపడి తెగతెంపులు చేసేసుకోదల్చేను.

ప్రొ॥పరం: అయితే! రంగధామం ఇప్పు డెక్కడవున్నట్టు?

పంక: ఈపాటికి ఆయనగారు ఇంటికి వస్తూవుంటారు. అలవాటైన పాతకథేఆలాపించటానికి(అంటూవుండగా గొంతుక బొంగురుపోతుంది) అయ్యో నే నెంత హేయంగా, ఎంత నీచంగా వున్నానో మీ కే తెలిస్తే!

జానకమ్మ: అమ్మాయ్ ! పరిస్థితి నిజంగా అంతవిషమించిందేమిటమ్మా ?

పంక : (నిస్పృహతో) ఇంకేం చెయ్యగలనమ్మా! మీ అందరికీ అర్థం అవటానికి !

ప్రొ॥పరం: అమ్మాయ్ ! మళ్ళీ మొదటినుండీ మొదలెట్టి వరసగా జరిగిందంతా చెప్పమ్మా! అదేమిటో మాకు సరింగా తెలియాలామరి ?

సుబ్బా: (ఆడంబరంగా) బావా! నువ్వూరుకో. ఎంతో ప్రపంచానుభవం వుంటేగాని ఇట్లాంటి విషయాలు అసలు అర్థమేకావు... కాలేజీలో లెక్కలు చెప్పుకొనే వాడివి నీ కెందుకొచ్చినగొడవ ?

ప్రొ॥పరం: (వెటకారపూరితంగా) నిండా క్షమించాలి ... అపరాధం.

జానకమ్మ: (పంకజాక్షితో ... తిరిగి మాట్లాడించటానికి) అమ్మాయ్ !

పంక : ఆయనగారిని నే నెంతో వెర్రిగా ప్రేమించేను. ఆయనకి ముందు నా మన స్సెవ్వరిమీదా పోలేదు. ఇంకమీదటకూడా మరెవరిని కాంక్షిస్తా నన్నమాట కల్ల.

రామానుజ: అమ్మా! మీ వివాహమై నాలుగేళ్ళు నిండేక నిజంగా చాలా మంచిమాటే చెప్తున్నావు.

పంక : నాలుగేళ్లుకాదు. ఐదు సంవత్సరాల మూడునెలల రెండు రోజుల్లో ప్రతి నిత్యం ఆయనగార్ని వెర్రిగా ప్రేమిస్తూనే వున్నా.

రామానుజ: ఇంతకన్నా అన్యోన్యమైన దాంపత్యం ఇంత దాకా నే నెరుగనమ్మా!

పంక : ఎప్పుడూ మేం ఒకరితో ఒకరు జగడంగాని అధమం ఒకరిమీద ఒకరు అలకగాని ఎరుగము. మాకల్యాణం నాటి శుభ ముహూర్తంనుంచి ఈనాటిదాకా ఒకే శోభనంగా మా జీవితం గడుచుకొచ్చింది.

జానకమ్మ: అదృష్టం! అమ్మా!

పంక : కాని గత నెలరోజులాయి ఆయనగారి ప్రవర్తన పూర్తిగా తారుమారైంది. ఆడే అబద్ధాలకి అంతూ పొంతూ లేదు. అర్ధరాత్రి దాటేక ఇల్లు చేరుతారు. అదేమండీ అంటే అనునిత్యం చావుబ్రతుకుల్లో వున్న ఏదో ఒక రోగిని కనిపెట్టుకు కూర్చోవల సొస్తోందట. ఆ తరువాత అంత బరువెక్కిన బుర్ర తేలిక పర్చుకోటానికి క్లబ్బులో కొంతసేపు విలాసం చిత్తగిస్తున్నారట. చావుబ్రతుకుల్లో వున్న ఆ రోగి, అటు తరువాత కాలక్షేపం చేస్తూన్న క్లబ్బూ మరేంకాదు, ప్రేమవల్లి.

సుబ్బా: (ఆడంబరంగా) ఎవరా ప్రేమవల్లి? ఆవిడగురించి నే నెప్పుడూ వినలేదే!

పంక : ఆ ప్రేమవల్లితో నా కెంతగా పరిచయముందో అంతగానూ ఆవిడను ఏవగిస్తున్నా. గడచిన నాలుగు వారాలుగా ఆయనగారు ప్రతి సాయంత్రం ప్రేమవల్లితోనే గడుపుతున్నారు.

ప్రొ॥పరం: (కనుబొమ్మ లెగరేస్తూ) అయితే అమ్మాయ్! ఇంటికి చేరగానే అనునిత్యం మీ ఆయన్ని ఎక్కడికెళ్లేడో నిలతీసి అడుగుతున్నావా?

పంక: (విసుగుతో) అవన్నీ ఎందుకుబాబాయ్! గణిత శాస్త్రంలో మీరు మహామేధావంతులు. ఆ విషయం మాకందరికీ తెలుసు, అయినా జీవితంగురించి మీకు బొత్తిగా తెలియదు.

ప్రొ॥పరం: అపరాధం (చిరునవ్వుతో తిరిగి) నిండాఅపరాధం.

జానకమ్మ: అమ్మాయ్! ఓ కాగితం పెన్సలూ పైనపడే. ఆయనగారు అంకెలు కూడుకుంటూవుంటే మనం అసలు సంగతేదో మాట్లాడుకుందాం.

పంక: (సొరుగులోంచి కాగితాలూ, పెన్సిలూతీసి అందిస్తూ) ఔనుబాబాయ్!

రామానుజ: అమ్మాయ్! అయితే అసలీసంగతి నువ్వెలా తెలుసుకోగలిగేవ్!

పంక: (చీదరగా) ఎలా తెలుసుకుంటే ఏంలెండి. తెలుసుకున్నదంతా నిజం అనటానికి నాకనేకనిదర్శనాలున్నాయ్.

జానకమ్మ: (భర్త ప్రొ॥ పరంధామయ్యకేసి చిలిపిగా చూస్తూ) నాకంటె ఏడు వెనకల పుట్టిన అమ్మాయే నయం!

ప్రొ॥ పరం: (చిరునవ్వుతో) ఓహో! అక్కడికి నువ్వేదో తక్కువ తిన్నట్టు!

సుబ్బా: అబ్బే! నా కిందులో ఆశ్చర్యపడ్డానికేం కనిపించందే!

పంక : అదేమిటి మామయ్యా?

సుబ్బా: సారే! ఇదింతే జరుగుతుందని మొదటినుండి నే అనుకుంటున్నదే! అక్కయ్యా! అసలు ఆదిలోనే యీ వివాహాన్ని నేను వ్యతిరేకించలేదూ? కర్మంగాని డాక్టర్ని పెండ్లాడమని ఎవడు చెప్పేడు? డాక్టర్లు పై కేదో డాబుసరిగా కనపడతారుగాని వాళ్ళ భార్యల గోడు ఎవడైనా వింటేగా? లోగుట్టు బయటికి రావడానికి అసలు వాళ్ళ భార్యల్ని ఎవరికేనా తెలుసునా అని. నా కేదో పాతకాలపు ఆలోచనలు పోయేయి కావు. అనుకుంటే అనుకోండి కాని నా దృష్టిలో పెద్దమనిషిలాగా పరువుగా బ్రతకదలిస్తే ఏ బారిష్టరో, ఏ మినిష్టరో అవాలి! అంతే!

పంక : ఉస్! ఏం వాగుడు మామయ్యా!

సుబ్బా: (కోపంతో విసురుగా) అదేమిటమ్మాయ్! నా అభిప్రాయం అడిగెవ్. తీరా చెప్పాక అది ఉత్తి వాగుడంటావ్!!

రామానుజ: ఐతే అమ్మాయ్! ఇప్పుడు నువ్వేంచేద్దా మనుకుంటున్నావు?

పంక : (పరిపూర్ణమైన నిశ్చయంతో) ఇంక ఆయనతో కలిసి వుండదల్చుకోలేదు. ఆయనగారిని చూసిన తక్షణం శాశ్వతంగా ఇల్లు విడిచి వెళ్లాలనుకుంటున్నా.

రామానుజ: ఆఖరిసారిగా ఆయనతో కొద్దిగా మాట్లాడుదా మనుకుంటున్నావా?

పంక: కాదు, ఎక్కువగానే మాట్లాడుదాం అనుకుంటున్నా. ఆయనగారిని ఎంత హేయంగా చూస్తున్నానో, ఎంతగా నేను ఆయనగారిని అసహ్యించుకుంటున్నానో, నిలపెట్టి దులిపెయ్యాదల్చుకున్నా. ప్రేమ ఒలక పోస్తూ మా పెళ్ళిలో ఆయనగారు నా వేలుకిస్వయంగా తొడిగిన ఉంగరం ఊడతీసి మొఖాన్నకొట్టి మరీ గది లోంచి బయట కొస్తాను.

రామానుజరావు: అమ్మాయ్! నిజంగా ఇంక నీ హృదయంలో ఆయనకి క్షమకి చోట్లేదా?

పంక: ఇదివరకు చెప్పిన మూడుమాటలుతప్ప ఆయనగారితో త్రినేత్రుడు చెప్పినా నాలుగోమాట ఆడదల్చుకోలేదు నేను.

సుబ్బా: అదలావుంచి– అమ్మాయ్! నువ్వుచాలా పెద్దింట్లో పుట్టిన పిల్లవాయె. ఆ కటిక సంసారితో నీ రోజెలా తెల్లావారుతుంది? కలిగినింటి సంబంధం కాకపోతే ఇలాంటి పాట్లుతప్పవు. ఇదీ ఒకందుకు మంచికే వచ్చింది. విధిగా వదిలిపెట్టెయి ఆయనగార్ని.

రామానుజరావు: అమ్మాయ్! పద్ధతిప్రకారం విడాకు లిద్దాం అనుకుంటున్నావా?

పంక: అవునండీ! నలుగురుకీ తెలిసేటట్టు నడివీధులో విడాకు లిచ్చి ఆయనగారి బ్రతుకు నవ్వులపాలు చేస్తాను.

రామానుజరావు: సరే! దానికేం వుందమ్మాయ్! ఒక్కరోజు నాలుగు పత్రికలకి పంపిస్తే చెల్లు. కాని ఆయన నిన్నెప్పుడైనా క్రూరంగాచూసి కష్టపెట్టినాడమ్మా?

పంక: అయ్యో! అదేం లేదండి. ఆయనగారు దానివల్లో పడ్డ యీ నెలరోజులనుండి నాతో ఇదివరకుకన్నా ఎంతో ముచ్చటగా వుంటున్నారు. ఆయన్ని పూర్తిగా పాడుచేసిన పాపిష్టిది... ఆ ప్రేమవల్లి భరతంపట్ట గలిగితే ఎంతో బాగుండునండి.

జానకమ్మ: రంగధామం, ఇలా అమ్మాయి గొంతుక కోస్తాడని కలలోకూడా అనుకోలేదు. అసలామాట తల్చుకుంటేనే నామతి చెదిరిపోతోంది.

సుబ్బా: పవిత్ర భారతదేశంలో గార్హస్థ్య జీవితం తుత్తునియలయిపోతోంది-అదీ దానిఅర్థం.

[అంతవరకు శ్రద్ధగా ప్రొ॥ పరంధామయ్య పెన్సిలుతో వ్రాస్తూన్న కాగితంకేసి హఠాత్తుగా పంకజాక్షి చూస్తుంది. బెదురుతూ పరకాయించి చూసి ప్రక్కకు తిరిగి]

పంక: అమ్మా! ఎంతో ఘోరం జరిగిపోయింది. బాబాయికి హఠాత్తుగా బుర్రచెడి ఉన్మాదం వచ్చేసింది.

జానకమ్మ: అమ్మాయ్! ఏమిటే నువ్వనేది?

పంక: బాబాయ్ ఆ కాగితంనిండా రెండూ రెండూకూడి ప్రతిసారీ ఐదు అని వేస్తున్నారమ్మా!

జానకమ్మ: ఏమిటండి అది?

[పంకజాక్షి కాగితం సుబ్బారాయుడుచేతికి అందిస్తుంది.]

పంక: చూడు మామయ్యా!

సుబ్బా: రెండూ రెండు ఐదు... రెండూ రెండు ఐదు.

[సుబ్బారాయిడు కాగితం రామానుజరావుకు అందిస్తాడు.]

రామానుజ: రెండూ రెండూ ఐదు... రెండూ రెండు ఐదు.

సుబ్బా: బావాగారిసంగతి యిట్లా పరిణమిస్తుందని అనుకుంటూనే వున్నా. నే ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నా.

జానకమ్మ: రాయిడూ! నువ్వోగడియ నోరుకట్టు.

పంక: బాబాయ్! నిజంగా మీరు రెండూ రెండు=ఐదు అనుకోటంలేదు కదూ?

ప్రొ॥ పరం: అబ్బెబ్బే! రెండూ రెండు నాలుగని దృఢంగా నేనూ నమ్ముతున్నానమ్మా!

పంక: ఏతే బాబాయ్! అన్నిసార్లూ రెండూ రెండూ కూడి ఐదని వేస్తున్నారేం?

ప్రొ॥ పరం: అమ్మాయ్! నువ్వు లక్సుసబ్బు ఎందుకుకొంటున్నావో నీకు తెలుసూ?

పంక: బాబాయ్! మెదడు వేడెక్కేందుకు చాలా పనిచేస్తున్నట్టున్నారు. మీరోగడియ ప్రక్కగదిలో పడుకొని

విశ్రాంతి తీసుకోండి. ఆయనగారొచ్చి నరాలసత్తు వకి మంచి మందేదైనా యిస్తారు.

ప్రొ॥ పరం: నే చెప్పేది వినమ్మా! లక్స్‌సబ్బు నవకం చెడనీయకుండా నీ శరీరాన్ని ఎంతో అందంగా, మృదువుగా వుంచుతుందని పత్రికల్లో పదే పదే నీకు నచ్చ చెపుతున్నారు. అందుకే ఆ లక్స్‌సబ్బే నువ్వుకొంటున్నావు.

పంక: అది హాస్యంకాదు బాబాయ్! చిలిపితనం.

ప్రొ॥ పరం: పిచ్చిపిల్లా! ఆ రెండూకాదు. పరమసత్యం! పదేపదే చెప్పే సంగతి ప్రపంచం నమ్మితీరుతుంది. లోకంచేత నమ్మించాలంటే లక్షసార్లు చెప్పిందే చెపుతూ వుంటేచాలు. ఒక్కసారి నమ్మటం అనేది జరిగేక అందులోని సత్యాసత్యాలు తెలుసుకోవడం దేముడి తరంకాదమ్మా!

పంక: దానికీ ఈ రెండూ రెండుకి ఏమిటి సంబంధం బాబాయ్!

ప్రొ॥ పరం: చూడమ్మాయ్! పదేపదే పనిగట్టుకు రెండూ రెండూ ఐదని అవిరామంగా రాసుకెళితే చివరికి నేనే అది సత్యం అని నమ్ముతానేమో?

పంక: మీరు లక్షసార్లు రాసుకెళ్ళినా అది అసలు సత్యం దరికికూడా చేర్లేదు బాబాయ్!

ప్రొ॥ పరం: ఎంతో విచారంతో నేనూ అదే నిశ్చితాని కొస్తున్న అమ్మాయ్!

పంక: మరి చూసేరా ?

ప్రొ॥పరం: రెండూ రెండూ మొత్తం చేస్తే లభించే సదుత్తరం దగ్గరే వుంది జీవిత రహస్యం అంతా.

సుబ్బా: బావా! జీవితంగురించీ, జీవిత రహస్యం గురించీ నువ్వు చర్చ మొదలిడితే నేను ఇక్కడ ఉండటం అనవసరం అనుకుంటాను. నువ్వుమహా మేధావివే. ఆ విషయం నేను రెండు దశాబ్దాలనుండి ఘోషిస్తూనే ఉన్నా, ఐతే, ఏం లాభం అంటా! నువ్వు ప్రపంచం బొత్తిగా తెలియని,కూపస్తమండూకానివి. నేను ప్రపంచంలో పుట్టి పెరిగి ప్రయోగాత్మకంగా ప్రతి విషయం ఆకళింపు చేసుకున్న మగరాజును. నన్ను సలహా చేసేట్లయితే, పంకజాక్షికి నా అనుభవం పంచి యివ్వడానికి సిద్ధం. అట్లా కాకపోతే...

పంక : నువ్వు కాస్త నోరు కట్టు మామయ్యా!

సుబ్బా: అదేమిటి అమ్మాయ్! పెద్దంతరం పిన్నంతరం అక్కర్లేదూ ?

ప్రొ॥పరం: అమ్మాయ్! గడచిన ఐదేళ్లనుంచి నేను చూస్తూనే వున్నా. నువ్వు రెండూ, రెండూ మొత్తం చేసి ముప్ఫయ్యారు అంటూనే వున్నావు.

జానకమ్మ: అదేమిటండి? దేన్నిగురించి మీరు మాట్లాడేది? నాకేం అర్థంకావటంలేదు. అల్లుడి ప్రవర్తన కట్టు తప్పి అసహ్యకరంగా ఉంది. ఇంక ఏవిధంగానూ

అతన్ని క్షమించి సరిపుచ్చుకోటానికి వీల్లేదు. సాధారణ నైతిక విలువలేనా లేకపోతే యెలాగండీ?

ప్రొ॥పరం: ఇదుగో చూడూ! సాధారణ నైతిక విలువల గురించి నువ్వేం చెప్పదల్చుకున్నా నాకేం అభ్యంతరం లేదు. నన్ను సాధారణ ప్రపంచజ్ఞానం గురించి మాత్రం కాస్త చెప్పనియ్యి!

జానకమ్మ: అదేమిటండీ? ఆ రెండూ ఒకటేగా?

పంక : బాబాయ్! "చిన్నతనంలో ఆమాత్రం చపలత్వం అందరికీ వుంటుంది. ఆమాటకొస్తే నాలోనూ వుంది. అందుచేత ఆయనగార్ని నువ్వు కాస్త సరిపుచ్చుకు క్షమించు" అనే మీరు చెప్పదలిస్తే ఏం ప్రయోజనం వుండదు. అలాఇలా విడిచిపెట్టేదాన్ని కానని మాత్రం తక్షణం చెప్పాలిసుంటుంది మీకు.

జానకమ్మ: (మండిపడుతూ) మీరు దేన్ని గురించండి మాట్లాడుతున్నారు?

పంక : అనుస్మృతంగా వస్తున్నదాన్ని గురించే ఆయన మాట్లాడుతున్నది. స్త్రీ తన భర్త కట్టుతప్పి అవిశ్వాసంగా ప్రవర్తిస్తున్నాడని గోలపెడితే, కుటుంబంలో ఆత్మీయులైన పురుషులు తమ భార్య లినిపెట్టిన బాధల, గాథలతో ఆవిడగారిని వూరడించటానికి సంఘంలో చేసే ప్రయత్నం పరిపాటైందేకదమ్మా.

ప్రొ॥ పరం: ఇదిగో! ఏమిటో అనుకుంటున్నావ్ గాబోలు! నేనేం అట్లాంటి అపరాధాలేం ఒప్పుకోబోవటం లేదు

సుమా? మన కసలు ఎప్పుడూ చేసినతప్పిదం ఒప్పు కోటం అంటూ లేనేలేదు!

పంక: బాబాయ్! అదే యింకోలా జరిగి అమ్మగాని ఆరాలు తీయగలిగిఉంటే?...

జానకమ్మ: ఏమండీ! నే నట్లాంటి గారడీపన్లు చేయటం చూడ గలరూ?

పంక: చెప్పండి బాబాయ్!

ప్రా॥ పరం: రంగధామం విషయంలో నువ్వు చాలా అవ మానకరంగా ప్రవర్తించేవు అనుకుంటునా అమ్మాయ్!

పంక: (అత్యధికాశ్చర్యంతో) నేనా? !!

పరం: అమ్మాయ్! రంగధామంయెడల నీ నడవడి మాదిరిగా మీ ఆమ్మనడవడి నాయెడలే వుంటే నే నీ పాటికి విధిగా త్రాగుడికి అలవాటు పడేవాడినే అనుకో!

పంక: అదేమిటి బాబాయ్! పరిపూర్ణ పతీత్వంగల దేవతగా మెసులుకుంటునా్న. ఆయనగారి పాదధూళిసహితం పరమపూజ్యంగా పూజిస్తునా్న. సృష్టిలో ఇంత వరకూ ఏ పురుషుడూ ప్రేమింపబడనంతగా ఆయన్ని నేను ప్రేమిస్తునా్న.

ప్రా॥ పరం: ఏపురుషుడూ అది తట్టుకోలేడమ్మా!

పంక: బాబాయ్! ఏమిటి మీ ఉద్దేశం?

ప్రా॥ పరం: వినమ్మా! ఉదయాస్తమయం మీ ఆయన్ని నువ్వు ప్రేమిస్తూనే వునా్నవు. ఆయన నోరువిప్పినా,

మూసినా, ఆయన నడుస్తున్నా, నిద్రిస్తున్నా, ఆయన తింటున్నా, త్రాగుతున్నా అహోరాత్రాలు నువ్వా యన్ని ప్రేమిస్తూనే వున్నావు. ఆఖరికి నీ ప్రేమ నుంచి బయటపడేమార్గం దుర్గమంగా పరిణమించి పాపం ఆయన వుక్కిరి బిక్కిరయేవు, వూపిరాడక.

పంక: దానికి నేనేం చెయ్యగలను బాబాయ్!

ప్రొ॥ పరం: నువ్వంత అతిగా ప్రదర్శించటం అనవసరం అమ్మాయ్!

పంక: బాబాయ్! అందుకని ఆయనగారు కట్టుకున్నభార్యను అలుసుచేసి ఒక పరాయిస్త్రీ వలలోపడి సయ్యాట లాడటం తప్పుకాదనా మీభావం?

ప్రొ॥ పరం: అది ఆయనకి కొంతదాకా సాకుగా వుపకరిం చింది.

పంక: పశుత్వం పురుషుల్లో ఎంత ఘనీభవించిందో?

ప్రొ॥ పరం: ప్రస్తుతం నీ కదో చోద్యంగా తోచవచ్చుకాని పురుషుల్లోకూడా మానవత్వం పరిపూర్ణంగానే వుం దమ్మా! చిన్నతనంలో నువ్వు చాకిలైట్సు ఆప్యా యంగా తినేదానివి. గుర్తుందో లేదో నీకు!

పంక: (చిన్నగా) నవ్వుతూ) ఇప్పటికీ తింటూనే ఉన్నా!

ప్రొ॥పరం అమ్మాయ్! ఉదయం ఉపహారానికీ మధ్యాహ్నం భోజనానికి సాయంత్రం పలహారానికి రాత్రి సాపాటుకీ చాకలేట్సు అనునిత్యం నిండా ఒక నెల తిని వుండ గలవా?

పంక : అమ్మమ్మో ! అది తల్చుకుంటేనే నా తల తిరిగిపోతోంది.

ప్రొ॥పరం: పాపం ! రంగధామం ఐదేళ్లాయి అవిరామంగా చాకలైట్సు తిని జీవిస్తున్నాడు. ఊపిరి నిలుపుకోటానికి అతనికి అదే ఆహారం.

పంక : (భయకంపితయై) అమ్మో !

ప్రొ॥పరం: మీ ఆయన ఉదయం మేలుకున్నదగ్గరనుండి రాత్రి నిద్రించేవరకు నువ్వాయన్ని నీడలా వెంటాడుతున్నావు. ఆయన్ని అనునిత్యం గుమ్మందాకా సాగనంపుతావు. ఆయన తిరిగి సాయంత్రం సావిట్లో కాలు పెట్టకుండానే పరుగున పోయి పలకరిస్తావు. ఆయన రాత్రి భోజనముచేసి విశ్రాంతిగా వాలు కుర్చీలో నడుం చారేసి పత్రిక పట్టుకునేసరికి ప్రక్కన తయారవుతావు - నే నెన్నోసార్లు చూసేను.

సుబ్బా: (కోపోద్రేకంతో) నిజంగా ?

పంక : అదేం అంత కూడనిపనా ? బాబాయ్ !

సుబ్బా: అదేమిటమ్మాయ్ !

పంక : (లాయరు రామానుజరావుకేసి చూస్తూ) మీరు రాత్రిపూట వాలుకుర్చీలో విశ్రాంతిగా సిగరెట్టు కాల్చే సమయంలో ప్రక్కన మీ యిల్లాలు కూర్చోటం లేదండీ ?

రామానుజ: నిజం చెప్పాలంటే ఆ సమయంలో మా ఆవిడ ఇంటిపనులు చక్కబెట్టుకోవటం అలవాటమ్మా !

పంక : వట్టి పాతకాలం మనుష్యులు మీరంతా నామీద సానుభూతి చూపుతారని రప్పించేను మీ అందరినీ. అందుకు బదులు పశుత్వం ప్రదర్శిస్తున్నారు.

సుబ్బా: ప్రతిదానికీ హద్దూ, పద్దూ ఉండాలి అమ్మాయ్ !

పంక : నా కదంతా అనవసరం. ఆయనతో తెగతెంపులు చేసుకు విడాకు లియ్యాలిసిందే !

ప్రొ॥పరం: పోనీ ఇంకో చిన్నపని చేసి చూద్దాం. ఏమమ్మా ! బహుశా ఈసారే నా రెండూ రెండు – నాలుగవ వచ్చునుగా ?

పంక : ఏంగోడవవచ్చిందిబాబాయ్ ! మీ గణిశాస్త్రంతో !

ప్రొ॥పరం: విడాకు లియ్యటానికిబదులు మీ ఆయన అభిమానం తిరిగి సంపాదించి ఆయన్ని నీవాడిగా మార్చుకోగల ప్రయత్నం చేయటం మంచిదికదూ ?

పంక : ఆయనగారి అభిమానం నాకేం అవసరంలేదు.

ప్రొ॥పరం: (మందహాసంతో) నిజంగా అమ్మాయ్ ! నువ్వు ఆయన అభిమానం తిరిగి పొందగలిగినా నిరాకరించే నిశ్చయంలో వున్నావ్ ?

పంక : (క్షణంపాటు తండ్రివైపు తేరిపారిచూచి తరువాత త్వరగా తండ్రిదగ్గరకు వెళుతుంది. అశ్రుపూరిత నయనాలతో, డగ్గుత్తికతో) తిరిగి ఎప్పటికైనా, ఆయన, నావాడగుతారని మీకు నమ్మకంవుందా బాబాయ్? నా తప్పిదమువల్లే ఆయన్ని దూరం చేసుకున్నానని

మీరే అన్నారు. ఆయన్నించి దూరమై ఇంక నే చేసేదేమిటి? అది తల్చుకుంటే నా బ్రతుకు నాకే ఎంతో హేయంగా కన్పిస్తోంది. ఎంతగా దిగమ్రింగి, ఓర్పుతో నవ్వు నటిద్దామన్నా సాధ్యంకావటం లేదు. నా హృదయంలో రేగుతూన్న దావాగ్నిమీరు చూసి ఉంటే... ఎంత క్రూరాతిక్రూరం?

సుబ్బా: అదేమిటమ్మాయ్! నువ్వెంతో ధైర్యంగా వుంటా వనుకున్నా. కులగోత్రాలూ, కుటుంబ హోదా లేని ఆయనగారి పీడ ఇంతటితో ఒదిలిపోతుం దనుకున్నా!

పంక: మామయ్యా! ఆయనగురించి నువ్వేమాత్రం పరుషంగా మాట్లాడినా నా మతి చెదిరి తక్షణం ఇస్టీరియా వస్తుంది.

సుబ్బా: ఐతే మీ బాబాయిని ఇప్పు డేం చెప్పమంటావో నాకేం పాలుపోలేదమ్మాయ్!

ప్రా॥పరం: (చిరునవ్వుతో) ప్రపంచం తెలియని పసిపిల్లాడిని-పైగా పాలుకుడుస్తున్నా - కదూ రాయిడూ?

సుబ్బా: అసలు నీగురించి ఆ మాత్రం కూడా నేఅనుకోవటం లేదు. ఐనా ఇంకట్టేసేపు యిక్కడ నే నుండటం అనవసరం.

పంక: ఇంకొక క్షణం వుండు మామయ్యా!

సుబ్బా: ఇంకెందుకమ్మాయ్! ఇక్కడ నా సలహా అవసరం అయినట్టుగాలేదు. పైగా కలెక్టరుగారితో కలిసి యీ రాత్రి సినీమా చూస్తానని ఖరారు చేసేను.

పంక : ప్రక్క గదిలో ఫోనుంది. వెళ్ళి యీరాత్రికి రాలేనని ఆయ నెవరికో చెప్పేసిరా మామయ్యా!

సుబ్బా: (కొంచంగా బుజా లెగరేస్తూ) నేను అసలే అదో రకం వ్యక్తిని! నామాటకేం, అమ్మాయ్! అట్టే పట్టించుకోబోకు.

[అంటూ బయటికి నడుస్తాడు.]

పంక : మీరు చెప్పండి బాబాయ్! ఆయన్ని తిరిగి నా వాడిగా మార్చుకోగలం కదూ?

ప్రొ॥ పరం: అదెంతలో మాటమ్మా! అతి సులభంగా సాధించొచ్చు. ని కందుకు కావలసిందల్లా నిండా ధైర్యం, మంచి వాకచక్యం, ఆపైని పరిపూర్ణమైన ఆత్మ నిగ్రహం.

పంక: (పరిహాస పూరితంగా) జస్! మరేం అక్కర్లేదూ?

ప్రొ॥ పరం: చాలా కావాలమ్మా? నీచూపులూ, చేష్టలూ, నవ్వులూ, నడతా - ముఖ్యంగా అహంకారం అన్నీ నీ అదుపులో పెట్టుకోవాలి.

పంక; ఇందాకా, బాబాయ్! ఇట్టే సాధించొచ్చు, అతిసుల భాతి సులభం అన్నారు?

ప్రొ॥ పరం: అది సరేగాని మీ ఆయన్ని వల్లోవేసుకున్న ప్రేమవల్లి మంచి అందకత్తా?

పంక: అబ్బెబ్బే! పూర్తిగా కురూపి బాబాయ్! కోతిలా వుంటుంది.

ప్రొ॥ పరం: కోతిలా వుంటుందా? ఐతే గట్టిచిక్కే.

పంక: అదేం? బాబాయ్!

ప్రొ॥ పరం: అందమైన స్త్రీమీద కలిగిన పురుషప్రేమకి స్థిరత్వముండదమ్మా! కాని కురూపి వలపులోచిక్కిన వ్యక్తి ఆజన్మాంతం ఆమెను ప్రేమిస్తూనే వుంటాడు.

పంక: నా హృదయంలోంచి ఒక గొప్ప బరువుతీసేసేరు బాబాయ్! ప్రేమవల్లి అపురూప సౌందర్యవతి.

ప్రొ॥ పరం: ఐతే రంగధామం తిరిగి నీవాడవుతాడమ్మా!

పంక: అందుకు నేనేంచెయ్యాలో సరిగ్గా చెప్పండి బాబాయ్! అది వెంటనే చేసెస్తా.

ప్రొ॥ పరం: అతని దారినుంచి కొద్దిగా తప్పుకో అమ్మా!

పంక: అంతేనా?

ప్రొ॥ పరం: అంతే అంటే అందులో చాలా అర్థముంది. ఆయన ఇంటికి చేరగానే అలిగి ఆర్భాటం చెయ్యటానికిబదులు ముచ్చటగావుండు. ఆయన ఎక్కడికి వెళ్లేదో ప్రశ్నించకు. ఆయన నిన్ను విడిచివెళ్ళే టప్పుడు ఎక్కడికిపోయేదీ, ఎప్పుడొచ్చేదీ నిలతీసి అడగొద్దు. ఆయనమీద నీకు ఇసుమంతా అనుమానం వున్నట్లు తెలియనియ్యకు. అందుకుబదులు ఆయనగారిని వీలైనన్నిసార్లు ప్రేమవల్లిని కలియటానికి అవకాశం కల్పించిమరీ విడిచిపెట్టు.

జానకమ్మ:- అదేమిటండీ! జరిగే అవినీతికి అమ్మాయిని ఆసరా యిమ్మంటారేమిటి!

ప్రొ॥ పరం:- ఔను. రంగధామానికి అవరోధాలన్నీ తొలగి పోతే ఆమెగారిమీాది మోజుసగం జారిపోతుంది. అంతతో అప్రయత్నంగా నువ్వు సగం విజయం సాధించినట్టే. మిగతాది కాలానికీ, ప్రేమవల్లికీ విడిచిపెట్టు. మీా ఆయన పత్రిక చూసేసమయంలో ఆ ప్రేమవల్లినే పడకకుర్చీప్రక్కని చేరనీ. ఆయన ఎప్పుడు వెళ్లేదీ, ఎక్కడికి వెళ్ళేదీ, ఎప్పుడు వచ్చేదీ, పదేపదే ఆ ప్రేమవల్లికే నివేదంచుకుంటూ వుండనీ, ఆ పరిస్థితుల్లో ఏ స్త్రీయైనా పురుషుణ్ణి పరుషంగా నిల తీసి బాధిస్తుంది. కాస్తంత తడబడ్డాడో ఇదివరకులా నన్ను ప్రేమిస్తున్నావా? అని అహంకారంతో ప్రశ్నిస్తుంది. ఆ ప్రశ్న కాముకుడి కంఠానికి కాలపాశం. ఆయనగారు బయలుదేరబోయే ప్రతిసారి ఇంకోక్షణంపాటువుండి పొమ్మని వలవుకత్తె శాసిస్తుంది. అగతికంగా అయిష్టతతో గడిపిన ఆక్షణంపాటే ప్రేమకి భరతవాక్యం. ఒదిలివెళ్ళేముందు ప్రియుణ్ణి ప్రతిసారి ప్రేయసి "తిరిగెన్నింటికి రావటం?" అని ప్రశ్నిస్తుంది. ఆప్రశ్నే ప్రేమకి అంత్యక్రియ.

[ఆమాటలు చెప్తూన్నంతసేపూ పంకజాక్షి అత్యధికాశ్చర్యంతో తదేకంగా ప్రొ॥ పరంధామయ్యకేసి చూస్తూవుంటుంది.]

పంక:- ఇదంతా మీారెక్కడ తెలుసుకున్నారు బాబాయ్?

ప్రొ॥ పరం:- (తేలికభావంతో కొద్దిగా బుజాలు కుదించి) మరేంలేదు రెండూ, రెండూ కూడికే నమ్మాయ్!

పంకజాక్షి:- గణితశాస్త్రంలో అంత ఆసక్తీ, అవినీతికూడా వుంటాయని నాకు తెలియదు బాబాయ్!

ప్రొ॥ పరం:- శాస్త్రాలగొడవ మనకెందుకిప్పుడు? దానిగురించి ఏమిటి నీ వూహ?

పంక:- ఐతే ఆయనగారు ప్రేమవల్లి వలపులోంచి బయట పడ్డంతమాత్రాన తిరిగి నన్ను ప్రేమిస్తారనుకోటానికి కారణం కన్పడటంలేదే?

ప్రొ॥ పరం:- ఆయన్ని నువ్వు మళ్ళించుకోవాలి.

పంక:- అదెలా? చెప్పండి బాబాయ్!

ప్రొ॥ పరం:- అందుకు కావలసినదల్లా యింక కొద్దిగా చాకచక్యం, ఇంక కొద్దిగా ధైర్యం, ఇంక కొద్దిగా ఆత్మనిగ్రహం.

పంక:- అవన్నీ సేకరిస్తే నాలో స్త్రీత్వం నశించి నరరూప రాక్షసినై వూరుకుంటాను. అప్పుడు మరి ఆయనగారు నన్ను ప్రేమించేదెట్లా బాబాయ్?

రామానుజరావు:- [కిటికీలోంచి బయటికి చూస్తూ] ఇంటి ముందు ఏదో కారు ఆగింది.

పంక: వినండి ... ఏదో తాళం తిప్పిన శబ్దం అయింది... ఆయనగారే అయి ఉంటుంది.

రామానుజ: అమ్మాయ్! ఇప్పుడు నువ్వేంచెయ్యబోతున్నావ్?

పంక: (సంకోచిస్తూ) ఏంచెయ్యమంటావమ్మా?

జానకమ్మ: మీ బాబాయ్ చెప్పింది నాకు సుతలాం నచ్చలేదమ్మా! అసలాయనగారి మెదడుకి ఆ, ఆలోచన

ఎట్లా తట్టిందో నాకేం తలా తోకా అందలేదు. కాని అందులో కొంత సత్యం వుందనిమాత్రం చెప్పి తీరాలి.

పంక : (మనోనిశ్చయం చేసుకొని) ప్రయత్నిస్తా సరే! మీరంతా ఇక్కడ జరిగినది ఇక్కడే మరిచిపోవాలి. నాకు చెయ్యాతిస్తావుకదూ? ఏం అమ్మా!

జానకమ్మ: నీ సుఖంకంటే నాకు కావలసిన దేమిటమ్మా! ఇంతకీ నువ్వు నన్నే అసత్యా లాడమనటం లేదుగా?

పంక : ఆమాత్రం ఈమాత్రం అబద్ధాలదాకే. ఘోరమైన అసత్యాలు చెప్పాలిసుంటే నేనే సిద్ధపడతా. నీచేత చెప్పించనులే అమ్మా.

రామానుజ: మరి సుబ్బారాయుడుసంగతి?

ప్రొ॥పరం: ఆయనగారసలే ప్రపంచం తెలిసినమనిషాయె. ఇందులో చెయ్యి చేసుకోక మానాడా? అని.

పంక : మరేం పరవాలేదు. మామయ్య సంగతి నే చూసుకుంటా.

[సుబ్బారాయుడు పునః ప్రవేశం]

పంక : ఏం? మామయ్యా!

సుబ్బా: కలెక్టరుగారి బంగళా పలకలేదు. ఏ నెంబరడిగినా "ఎంగేజ్డ్! ఎంగేజ్డ్!" అసలీ టెలిఫోన్ ఎక్చేంజిలో అసలు సిసలు తంజావూరు సరుకంతా చేరింది. ఆ సీతాకోక చిలకలకి ఎక్కడలేని కాలం కేరింతాలకే చాలదు! ఒట్టి తిరుగుడుగొడ్లు!

పంక : అది సరేగాని మామయ్యా ! ఆయనగారిగురించి నేనే అనవసరంగా అపోహపడ్డా. పాపం ఆయన అపచారం ఏం లేదు.

సుబ్బా: ఆరే ! అయితే ప్రేమవల్లి తతంగం ?

పంక : ఆవిడ తప్పూ అంతకన్నా లేదు.

సుబ్బా: చాలా ఆశ్చర్యకరంగా ఉందే ! హఠాత్తుగా ఈ నిర్ణయాని కెట్లా వచ్చేసేవ్ ?

పంక : రెండూ, రెండూ, కూడటంద్వారా మామయ్యా !

సుబ్బా: ఛా ! ఛా ! ఏంపనైంది ? అనవ్వసరంగా కలెక్టరు గారితో అతి ముఖ్యాతిముఖ్యమైన కాలక్షేపం పాడైంది. ఈ వ్యవహారం ఇంతే అవుతుందని...

పంక : (కలుగజేసుకుంటూ) ఏమిటి మామయ్యా ! నా గోడ వేదో ఒదిలిందనుకుంటే నీ భాగోతం కొంత !

రామానుజ: అంతా బాగుందమ్మా. ఇంక నే వెళ్ళొస్తా ?

పంక : ఇప్పుడు మీరు వృత్తిరీత్యా వచ్చినట్టే భావిస్తా.

రామానుజ: ఛా ! ఛా ! గృహస్తురీత్యా ...

పంక : అదేమిటండీ ! మీ పనంతా పాడుచేసి పైగా ఉల్ఫా ఒకటా ? దయచేసి చెప్పండి.

రామానుజ: నిజానికి ఏం చెప్పాలో నాకేం తెలియటం లేదమ్మాయ్ !

పంక : మా ఆయన విజిట్‌కి ఇరవై తీసుకుంటారు.

రామానుజ: (నవ్వుతూ) నన్ను పిల్చినప్పుడు ఫోన్లో పది రూపాయిల నలభై నయాపైసలే అన్నావుగా?

పంక : థేంక్సు! పోనీ అంతే యిచ్చుకోనీండి.

రామానుజ: (లేచి నిల్చుంటూ) కొంపతీసి నిల్చున్నపాళంగా నా చేతికే ఇచ్చేసేవ్? వెళ్ళొస్తా.

పంక : (లేచి నిలుచుని)మంచిదండి. నమస్కారం. సావకాశం గానే పంపుతాలెండి.

సుబ్బా: గుడ్ బై! రామానుజం! ఒకసారెప్పుడేనా మా యింటికి టీకి రావోయ్!

రామానుజ: తేంక్సు. తప్పకుండా. గుడ్ బై. (అంటూ ప్రొ॥ పరంధామయ్యకేసి తిరిగి) సెలవ్! మేష్టరు గారూ నమస్కారం.

ప్రొ॥పరం: మంచిదండి.

[రామానుజరావు నిష్క్రమణ]

సుబ్బా: చాలా సౌమ్యుడు. నిండా పెద్దమనిషి. అతన్ని చూస్తే అసలంత పెద్దలాయరని ఎవడూ అనుకోడు. మాయింటి కోసారి విందుకే పిల్చుకెళ్ళా లనుకుం టున్నా.

పంక : అదుగో! ఆయనగారు! ప్రక్కగదిలో ఈల పాడు తున్నారు. చాలా ఉల్లాసంగా ఉన్నట్టుంది.

[డాక్టరు రంగధామారావుప్రవేశం. మంచిరూపసి. మూడు పదులమీద ఐదేళ్ళ ప్రాయం. ఆడంబరమైన

వేషధారణ ఉల్లాసమైన ముఖముతో ఎంతో చలాకీగా ఉంటాడు. మంచి మాటకారి. అదే కొంతవరకూ పంకజాక్షి అవివేకంగా ఆయనగార్ని అపార్థం చేసుకోటానికి కారణం కూడా.]

రంగధామం: పంకజం! హల్లో! ఏమిటి సంగతా అనుకుంటున్నా? నువ్వు కనుపించకపోతే.

పంక:- ఏం?

రంగధామం:- నేను ఇంట్లో అడుగుపెట్టగానే పరుగెత్తుకు రావటం అలవాటుకదూ నీకు?

[పంకజాక్షి దాటుకొచ్చే చిరునవ్వు దాచుకుంటూ]

పంక:- మా అమ్మ ఇక్కడుంది... భర్తృ తత్పరురాలు...

రంగధామం:- (ఉల్లాసంగా) ఐతే! ప్రేమతత్పరుడైన భర్తని అలక్ష్యం చేస్తావు... (అని నవ్వుతూ) అత్తయ్యా! కులాసాగా వున్నారా?...ఓహో! సుబ్బారాయుడు గారుకూడా ఇక్కడే వున్నారే? ఎంగేజిమెంట్లేం వున్నట్లు లేదు.

సుబ్బా:- ఏమిటోయ్ నీ భావం?

రంగ:- (గదిలో చిందర వందరగా పడివున్న కాఫీకప్పుల కేసి చూస్తూ) మీరంతా ఏదో పార్టీ చేసుకున్నట్లున్నారు!

పంక:- ఏంలేదు... కోపాలో వేడికాఫీవుంది ఇంకా.

రంగ:- (కప్పులో ఆవిరొస్తూన్న కాఫీ పోసుకుంటూ) దేముడి దృష్టి మొదటినుంచి నామీద ఇట్లాగే వుంటూంది.

ముందిగా నామార్గంలో ఏవేవో ఆశలూ, ఆకాంక్షలూ వుంచుతూనే వున్నాడు. పతనానికి హేతువు! మాయింట్లో అందరికీ కాఫీఅంటే చాలాప్రీతి. నాకు సరేసరి. అదిచూస్తే నోరూరుతుంది. (అంటూ కాఫీ త్రాగడాని కుపక్రమిస్తాడు)

సుబ్బా:- కాఫీకి అలవడ్డంతమాత్రాన మంచి కుటుంబం అనుకోవడం అవివేకం... మార్కెట్ బంట్రోతుకి కాఫీఅంటే ఒళ్లు తెలియదు.

రంగ:- వాడు బహుశా ఏదో బ్రతికిచెడ్డ ఇంటిబిడ్డడయి వుంటాడు. అడిగి చూడండి? ఏమిటి సంగతి పంకజం?

పంక:- (ఆశ్చర్యంగా) నా సంగతా?

రంగ:- ముభావంగా వుంటున్నావు?

పంక:- ఏం?

రంగ:- నాకేం తెలుసు? మామోలుగా లేవుకదూ నువ్వు? ఏం? ఈవాళ నేనెక్కడికి వెళ్ళేనో, ఏం చేసేనో ఇంతవరకు అడగకుండా కూర్చున్నావు? ఆ విషయంలో ఎంతో శ్రద్ధకనపరచ వలసినదాని వాయె.

పంక: (తండ్రిపై కొకసారి దృష్టిప్రసరించి) చెప్పాలనుంటే మీరే చెప్తారనుకున్నా.

రంగ: అందుకే నన్నలుసుగా చూస్తున్నావన్నా, నా ఆర్జనంతా నీ జాగ్రత్తకే అవుతూన్నది. కారుకొన్నాను. వంటకి మనిషిని పెట్టేను. కాని నువ్వుమాత్రం నేనేం చేస్తున్నదీ కించిత్తయినా శ్రద్ధతీసుకోవడంలేదు.

పంక: (చిరునవ్వుతో) అయితే చెప్పండి. ఈ సాయంత్రం యేంచేసేరో?

రంగ: (ఎంతో తేలికపడ్డట్టు శ్వాస ఒదులుతూ) అమ్మయ్యా! ఇప్పుడే ఎంతో ముఖ్యమయిన కేసొకటి వచ్చింది. దానిగురించి ఎంతో చికాకుపడి దాదాపు గంటదాకా కుస్తీపట్టే. కాని యీవృత్తిలో ఇలాంటివెన్నో వస్తూవుంటాయి.

పంక: గంటసేపే?

రంగ: ఔను. ఆపరేషనంటే ఏమిటనుకున్నావ్?

పంక: నిన్నా ఏదో ఆపరేషను చేసినట్లుంది?

రంగ: నిన్నా? ఔనౌను. ఆవిడగా రసలే గ్రాభ రామనిషి. దానికితోడు తరుచూ ఏదో ఆపరేషను తగులుతూనే వుంది.

పంక: అది మంచిదే కదూ?

రంగ: ఏంమంచి పోనిస్తూ. ఆవిడగారికి నామీదేం, నమ్మకం కుదిరినట్టు లేందే!

పంక: ఆపరేషనుమీద ఆపరేషను తగుల్తే మీకేం, రెండింతలు గుంజుకోవచ్చునుగా?

రంగ: ఔ నందులో అలాంటి అవకాశం ఉంటుందనుకో.

పంక: ఏదో పోనీలెండి! ఎంతకాలంగానో పొళ్ళగాజులు కొనుక్కోవాలనుకుంటున్నా. ఇప్పుడు కొనుక్కుంటా.

రంగ: (తెల్లమొగం పెడుతూ) అబ్బే! ఆవిడగారింకా పైకం చెల్లించందే?

పంక: మరేం బాధలే! ఆ మాత్రం వాళ్లు అరువుంటారు.

రంగ: (మాట మళ్ళించడానికి) ఆపరేషను పూర్తిచేసుకుని తలదిమ్మెత్తినట్లుంటే అలా క్లబ్బుకిపోయి కాస్సేపు బ్రిడ్జి ఆడుకొచ్చేను.

పంకజాక్షి: అన్నట్లు మీారు ఆపరేషన్లు చేస్తున్న ఆవిడపేరేం పేరు?

రంగ: ఆవిడగారి పేరా?

పంక : ఔనౌను...ఇప్పుడే మా బాబాయికి చెప్తున్నామీాకు బాగా డబ్బిచ్చే పేషెంట్ ఒకావిడ దొరికిందని పేరు బొత్తిగా జ్ఞాపకం లేకుండా పోతోంది.

రంగధామం: (చిక్కులో పడ్డట్టు) ఓ! శ్రీమతి స...స... సరళ ఆవిడగారి పేరు.

పంక : శ్రీమతి సరళ ఏమిటండి?

రంగ : శ్రీమతి సరళాప్రసాద్.

సుబ్బా: అదేమిటోయ్? శ్రీమతి సరళాప్రసాద్? ప్రసాద్ గారి కుటుంబంలో ఆ పేరే వినలేదే?

రంగ : అబ్బె! అబ్బె! ఆవిడపేరు సరళాప్రసాద్ కాందే?

సుబ్బా: ఇప్పుడే కాదుటోయ్ చెప్పేవ్ స్పష్టంగా శ్రీమతి సరళాప్రసాద్ అని?

రంగ : అదికాదు పంకజం. శ్రీమతి ప్రసాద్ గురించి నేనేం చెప్పిందే?

పంక : అయితే మరి ఆవిడగారిపేరు ?

రంగ : ఆవిడగారిపేరు శ్రీమతి సరళాదేవి. ఇంతసేపాయి అదేగా చెప్తున్నా ?

సుబ్బా: తొట్రుపాటులేకుండా అలా అని ఎందుకు చెప్పలేక పోయినట్టో ?

పరం : ఇంతకీ నీకింత కామధేనువులాంటి పేమెంటు ఎట్లా దొరికిందోయ్ ?

రంగ : అదృష్టం అంటూ ఉంటే అంతేలెండి. నా గురించి ఎంతో గొప్పగా ఆవిడగారు... పంకజం ఎవరావిడా ? నీ స్నేహితురాలు తరుచూ వస్తూంటుంది? ఆవిడ పేరు?

ప్రొ॥పరం: ఓయ్ రంగధామం? నీకు పేర్లు బొత్తిగా గుర్తుండనట్టుంది ... చేతి రుమాలు చివరిని చిన్న ముడేసుకోవోయ్ !

రంగ : ఆవిడగారు పంకజం స్నేహితురాలు ... ... (గుర్తు తెచ్చుకోటానికి ప్రయత్నిస్తునట్టు నటిస్తూ) ... ఆవిడ గారి భర్తకి ఎగుమతి దిగుమతి వ్యాపారం ... కదూ?

పంక : ప్రేమవల్లి.

రంగ : అదుగో ! ఔను ప్రేమవల్లి.

సుబ్బా: వాళ్ళది గోదావరిజిల్లా అనుకుంటా.

రంగ : ఆ గొడవ నాకేం తెలియదు. అంతగా ఆవిడగారు నాకేం నచ్చకపోయినా మంచి అందంగా మాత్రం ఉంటుంది.

[ఆ మాట లంటున్న సమయంలో ప్రేమవల్లిని తోడ్చుకొని పనిపిల్ల ప్రవేశిస్తుంది - ప్రేమవల్లి చాలా అందం, ఆడంబరంగల మూడుపదులు దగ్గర పడ్డ యువతి. నవనాగరికురాలు.]

పనిపిల్ల: అమ్మా! ప్రేమవల్లిగారొచ్చేరు.

[రంగధామం భయంతో బిత్తరపోతాడు. పనిపిల్ల బయటకు పోతుంది. క్షణంపాటు అంతా అగమ్యంగా ఉంటుంది. కాని త్వరగా పంకజాక్షి తేరుకుని ఆప్యాయంగా అతిథి కెదురుపోతోంది.]

పంక : రండి! రండి! కులాసాగా ఉన్నారా?

ప్రేమవల్లి: వేళకానివేళ వచ్చినట్లున్నా!

పంక : అదేం లేదులెండి. ఏవేళప్పుడు మిమ్మలిని కలిసినా ఆనందంగానే వుంటుంది నాకు.

ప్రేమ: మధ్యాహ్నంనుంచి బజార్లో ఏవేవో కొంటూనే వున్నా... హఠాత్తుగా, మిమ్మల్ని కలిసి చిరకాలం అయినట్టనిపించింది....

పంక : మా అమ్మని తెల్సా మీకు?

ప్రేమ: నమస్కారమండి.

పంక : ఆయన మా బాబాయ్! ఆ ప్రక్కన మామామయ్య.

సుబ్బా: నమస్కారమండి.

[వాస్తవంగా ప్రేమవల్లి సౌందర్యానికి సుబ్బారాయుడు ముగ్ధుడగుతాడు.]

ప్రేమ: (రంగధామం కేసి మృదువుగా తిరిగి) నన్ను మరి చూండ రనుకుంటా.

రంగ: ఎంతమాట!

ప్రేమ: మనం కలుసుకుని చిరకాలం అయిందికదూ?

రంగ: బహుకాలం అయింది.

ప్రేమ: నిన్న పార్కులో మీ ప్రక్కనుంచే పోయా! మీరు బుర్రెత్తుతేనా?

రంగ: క్షమించాలి. నా దృష్టి కొంచం మందం.

పంక: అదేమిటండి? కట్టుకథ లెందుకు చెప్తారు? కలవ రేకుల్లాంటి కళ్ళుంచుకుని?

సుబ్బా: (ఆడంబరం ఉట్టిపడే హార్బాటంతో) అందమైన అమ్మాయిని గుర్తించక పోవటానికి సాకు శారీరకం గానే ఉండా లనుక్కునుంటా డాయనగారు.

ప్రేమ: ఎంత చక్కగా చెప్పేరండి?

సుబ్బా: దానికేంలెండి! దానికేంలెండి!

పంక: ఆయనగారికి అంత గొప్పింటికేసు అప్పగించినందుకు నా ధన్యవాదాలండి.

రంగ: (తొట్రుపాటుతో ప్రేమవల్లి చూపుల్లో విభ్రాంతి గుర్తించి) మా ఆవిడికి ఇప్పుడే సరళాదేవి సంగతి చెప్తున్నా.

ప్రేమ: (కించిత్తూ అర్థంకాక) ఓహో! ఔనౌను.

రంగ : మీరెంతో శ్రమతీసుకుని ఆవిడగారికి చెప్పేరటగా? నాకోసం కబురుచెయ్యమని. మధ్యాహ్నంవెళ్ళేఁ ఆవిడ గారిని చూట్టానికి.

ప్రేమ: (అవగాహన చేసుకుంటూ) అదా! ఔనౌను పని గట్టుకు పరిచితులకి శక్తికొద్దీ సహాకరించటం నా ఆశయం. ఆవిడగారు మీకు బాగా నచ్చిం దను కుంటా. పెద్ద జమీందార్లులెండి వాళ్లు.

పంక : ఆవిడగారిని తరుచూ ఇంటికివెళ్లి పరీకించాల సుంటుం దనుకుంటా.

ప్రేమ: ఔనౌను, డాక్టరుగారంటే ఆవిడగారికి అపరిమితంగా గురి కుదిరింది. ఇప్పుడు నాతో ఆసంగతంది. పాపం ఎంతో జబ్బుపడి పూర్తిగా పాలిపోయింది.

రంగ : నిజానికి మీకు అసలు సంగతి చెప్పాలంటే ఆవిడ గురించి నే నెంతగానో ఆందోళన పడుతున్నా.

ప్రేమ: డాక్టరు రంగధామారావుగారు ఇంక ఆవిడ వైద్య విషయం స్వయంగా శ్రద్ధ తీసుకుంటారంటే మాలాంటి ఆప్తు లందరికీ తృప్తిగా ఉంది.

సుబ్బా: ఆవిడ కూనవరంవారితాలూకా?... వక్కలంకవారి తాలూకా? అని...

రంగ : అదేం తెలియదునాకు.

సుబ్బా: ఏం తెలియదంటావేమిటోయ్? ఆ రెండింట్లో ఏదో కుటుంబానికి విధిగా ఆవిడగారు చెంది ఉండాలే?

రంగ : దేనికో దానికి ఏటేనా ఒకటే.

పంక : ఎట్లా ఉంటుంది ఆవిడగారు ?

రంగ : అబ్బే ! నాకేం తెలియందే. అందరిలాగే ఉంటుం దనుకొంటా.

పంక : అదేం చిలిపితనమండీ ! ఆవిడగారు లావుగా వుంటుందో అరిపిగా వుంటుందో మీకు విధిగా తెలిసుండాలి.

రంగ : (ప్రేమవల్లి కేసి చూస్తూ) కాస్త దుబ్బుగానే వుంటుం దని చెప్పాలి. ఏమండీ ?

ప్రేమ: కాస్తేం ? చాలా దుబ్బుగా ఉంటుంది.

పంక : అలాగేం ?

రంగ : తలకట్టు కొద్దిగా తెల్లపడుతూన్నట్టుంది... కదూ ?

ప్రేమ: అయితేనేంలెండి. వెండిగాజుల మలారంలా నొక్కుల్తిరిగి వుంటుంది.

పంక : (నవ్వుతూ) ఆవిడగారికి అంత జుట్టూ వాలుజడేసుకోడానికి చాలా శ్రమవుతుం దనుకుంటా.

ప్రేమ: ఆవిడగారి నయనాలు నీలపుతునకల్లా వుంటాయి కదండీ ?

రంగ : ఔనౌను ! ఆవిడగారి కళ్ళు కెంపు నీలాల్లా తళతళ లాడుతూంటాయి.

పంక : ఆవిడగా రింటిపేరేమిటో ?

తంగ : సస - సస - అబ్బే సరిగ్గా నాకు తెలియదు.

ప్రేమ: (తడుముకోకుండా) తటపర్తి సరళాదేవి.

పంక : తటపర్తి సరళాదేవి? అన్నట్టు అమ్మా తటపర్తి సరళాదేవిగారిని నీకు బాగా తెలుసుకదూ? మరడాం జమీందారుగారి భార్య, మజాగావుండే!

ప్రొ॥పరం: తటపర్తి సరళాదేవి. నాకు బాగా గుర్తుంది. బొద్దుగా మనిషీ, ఉంగరాల తలకట్టూ, చక్కని నీలాల్లాంటి కళ్ళూ- మరడాం?

పంక : అమ్మా! నువ్వోసారి చూస్తే ఆవిడగారు చాలా సంతోషిస్తుందేమో?

రంగ : ఇప్పట్లో ఆవిడగారు ఎవరిని చూట్టానికి వీలుపడ దనుకుంటా.

ప్రొ॥పరం: పోనీ! ఆవిడగారి అనారోగ్యం గురించి తెలుసుకుని మేం అంతా చాలావిచారించేమని చెప్పవోయ్.

రంగ : ఓ! దానికేం ఆవిడగారికి మీా రేం చెప్పమన్నా చెప్పేస్తాను.

జానకమ్మ: (బిగపట్టినట్టు లేచి నిల్చుంటూా) ఇంక నే నింటికి పోవాలి (భర్తతో) మీారు వస్తారండీ?

ప్రొ॥పరం: పదపద. పేపర్లు దిద్దుకోవాలి. బోలెడు పనుంది నాకు.

[పంకజాక్షి తల్లినీ తండ్రినీ సాగనంపటానికి సావిడిదాకా పోతుంది. సుబ్బారాయుడుకూడా గది బయటకు వెళతాడు. ప్రేమవల్లి ప్రక్కన రంగధామం మాత్రం మిగుల్తాడు.]

రంగ: (గుసగుస లాడుతూన్నట్టు చిన్న స్వరంతో) ఇస్! అసలు నువ్విప్పుడు ఇక్కడి కెందుకొచ్చినట్లు?

ప్రేమ: మనం తిరిగి రే పెప్పుడు కలుసుకోవాలో ఇందాక నువ్వు వచ్చేముందు తేల్చుకోలేదుకదూ? అందుకని.

రంగ: ఆరి దేముడా! ఆసంగతికాస్తా ఫోన్లో కనుక్కుంటే పోయేదిగా?

ప్రేమ: అమ్మో! టెలిఫోన్ని నే చస్తే నమ్మను.

రంగ: చస్తే నమ్మవ్? ఫోన్ని. ఏమిటి నీ వూహా ... గొంతు మార్చి ఫోన్లో గలాటా చెయ్యటం నీకు అలవాటులా ఉందే?

ప్రేమ: డాక్టర్!

రంగ: డార్లింగ్! తమాషాకన్నా మరేంకాదు. మన్నించు.

ప్రేమ: అది సరేకాని పీకలమీదికి ఆ దిక్కుమాలిన సరళా దేవి కట్టుకథెందుకల్లేవ్?

రంగ: దానంతటదే అల్లుకుపోయింది. నేనేం అల్లలేదు. ప్రతి రాత్రి నా ఆలస్యానికి సాకు చెప్పాలిసుంటోంది.

ప్రేమ: అయితే మీ ఆవిడగారు అనునిత్యం నువ్వెక్కడున్నదీ ఎక్కడికెళ్ళేదీ నిలతీస్తోందన్నమాట. మాయదారి దాంపత్యం. (అమాయకంగానే) అన్నట్టు ఈ రాత్రికి నీ కార్యక్రమం?

రంగ: (చిద్విలాసంగా) నేనూ, పంకజం ఓ మిత్రుడింటికి విందుకు వెళ్లి అక్కడనుంచి చలా పిక్చెరుకి వెళదాం అనుకున్నాం.

[సుబ్బారాయుడు పునః ప్రవేశం:]

సుబ్బా: (ప్రేమవల్లితో) వస్తానండి. గుడ్ నైట్!

ప్రేమ: (నాజూకుగా నోటికి పట్టకుండా) గుడ్ నై...!

సుబ్బా: (పంకజాక్షితో) అమ్మాయ్! ఏంఅందం, ఏంచందం? గ్రేటాగార్బో!

పంక: (కోపం నటిస్తూ) మామయ్యా!...

సుబ్బా: (నాలుక కర్చుకున్నట్టు నటిస్తూ)మరేం బాధలేదు... అమ్మాయ్! గొడవచేస్తే పిట్ట బెదిరేను!... వస్తా...

[అంటూ అప్పుడే గుమ్మం దిగుతున్న అక్కనీ బావనీ కలుస్తాడు.]

ప్రొ॥పరం: (నడుస్తూ సాగనంపటానికొచ్చిన పంకజాక్షితో) కాస్త ధైర్యం చిక్కిందికదమ్మా?

పంక: బాధలేదు బాబాయ్! మీారింకేం ఆ గొడవ పట్టించుకో బోకండి. ఇప్పు డిప్పుడే నాకు కొంత నిర్భరం కలుగుతోంది.

ప్రొ॥పరం: (మందహాసంతో) నేను కనిపెడుతూనే వున్నా అమ్మాయ్!

[అంటూ బయటకు పోతాడు.]

ప్రేమ: (గదిలో తిరిగి ప్రవేశిస్తూన్న పంకజాక్షి మొగములోకి చూస్తూ) మీా మామయ్యాం బలే ముచ్చటైన మనిషిలా... వుందే?

పంక : మిమ్మల్నిచూసి... కాదు... కాదు మీ అందంచందం ఆయనగార్ని భృత్యుడ్నిచేసివేసింది. గ్రేటాగార్బోలా ఉన్నా రంటున్నాడు.

ప్రేమ: దానికేంగాని, నే పద్మినీజాతి స్త్రీత్వంగల స్త్రీనని పురుషులు అంటూ ఉంటారు.

పంక : అదే! అదే! దానిపేరే అది.

ప్రేమ: నేనుకూడా వెళ్ళొస్తానండి. అసలింత ప్రొద్దుపోయిందనుకోలేదు.

పంక : రాత్రి మీ కేం పనుందా?

ప్రేమ: అబ్బే! ఏం లేదండి. రాత్రిపూట ఏదో పుస్తకం పుచ్చుకు ప్రశాంతంగా గడపటం అలవాటు నాకు.

పంక : అలాగా! చల్లపొద్దున ఉల్లాసంగా ... విలాసంగా బయట తిరగటం మీ కలవాటనుకుంటున్నా!

ప్రేమ: ఔననుకోండి, కాని...మా ఆయనికి నే యింటిదగ్గరే గడపటం కోరిక ... కాకున్నా ఆయనగారు దేశంకోసం అంతులేని వ్యాపారాల్లో మునిగి తేల్తూ ఉంటే నా కంతగా ఆనందాలమీాదికి మనసు పోవటంలేదు.

పంక : నిజంగా మీ నైజం చాలా మంచిదండి.

ప్రేమ: (రంగధాముం కేసి తిరిగి) మీకు తెలుసుగా? మా ఆయనకి వూపిరాడని వ్యాపారం. పైగా ఈ మధ్య వర్తక సంప్రదింపులకు విదేశాలుకూడా పోతున్నారు. ఆయనతో కూడా తిరగటానికి నా ఆరోగ్యం ఏంఅంత మంచిదికాదు. అందుకేగా వూర్లో ఒంటరితనం భరిస్తూవుంటా!

పంక : చాలా మంచివారు! నాకో చిన్న సహాయం చేసి పెడతా రనుకుంటూ – మీారు.

ప్రేమ: ఎంతమాటండి. మీాలాంటి మిత్రులకు నేను చెయ్య లేనిదంటూ వుంటుందా అని?

పంక : నిజానికి మధ్యాహ్ననుంచీ తీవ్రంగా నాకు తలపోటు తినేస్తోందండి అదేమిటోగాని...

రంగ : (డాంబికంగా) నే నింటికొచ్చినదగ్గరనుంచి అనుకుం టూనే వున్నా. ఈరోజు అలాంటిదేదో నిన్ను బాధిస్తోందని.

పంక : మేం యీా రాత్రి పిక్చరుకి పోదాం అనుకున్నాం. ప్రస్తుతానికి నాకు బదులు డాక్టరుగారితో దయచేసి మీారు తోడుగా పోగలిగితే చాలా సంతోషిస్తా.

[క్షణంలో ప్రేమవల్లి, రంగధామం మధ్య ఓ చిన్న దొంగచూపు దోబూచి పెట్టిపోతుంది.]

ప్రేమ: నేనా?

పంక : ఔనండి, ఆయనగారికి ఒంటరిగా బయటికి పోవటం నచ్చదు. నేనసలు కన్నెత్తలేకుండా ఉన్నానాయె. మీారు ఆయనతోబాటు కొంచం ఇక్కడే పాలు పుచ్చుకు మరీ పోవచ్చు.

రంగ : అదేమిటి పంకజం? అయితే నిజంగా నువ్వు రాలే నంటావా?

పంక : నిజమేనండి. ఈరోజు నేను యిల్లు కదలటం అన్న ప్రశ్న లేదు.

ప్రేమ: డాక్టరుగారు యీ పూటకి యిల్లు కదలకుండా మీ ఆరోగ్యం కనిపెట్టాలనుకుంటుందేమో ?

పంక : అదేంకాదులెండి. ఆయనగారు పాపం రోజల్లా కష్టపడి పనిచేస్తున్నారు. పైగా యీ మధ్యాహ్నం గంటకి పైగా ఓ అతిగడ్డు ఆపరేషనొకటి చేసేరాయె. కాస్త అలా తిరిగొస్తే ఆయనగారి ఒంటికి మంచిది.

ప్రేమ: నేను, కూడా రావటం మీకు నచ్చుతుందండి ?

రంగ : నచ్చడం ఏమిటి ? నందనవనంలా వుంటుంది, ఇంతకీ మీకు చికాకెత్తకుండా వుండాలిగాని ?

ప్రేమ: (ఓరగా చూస్తూ) చికాకెందుకు ? మీకు నందన వనంలా వుంటే నాకు యమునాతీరంలా వుంటుంది.

పంక : చాలా సంతోషమండి. వేళవుతోంది. కాస్త వేడి వేడి పాలు తీసుకు బయలుదేరండి.

[అంటూ పంకజాక్షి పనిపిల్లకి "ప్రియంవదా" అని కేకవేసి "కొద్దిగా పంచదార కలిపి రెండు గ్లాసులతో వేడి వేడి పాలు తీసుకురా" అని చెప్పను.]

రంగ : ఇప్పుడు నిన్ను విడిచి బయటికి పోతే పంకజం నీకేం బాధ లేదుకదూ ?

పంక : పరవాలేదండి.

రంగ: మరి వుండయితే నీకేదానా కొంచం మందు కలిపి యిచ్చి మరీపోతా.

పంక : (తొందరగా) అమ్మో ! ఏం అక్కరలేదండి. నాకేం మందు పుచ్చుకోకపోతేనే తెరిపిగా వుంటుంది.

రంగ : ఛాఛా! అదేమిటది వుండు. ఓ చిన్న డోసు కలుపు కొస్తా. (అంటూ బయటకు పోతాడు.)

ప్రేమ: చూసేరా! సిద్ధంగా యింట్లో డాక్టరు వుంటే ఎంత సదుపాయమో?

పంక : (వ్యంగ్యంగా) ఔనౌను. చాలా గొప్ప సదుపాయం!

ప్రేమ: మీ ఆయన ఎప్పుడూ మీ పజ్జనుంటే నాకదేమిటో కన్ను కుట్టుకున్నట్టుంటుంది. దేశంకోసం విదేశాల్లో వ్యాపారం చేస్తూన్న మా ఆయన్ని తల్చుకుంటే - చెపితే నమ్మండి నే వెళ్ళిన ప్రతి డాక్టరూ ఆయనతో కలిసుంటే నా ఒంటికి మంచిది కాదనే సలహా.

[రంగధామం ఒక ఔన్సు గ్లాసులో పాలలాంటి తెల్లటి మందు ద్రవంతో ప్రవేశం.]

రంగ : ఇదుగో తెచ్చా!

పంక : ఇప్పుడు నాకేం వద్దు సుమండి.

రంగ : అలా చిలిపిగా మాట్లాడకు పంకజం. ఇది నీ కెంతో గుణం చేస్తుంది.

ప్రేమ: ఆవిడ కాస్త అలా పడుకోవా లనుకుంటా.

పంక : అదేం అక్కరలేదు. ఇలా నిల్చునే పుచ్చుకుంటా

రంగ : పంకజం! అదేమిటి అన్నింటికీ పసిపిల్లలా పేచీ, పోనీ ఈ సోఫాలో యిలా వాలు.

పంక : తప్పదంటే మరేం చేయను. (అంటూ సోఫాలో వాలుతుంది.)

ప్రేమ: మేం పోయేముందు మీకు బాగా సదుపాయంచూసి మరీ వెళతాం.

రంగ : ఉండండి! వెనక్కి ఓ తలదిండు సర్దుదాం. (అంటూ ప్రక్క సోఫాలోంచి ఓ దిండు తీసి పంకజం వెనక్కి వుంచుతాడు.) ఏం పంకజం? ఇప్పుడు బాగుందికదూ?

పంక : ఛాలా బాగుందండి.

రంగ : పాపం చాలా బాధగావుంది కాబోలు ?

ప్రేమ: ఆవిడ పాదాలుకూడా కాస్త కప్పాలనుకుంటా.

రంగ : ఇదుగో ఈ శాలువ కప్పేద్దాం. (అంటూ బట్టల బీరువాలోంచి ఓ శాలువ తీసి కాళ్ళమీద కప్పు తాడు)...ఏదీ! ఇంక యీ మందు తీసుకో...

పంక : ఒద్దండి! అలా వుంచండి. మీరు వెళ్ళేక తీసుకుంటా ...ఆ అలా పెట్టండి...విధిగా తీసుకుంటాగా ?

రంగ : అదేం పనికిరాదు. ఇప్పుడే ఎందుకు తీసుకోకూడదూ అని...?

పంక : మీ ముందు వికారంగా మొగం చిట్లించుకు మందు నోట్లో పోసుకోటానికి మనస్కరించటంలేదు...అంతే.

రంగ : ఒస్! ఇదివర కెన్నిసార్లు నా ముందు చిలిపిగా మొగం చిట్లించేవో? గుర్తు తెచ్చుకో!

పంక : అది మీముందేగా? ఆసంగతి వేరు.

రంగ : మరి ఇప్పుడూ మంచిపిల్ల మాదిరిగా బుద్ధిగా పుచ్చేసుకోవాలి.

పంక : అలాగే మీరు వెళ్ళేక...

ప్రేమ: (దృఢ నిశ్చయంతో) అదేం పనికిరాదు. అసలు మీరా మందు తీసుకుంటేగాని నేనీ గదిలోంచి కదిలేదేలేదు.

పంక : (నిస్పృహతో) ఇలాతెండి (వికారంగా మొగం చిట్లించుకు పంకజాక్షి మందు మ్రింగుతుంది) మిమ్మల్ని కట్టుకు పీకమీదికి తెచ్చుకున్నా (కోపంగా)

రంగ : ఓ క్షణంలో ఆ మందు వంటబట్టి నీ కెంతో ఉల్లాసంగా వుంటుంది.

పంక : అసలు నా కుల్లాసం అక్కరలేందే?

ప్రేమ: (పనిపిల్ల అందిచ్చిన పాలగ్లాసు కాళీచేసి) ఇంక వెళ్ళి వస్తానండి ... పాపం మీ కొంట్లో బాగాలేదంటే నాకు చాలా విచారంగావుంది.

రంగ : (పాలగ్లాసు కాళీచేసి ప్రక్కబల్లమీద పెడుతూ) వెళ్ళి వస్తాం పంకజం!

పంక : మంచిదండి. మీకు మంచి సరదాగా కాలక్షేపం అవుతుందనుకుంటా.

[రంగధామం, ప్రేమవల్లి బయటకు నడుస్తారు. పంకజాక్షి ఒక్క వూపున లేచి నిలుచుంటుంది. కోపంగా తలదిండు ప్రక్కకు విసిరి కొడుతుంది. అప్పుడే బైటకుపోయిన రంగధామాన్ని ప్రేమవల్లినీ తిరిగి పిలవటానికా అన్నట్టు చెకచెకా గది గుమ్మంకేసి ఒకటి రెండడుగులువేసి హటాత్తుగా ఆగిపోతుంది ]

పంక : వద్దు ! పిలవకూడదు ! పిలవను.

[మెల్లగా వెనుకకువచ్చి సోఫాలో కూలబడి కండ్ల నిండిన నీరు బొటబొట కార్చుచూ బిగ్గరగా రోదన చేయును.]

మొదటిరంగం సమాప్తం.

—: o :—

# రెండవ రంగము

తెర : [అందంగా అలంకరించబడ్డ డాక్టరు రంగధామా రావు హాస్పిటల్ గది. గోడలకు ప్రఖ్యాత చిత్రకారుల వర్ణ చిత్రాలు వ్రేలకట్టబడి వుంటాయి. వాటిక్రిందగా చక్కటి రజితరంగు చట్రాల్లో ఛాయా చిత్రాలు అక్కడక్కడ అందంగా అమర్చబడి వుంటాయి, ఓ ప్రక్కగా పెద్ద టేబిలూ, దాని కుడిప్రక్కది తాజా గులాబీ పూలకుండీ, మధ్యగా నాజూకైన టేబిల్ లైటూ, ఎడమప్రక్కకి ట్రేలో కాగితాలూ, వైద్య గ్రంథాలూ అమర్చబడి వుంటాయి. రంగధామం కూర్చోటానికి ఒక రివాల్వింగు కుషనుకుర్చీ, దాని కెదురుగా టేబిలు కవతలిప్రక్క రోగి కూర్చోటానికి ఇంకొక కుర్చీ, ప్రక్కగావున్న ఇంకొక బల్ల మీద మందుల సీసాలు, టెస్టు ట్యూబులుంచుకునే స్టేండు, వరుసగా పెద్ద సీసాలలో రసాయనద్రవ్యాలు, ఆ సీసాలవరకూ వ్రేలాడ తీయబడ్డ మరొక విద్యుద్దీపం, రోగులు పడుకోడానికి ఒక చేతులులేని సోఫా, దాని ప్రక్కగా రెండు మూడు కుర్చీలు, ఒక గోడ ప్రక్క బీరువాలో వైద్యగ్రంథాలూ, ఆ ప్రక్కగానే వారం వారం వచ్చే వైద్య పత్రికల దొంతి. మరో చిన్న పేముబల్లా అమర్చబడి వుంటాయి. రివాల్వింగు కుర్చీలో రంగధామం కూర్చొని వుంటాడు. రబ్బరు

తిత్తి అంతవరకూ చెవులకు తగిలించబడే వుంటుంది. ప్రక్కగా నిల్చున్న రోగి చొక్కా బొత్తాయిలు సరి చేసుకుంటూ వుంటాడు. తరువాత రోగి కోటు వేసుకుంటూ వుండగా సంభాషణ ప్రారంభం అవుతుంది. బట్టతలా బంగారు కళ్ళద్దాలతో పొట్టిగావున్న ఆ రోగి కొద్దిగా భయస్తుడిలా కనపడతాడు. మొగ మాటంతో నసుగుతూ మెల్లగా మాట్లాడే నైజం గల మనిషి.]

రంగ : ఇప్పుడు మీకో ప్రిస్క్రిప్షన్ వ్రాస్తా, వ్రాయమన్నారా?

రోగి : అయ్యో! దయచేయించండి. మీకు చాలా శ్రమ యిస్తున్నా;

రంగ : మరేం బాధలేదు. ప్రస్తుతం మీ కేంమందు నచ్చుతుందో చెప్పండి. అదే వ్రాస్తాను.

రోగి : (పూర్తిగా చిక్కులో పడ్డట్టు) ఓ! మీ కేది యివ్వాలనుకుంటే అదే...దయచెయ్యండి. చాలా శ్రమ యిస్తున్నాను.

రంగ : మీకు ప్రస్తుతం జబ్బేం అంతగా లేదు ... అది తెలుసుకదూ మీకు?

రోగి : ఓ! చాలా విచారిస్తున్నా ... నాకు నిజానికి ... నిజానికి...

రంగ : మీకు బాగా తృప్తి కలిగిందనే భావిస్తా.

రోగి : (క్షమాపణ పూర్వకంగా) ఎంతమాట! పూర్తిగా తృప్తి కలిగింది. అదికాదు నే ననుకుంటున్నది. మీకు చాలాకాలం నాగురించి ఖర్చు చేసేను.

రంగ : వాస్తవానికి ఏ జబ్బులేని రోగులవల్లే మా వైద్యులు బ్రతికేది. ఏదో వ్యాధే అంటూవుంటే వాళ్లు కోలు కోవటమో, లేక కైవల్యానికి చేరుకోవటమో జరిగి పోతుంది – ఏదైనా అంతతో వాళ్ళ సంగతి సరి.

రోగి : ఓ! ఔనౌను...ఆ సంగతి నా కెప్పుడూ తట్టనేలేదు సుమండీ...ఈవాళ చాలా చల్లగా వాతావరణం బాగుందండి...కదూ?

రంగ : అలా కూర్చోండి.

రోగి : తేంక్యూ, తేంక్యూ, ఎంతదయ! మీకు చాలా వేళ వ్యర్థపుచ్చేను.

రంగ : ఒకసారి ఏం జరిగిందో తెలుసాండి? బాగా లోతట్టు గ్రామంనుంచి బస్తీకి తొలిసారిగా వచ్చిన రోగొకడు నా మెళ్లో వ్రేలాడుతూన్న "పాముని" చూసి బెంబే లెత్తి, పాపం! ప్రాణానికికూడా తెగించి, అమాంతం నన్ను కాటెయ్యకుండా "పాము" నుంచి కాపాడుదా మని మీదికి ఉరికి నా పీక పట్టుకున్నాడు– ఊపిరాడక ప్రాణం పోయినంత పనైంది. ఎలాగో తట్టుకుని ఆత్మ రక్షణకి విసురుగా వాడిని క్రిందకి తోసేసాను. పాపం, ఆ అమాయకుడు తన ప్రాణానికే తెగించి "పాము"ని పట్టుకోబోతే క్రిందకి విసిరి కొట్టిన నా

కేమాత్రం విశ్వాసం లేదని తిట్టుకున్నా డనుకోండి. అదుగో! అప్పటినుండి వైద్యానికొచ్చిన రోగుల్ని ఎప్పుడూ నా బల్లకు వెనుకతట్టునే కూర్చోపెడతా.

రోగి : (విపరీతమైన ఆందోళనతో) కొంపతీసి నేనూ అమాంతం మీదపడి మీ కంఠంముడి నొక్కేస్తానని భయపడటంలేదుకద మీరు?

రంగ : (నవ్వుతూ) అబ్బె! అదేం లేదులెండి.

రోగి : ఉదయంపూట ఉత్త ఓవల్‌టిన్‌మాత్రం తీసుకుంటాను. మధ్యాహ్న భోజనంలో పులుపూ, కారం బొత్తిగా తగ్గించుకు తింటానండి. రాత్రి భోజనం మానేసి చాలాకాలం అయింది. గోధుమ రొట్టెలు తీసుకుంటాను.

రంగ : (వినిపించుకోకుండా) ప్రస్తుతం మీ కేదేనా మందు అంటూ ఇయ్యకపోతే నా కిచ్చిన పైకం వ్యర్థమని బాధపడతా రనుకుంటా?

రోగి : ఎంతమాట! కాని మా ఆవిడ సంతృప్తికొరకేనా ఏదో మందంటూ తీసుకువెళ్ళటం తప్పనిసరి ... అందుకని...

రంగ : ఓహో! అయితే చూడండి! మీకు కాస్త పరవడి పెరిగి వుద్రేకం కలగటానికి కొంచెం స్ట్రిక్‌నిన్, దాంతోనే ఆ వేడి తగ్గించి తశ్శాంతి చెయ్యటానికి కొంచెం బిస్మత్తూ కలిపి యిస్తా. భోజనానంతరం ప్రతిదినం మూడుసార్లు పుచ్చుకోండి.

రోగి : తేంక్యూ, తేంక్యూ! నేనూ అల్లాంటిదే ఏదో పుచ్చు కుందాం అనుకుంటు నా ... ఆ తరువాత, ఇప్పుడు మీ ... ఇప్పుడు మీ ... (అని నసుగుతూ అతను లేచి నిలుచుంటాడు. ఎలా అడగాలో తెలియని చిక్కులోపడి తటపటాయిస్తూ వుంటాడు.)

రంగ : ఇంక మీకు నే చెయ్యాలిసిందేం లేదనుకుంటా?

రోగి : అబ్బె! ఏం లేదు ... ఏం లేదు. తేంక్యూ, మీకు చాలా శ్రమిచ్చాను. ఔను! మీ... మీ...

రంగ : (అర్థం చేసుకుని) ఓహో! నాఫీ, పది రూపాయిలు.

రోగి : (ఎంతో తేలిక పడ్డట్టు) ఓ! తేంక్యూ, అదే సరిగ్గా నేను మిమ్మల్ని అడగా లనుకుంటున్నది. చెక్కు వ్రాయమన్నారా!

రంగ : అయివేజులేని చెక్కులు అనేకరకాలొస్తూవుంటాయి అందుచేత సైకం రొక్కంరూపంలోనే పుచ్చుకోటం మా కలవాటు.

రోగి : ఔనౌను! అదీ నిజమే... మరేంలేదు మీకలా అయితేనే నచ్చుతుం దనుకున్నా... అంతే...

రంగ : డబ్బిస్తే డాక్టరు ఏమనుకుంటాడో ... ... ఎక్కడ తప్పట్టుకుంటాడో అని చాలామంది తటపటాయిస్తూ వుంటారు. అలాంటివాళ్ళందరికీ డబ్బు తీసుకోటానికి డాక్టరు ఎంత సంతోషిస్తాడో తెలిసుంటే బాగుండి పోను.

రోగి : ఔను... తేంక్సు... (రోగి కోటుజేబులోంచి ఒక క్రొత్త పదిరూపాలనోటుతీసి బెదురుతూ టేబిల్ లైటుమీద వుంచుతాడు.)

రంగ : అదేమిటయ్యా! దేనికేనా హద్దుండాలి. అక్కడ కాదు డబ్బుంచేది.

రోగి : క్షమించండి. నాకు తెలిసిందికాదు.

రంగ : క్రిందన టేబిలుమీద పెడితే బాగుంటుంది.

రోగి : తరుచూ డాక్టర్లదగ్గరకొచ్చి సంప్రదించటం అంతగా అభ్యాసం లేదులెండి.

రంగ : ఆ విషయం తెలుస్తూనేవుంది. లేకపోతే బహుశా ఓ అయిదు రూపాయిలు తీసి బల్లమీద పెట్టి అంతే వుందని చల్లగా జారుకుందురు. ముఖ్యంగా మీరే ఓ ఆడమని పైతే అంతపనీ జరిగుండేది.

రోగి : ఎంతమాట! నిజానికి నా కల్లాంటిదెప్పుడూ తట్టనే లేదనుకోండి.

రంగ : తేంక్యూ గుడ్ బై!

[రోగిని రంగధామం గుమ్మందాకా సాగనంపుతాడు. గుమ్మందగ్గర ప్రొ॥పరంధామయ్యనిచూస్తాడు.]

రంగ : హలో! రండి! రండి! (అంటూ మేడమీదికి కేక వేస్తాడు.) పంకజం! మీ నాన్నగా రొచ్చేరు.

[ప్రా॥ పరంధామయ్య లోనికి ప్రవేశిస్తాడు.]

ప్రా॥పరం: మేడమీదికి వెళ్ళి పంకజాన్ని చూసొస్తానోయ్.

రంగ : ఇక్కడొక గడియ కూర్చోండి. ఒక సిగరెట్టు కాల్చుకుని వెళుదురుగాని.

ప్రా॥పరం: ఏం? ఇంక మరి రోగులు రారా?

రంగ : అయిదయిపోయిందిగా? ఇంక మరెవరూ వస్తారనుకోను. మనం కాఫీకూడా క్రిందనే తీసుకోవచ్చు.

ప్రా॥పరం: ఎలావుందోయ్! ప్రేక్టిస్?

రంగ : పాడుగా వుందండి... ఇదిగో యీ పతిరూపాయిలే యీ సాయంత్రం అంతటికీ నా ఆర్జన.

[పంకజాక్షి ప్రవేశం.]

పంకజాక్షి: బాబాయ్!

ప్రా॥పరం: ఏం అమ్మాయ్! బాగున్నావా? కొత్త చీర కట్టుకున్నట్టున్నావే?

పంక : ఔను బాబాయ్! బాగుందికదూ? నాకు బాగా నచ్చింది.

రంగ : ఇదింకో కొత్తచీరా? పంకజం?

పంక : ఔనండి, ఏం?

రంగ : ఆ – ఏం లేదు.

పంక : పెద్ద పేరున్న డాక్టరుగారి భార్యా బట్టలకే బోలెడు పెట్టాలిసుంటుంది.

ప్రొ॥పరం : పాపం! ఇప్పుడేం అంటున్నాడమ్మా రంగధామం, ఆర్జనేం బాగోటంలేదని.

రంగ : వాతావరణం సమశీతలంగా చక్కగావుంటే అంతా ఆరోగ్యంగానే వుంటారాయె. ఈయేడు గాలివానలు గాని కత్తెరెండలుగాని లేవాయె. పైగా స్వాతంత్రం వచ్చేక ప్రభుత్వానికి పట్నవాసపు ప్రజలంటే ఒకటే అభిమానం. తారురోడ్లు, అండర్ గ్రౌండ్ డ్రెయినేజి, ప్రొటెక్టెడ్ నీటి సప్లయి. మరింకేం రోగాలొస్తాయో చెప్పండి? అయితే గియితే మాకు మిగిలిందల్లా పేటెంటుమందులూ, ఏదో జబ్బుందనుకుని మానసికంగా బాధపడే హైపోకేండ్రియారోగులూ, ఆ రెండూ మినహాయిస్తే పట్నంలోని సగంమందికిపైగా డాక్టరు మహాశయులు పస్తుండాలిసిందే.

పంక : ఆ, మరేం పరవాలేదులెండి! ఇవాళో రేపో మనింటి ముందే ఏదో ఘోరమైన బస్సు ప్రమాదం జరుగుతుంది లెండి.

రంగ : అబ్బే! అదేం లాభంలేదు పంకజం. ఘోరమైన బస్సుప్రమాదం జరుగుతే ... అంతా అమాంతం స్వర్గానికి నిచ్చెన కడితే ఇంక నా కొరిగేదేంటి? అదికాదు డాక్టరుకి కావలసింది. ఏదో మంచి అంటువ్యాధో, కాకపోతే ఓ కాంప్లికేటెడ్ ఇన్ఫ్లుయంజా ఓ వూర్లో ప్రవేశిస్తే అధమం ఓ మాసంపాటు మా అందరికీ చెయ్యిమెలొగ్గా పని, పర్సునిండా పైకం.

పంక : ఆ అంటువ్యాధేదో నాకేవచ్చిందనుకోండి. అప్పుడు?

రంగ : నీకే వచ్చేట్టయితే నాకేం? ప్రక్క వీధిలో వున్న నంగిరి పెద్దమ్మ నీకు మందిచ్చి నయం చేస్తాడు. సాటి డాక్టరుగారి ధర్మపత్నివి గనుక నిన్నేం అడగలేక నీళ్ళు నములుతాడు. ఎంతో కాలం వృధాగా దండుగ పడ్డందుకు తన అదృష్టాన్ని తిట్టుకు దారిపడతాడు.

పంక : (ప్రొ॥పరంధామయ్యతో) ప్రక్కవీధిలో నంగిరి పెద్దమ్మ అంటే అన్నాజీరావు. ఆయన వైద్యం అంటే నాకు నిజానికి చాలా నచ్చుతుంది - (భర్తకేసి విసురుగా చూస్తూ) ఈయనకన్నా చాలా నయం.

రంగ : (నవ్వుతూ) హోహోయ్! దుందుభీ!

పంక : డాక్టరు అన్నాజీరావు మంచంప్రక్క కూర్చుని రోగులతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతాడు.

రంగ : మంచంప్రక్కన నే నెంత ముచ్చటగా మాట్లాడు తానో నీకేం తెల్సు. (చేతులకేసి చూసుకుంటూ) లోపను మచ్చలు పోలేదు. చేతులు సబ్బుతో కడుక్కొనిరావాలి. (బయటకు పోతాడు.)

పంక : బాబాయ్! అమ్మయెక్కడ? హరికథకు వెళ్లిందా?

ప్రొ॥పరం: భాగవతం పారాయణ చేస్తోంది.

పంక : ముఖకవళిక కొంత మార్చుకుని) పోనీ బాబాయ్! మీ రొక్కరే రావటం మంచిపనిచేశారు.

ప్రొ॥పరం: అమ్మాయ్! ఏదేనా విశేషం వుందా?

పంక : పొంగి వస్తూన్న దుఃఖం దిగమ్రింగలేక చిన్నగా రోదిస్తూ నాసహనం శక్తీకూడా సన్నగిల్లుతున్నాయి. ఇంక అట్టేకాలం నేను భరించలేను బాబాయ్ !

ప్రొ॥పరం: రంగధామం ఇంకా...?

పంక : ఔనుబాబాయ్ ! ఆయనగారికి ఆవిడలో కన్పిస్తున్న ఆకర్షణేదో నా వూహ కందకుండా పోతోంది. అప్పటప్పట కూర్చుని కన్నార్పకుండా ఆవిడగారిని చూసి నాలో లేని అందం ఆవిడలో ఎక్కడుందా అనుకుంటూఉంటా. నేనేం కురూపిని కాదుకదూ ?

ప్రొ॥పరం: కాదమ్మాయ్ ! రంగధామం కళ్ళకి ఒకనాడు నువ్వు రంభలా కనిపించేవు.

పంక : ఈనాటికి నా అందానికి అయస్కాంతంలా ఆకర్షించబడినా చుట్టూ కైవారంచేసే యువకు లెందరో వున్నారు.

ప్రొ॥పరం: చెయ్యనియ్యి !

పంక : కన్నబిడ్డకి మీకన్నా అవినీతి బోధించే తండ్రిని మరెక్కడా చూడలేదు బాబాయ్ !

ప్రొ॥పరం: (అయిష్టతతో కొద్దిగా బుజాలు కుదించుకు) అది కేవలం చాణుక్యం. వంచనకి విరుగుడు. ప్రతి వంచనే...అంతే...అమ్మాయ్!

పంక : (శిరస్సు తటాయిస్తూ) ఒద్దుబాబాయ్ ! ఆయనగారిని తిరిగి ఎప్పటికేనా నావాడిగా చేసుకోకలనో లేదో

నాకు తెలియదు. కాని ఎన్నటికీ ఆయనలో అసూయ రగులుకొల్పిమాత్రం ఆయన ప్రేమ పొందటానికి నా మన స్సంగీకరించదు. పరపురుషులు నన్ను కామిస్తున్న సంగతి ఆయన కంటబడితేగాని ఆయన గారి ప్రేమ తిరిగి పొందలేని పక్షాన నాకు ఆయన గారూవద్దు... ఆ ప్రేమ వద్దు.

ప్రొ॥పరం: అమ్మాయ్! గుర్తుంచుకో రెండూ, రెండూ అయిదు యెన్నటికి కాదనే విషయం.

పంక : (విసుగుదలతో) సలహా యీయటం చాలా సులువైన పని బాబాయ్! నిశ్చలంగా కూర్చుని నన్ను కని పెట్టటం మట్టుకే మీవంతు, కాని ఆచరించటం నావంతేగా? ఇంతకీ ఆచరించటానికి అసలేం లేక కాళ్లు ముడుచుకు కూర్చోటం ఘోరంగా వుండదూ?

ప్రొ॥పరం: అమ్మాయ్!

పంక : బాబాయ్! ఇప్పుడు మీరు కేవలం నే పెట్టిన గోడు అసలు అర్థమేకానట్టో, లేక నేనేదో పెద్ద బరువు మీ తల కెత్తినట్టో చూడకండి. వచ్చిన విపత్తు ఎదుర్కోటానికి నేనూ సన్నద్ధం కాగలిగితే ఎలాగో కొంతవరకూ సమాధానపడొచ్చు. కాని అదేం లేక కేవలం కోపం చంపుకు — కాళ్లు ముడుచుకు కూర్చోటం మాత్రంగా వుంది నా పని. ఈ నెల రోజులనుండి నవ్వు ముఖంతోనే నే ననుభవిస్తున్న

నరకబాధ మీ కేం తెలుసును బాబాయ్! దావాగ్ని నా హృదయంలో రగులుకొంటూవుంటే నా అధరం మీద దరహాసం నటించేను. వలపుకత్తె ప్రేమవల్లితో సంధ్యా సమయాన ఆయనగారు సయ్యాటలకి పోతూంటే తెలిసుండి ఒయ్యారంగా దోబూచిపెట్టి సాగనంపేను. వాళ్ళిద్దరూ కలియటానికి అనేక అవకాశాలు కల్పించాను. నా యెరుపెక్కిన నయనాలు కంటబడితే ప్రేమవల్లి ఆయనగారికి ఏంచెప్పిపోతుందో అని చివరికి బాధతీరా రోదించటానికూడా ధైర్యం కోల్పోయేను. అవిరామంగా గత నెలరోజులాయి ఆయనగారు అనునిత్యం ఆవిడగారిని కలుస్తూనే వున్నారు. అంతకాలంగానూ నేను నవ్వుతూనే వున్నా. ప్రసన్న వదనంతో ఆయనగారికి మరులు గొలుపుతూ నివాళి పడుతూనే వున్నా.

ప్రొ॥పరం: కాని అతనికి అంత సావకాశం ఎలా కలుగుతోందమ్మా?

పంక : దానికేముంది బాబాయ్. పండులాంటి ప్రాక్టీసుకు నీళ్ళు ఒదులుకుంటున్నారు. తాను స్వయంగా పోయి చూడాల్సిన పెద్దిళ్ళకికూడా కంపౌండరుని పంపిస్తారు. మీకు గుర్తుందిగా సరళాప్రసాద్ తతంగం?

ప్రొ॥పరం: (నవ్వుతూ) ఔనౌను. ఊహాపథంలో సృష్టించిన సరళాప్రసాద్?

పంక : ఆ దిక్కుమాలిన సరళాప్రసాద్‌ని నేను ఎంతగా ద్వేషిస్తున్నానో మీకే తెలిసుంటే? ఆవిడగారికి అలా ఆపరేషన్లు జరుగుతూనే ఉన్నాయి. వారం వారం ఆపరేషనే. మరారోజల్లా ఆయనగారు కారువేసుకు వుడాయిస్తారు.

ప్రా॥పరం: ఆవిడగారికి అమాంతం కొండచలవంత కాయం వున్నట్టుంది.

పంక : అందులో విచిత్రం ఏమిటంటే, వూర్లో కొత్త చిత్రం విడుదలైనప్పుడల్లా ఆవిడగారికో ఆపరేషను జరుగుతూనేవుంది. మినర్వాలో "ఇల్లరికం" విడుదల నాడొక ఆపరేషను. కృష్ణాలో "అప్పుచేసి పప్పు కూడు" మొదటిరోజు ఇంకో ఆపరేషను. పూర్ణాలో "పాతాళభైరవి" తొలిరోజున మరో ఆపరేషన్.

ప్రా॥పరం: బాగుందమ్మాయ్ ?

పంక : ప్రేమవల్లికి సినీమాలంటే వెర్రి వ్యామోహం. ఉభయులకి బాల్కనీటికెట్లు, ఉపహారాలు, డ్రింకులూ, టీలూ, ఖర్చంతా ఆయనగారిదే.

ప్రా॥పరం: అంటే ఆవిడగారు నీచంగా...మూల్యం కిట్టించుకుంటున్నదన్నమాట. నువ్వేం అనుకుంటున్నావో గాని ?

పంక : అదే అనుకుంటున్నా... పాపం ఆయనగారికి యీ నెలలో పూర్తిగా పర్సు కాళీ...

ప్రొ॥పరం: ఏం ?

పంక : ఆయనగారు ప్రియురాలితో విహారానికి వేంచేస్తే ఒంటరితనం భరించలేక వూరడింపుకోసం ఏవో వస్తువులు కొనేస్తున్నా. మరి సాధారణంగా నాకు బాగా విలువైనవే ఎంచటం అలవాటాయె.

ప్రొ॥పరం: దారితప్పిన భర్తను తిన్నచేయటానికి నేయిచ్చిన సలహాల్లో యిదికూడా వున్నట్టు గుర్తులేదమ్మాయ్ ?

పంక : అవును... బాబాయ్ ! మీరు చెప్పలేదు. నాఅంతట నేనే మీరు యిచ్చిన సలహాలతోబాటు యిదీ ఆచరణలో పెట్టేను.

ప్రొ॥పరం: అయితే యీవేళ నాకెందుకు కబురు పెట్టినట్టమ్మాయ్ ?

పంక : ఓర్పుకి ఒడ్డుతగిలిందిగనుకే కబురుపెట్టేను బాబాయ్! ఇంకొక్క క్షణంకూడా నా వేదన తప్పుకోటం అసాధ్యం. ఆయనగారు యీ ఉదయాన్నే చెపుతున్నారు. ఆ దిక్కుమాలిన సరళా ప్రసాద్‌ని నీలగిరి తీసుకు వెళ్ళాలని.

ప్రొ॥పరం: నువ్వు చెప్పబోయేది...

పంక : (కోపోద్రేకంతో బుజాలు కుద్దించుకుంటూ) మరేం లేదు. ఆయనగారికి ప్రేమవల్లిని వెంటవేసుకుని వూటీలో మజా వుడాయిద్దామని వాంఛ కలిగించి.

ప్రొ॥పరం: ఇప్పుడు నువ్వేం చెయ్యబోతున్నావ్ ?

పంక : మా యిద్దరిలోను ఎవరినో ఒకర్ని ఎంచుకోమని కచ్చితంగా చెప్పేబోతున్నా. ఆయనగారి ప్రయాణానికి నా చేతనయినన్ని అవరోధాలూ కలిగించబోతున్నా.

ప్రొ॥పరం: అబ్బా!

పంక : అబ్బా అనకండి బాబాయ్! నేను చేసేదే సరియైన పనని చెప్పండి. అదొక్కటే నే చెయ్యాలిసినపనని చెప్పండి.

ప్రొ॥పరం: నువ్వు పూర్తిగా తప్పుదారిని పడుతున్నావు.

పంక : తప్పుదారి ?

ప్రొ॥పరం: అతనికే పూటీ విహారం కావాలని భ్రమిస్తున్నట్టున్నావు. చిత్తస్థిమితంగల ఏ మగాడూ చూస్తూ చిక్కుల్లో పడటానికి సిద్ధపడడు.

పంక : మరి ఆయనగా రెందుకు వెళుతున్నట్టో ?

ప్రొ॥పరం: ఆవిడగారు నిలతీస్తున్నదిగనుక. ఈ పరిస్థితుల్లో పురుషుడికి అయిష్టమైనపనిచేయించటానికి ప్రియురాలు ఎప్పుడైతే పూనుకుందో అదే అంతానికి మొదలు.

పంక : మీ కెలా తెలుసు ?

ప్రొ॥పరం: నాకు తెలియదు. ఊహించేను. (మెదడుఅంటూ వుంటే వూహాకందని విషయమంటూ వుండదన్నట్టుగా ఎడమచేతి చూపుడు వ్రేలు కంటిప్రక్క కణత మీద తాటిస్తాడు నవ్వుతూ)

పంక : గణితశాస్త్ర సాధనలో జీవితం అంతా గడిపేక మీ క్రమాంతం సర్వజ్ఞత్వం సిద్ధించినట్టుందే ?

ప్రొ॥పరం: పంకజం ! వివేకంతో ఓర్పు వహించు. వాళ్ళని పోనీ. (త్రుటిపాటు నిశ్శబ్దత, పంకజాక్షి అరిచేతుల్లో ముఖాన్ని ఆనించుకుని తండ్రికేసి తీక్షణంగాచూస్తూ విషయాన్ని ఆలోచిస్తుంది.)

పంక : నాకు నిండా ధైర్యం, మంచి చాకచక్యం, ఆపైని పరిపూర్ణమైన ఆత్మనిగ్రహము, వుండాలని ఆనాడు మీరు చెప్పింది అక్షరాలా నిజం.

ప్రొ॥పరం: (నవ్వుతూ) మరేమిటమ్మాయ్ ?

పంక : నేనేం చెయ్యబోను. నోరు కట్టుకుంటూ, నవ్వుతా, నవ్విస్తా, కాని...

ప్రొ॥పరం: ఏమిటమ్మాయ్ ?

పంక : అవసరంగా నాకు కొన్ని జార్జెటుచీరలు కావాలి. కరాచీస్టోర్సుకి ఫోనుచేసి వున్న రకాలన్నీ వెంటనే పంపమని ఇప్పుడే చెప్పి వస్తా.

[రంగధామం ప్రవేశం.]

ప్రొ॥పరం: ఇంకనేను వెళ్ళొస్తా.

రంగ: అదేమండి ? అంత త్వరగా ?

ప్రొ॥పరం: మీ అత్తయ్యాని తీసుకొస్తానని అమ్మాయికి మాటిచ్చా.

పంక : విధిగా వెంకనే రావాలి బాబాయ్! మా వివాహం అయేక ఆయనగారిని నేను వదిలివుండటం యిదే తొలిసారి. మీరూ అమ్మా దగ్గరుంటే కొంతవరకూ దుఃఖాన్ని తట్టుకో గలుగుతాను.

రంగ : ఏమాత్రం ఆర్భాటం చెయ్యకుండా ఇంత ప్రశాంతంగా నా ప్రయాణానికి అంగీకరిస్తా వనుకోలేదు పంకజం.

పంక: చూడండి! అనునిత్యం ఇస్త్రీరియా వచ్చేపర్యంతం ఆర్భాటం చేయటానికి సన్నాహాలు చేస్తూనేవున్నా. ఇంక చెయ్యకలిగిందేమీ లేదు.

రంగ: బ్రతికించేవు.

పంక: (అర్థోక్తితో) ఇంతకీ నాకు తెలుసుగా? వెళ్ళటం, మానటం మీ చేతుల్లోవుంటే గుమ్మంకదలేవారే కాదు. తప్పనిసరిగా భావించబట్టే మీరీ ప్రయాణానికి సిద్ధపడుతున్నారు. అంతేగా?

[రంగధామానికి ఒంటిమీద జెర్రులు ప్రాకినట్టవుతుంది. కాని మౌనం వహిస్తాడు. పరిస్థితి పసిగట్టి ప్రొ॥ పరంధామయ్య క్షణికంగావున్న నిశ్శబ్దత తొలగిస్తాడు.]

పరం : రాత్రిపూట ఎందుకు ప్రయాణం పెట్టుకున్నావోయ్?

రంగ : (తెప్పరిల్లి) రాత్రిపూటయితేనే సమ్మర్ధం అంతగా వుండదుకదండీ? ఇంతకీ ఒక జబ్బుమనిషికి సాయంగా

పోయేటప్పుడు యిట్లాంటి సమయంలోనే కాస్త సదుపాయంగా వుంటుందని.

పంక : (ఉత్సాహం వెల్లివిరుస్తూ) ఎందరో నవయువకులు తమ వలపుకత్తెల్ని వెంటబెట్టుకుని నీలగిరి వినోద విహారానికి పోతూవుంటే చూడముచ్చటగా వుంటుం దటండి. అసలింతకీ పరులకంట బడకుండా ఉండ టానికిగాను అట్లాంటి జంటల ప్రయాణానికి రాత్రి పూటే అనువుగా ఉంటుందిగాబోలు ?

రంగ : ఇంక నే పోవాలి, లేకపోతే ట్రెయిన్ తప్పిపోతుంది. వెళ్ళొస్తా...

పంక : అట్టే ఆలస్యం చెయ్యకంటి బాబాయ్ ! మీరొచ్చే లోగా వృద్ధదేశానికి తట్టుకోలేకపోతే...

ప్రొ॥పరం: (తల పంకిస్తూ) రంగధామం ! తరువాత మళ్లీ కలుస్తానోయ్ !

[ఆయన బయటకు పోతాడు. పంకజాక్షి ఆయన్ని అనుసరించటానికా అన్నట్టు లేచి నిలుచుంటుంది.]

పంక : నేనూ నట్టింట్లోకి భోజనానికి పోతున్నా.

రంగ : (కొంచం కటువుగా) పంకజం ! ఉండుండు నీతో కొంచం మాట్లాడాలి.

పంక : (ధీమాగా కూర్చుంటూ) దానికేం మాట్లాడండి.

రంగ : కావలిస్తే వంటావిడని కేకవేసి భోజనం యిక్కడికే తెప్పించుకో.

పంక : బాధలేదు, ఆగినకొద్దీ ఆకలి బాగా అవుతుంది.

రంగ : (ప్రక్క సొరుగులోంచి కొన్ని కాగితాలు తీసి పంకజాక్షి చేతికి అందిస్తూ) ఇవి యేమిటో నీకు తెలుసా?

పంక : (మరులుగొలిపే చిలిపి చిరునవ్వుతో) బిల్లుకాగితాలు ... బావా ?

రంగ : అవి బిల్లుకాగితాలు ... చూస్తున్నాగా ? బాగుంది.

పంక : (వాటిలోంచి ఒకటి పెలికి లాగి) ఇది నేకుట్టించుకున్న సిల్కు బ్లవ్‌జుల తాలూకుదండి. (అంటూ ఆకాగితం లోకి చూస్తూ) ఇంకా వీటికి మీరు కుట్టు కూలి ఇయ్యాలిసుందండోయ్.

రంగ : (కంఠంలోని తీవ్రత తగ్గకుండా ప్రయత్నిస్తూ) అవి నన్నేం చేయమని నీ వూహ ?

పంక : (యధాలాపంగా) దానికేం, చిత్తు కాగితాల బుట్ట కెత్తొచ్చు ... కాని బావా ! ఆ డబ్బుమాత్రం మీరు త్వరలో చెల్లించాలి సుంటుంది.

రంగ : (కోపంతో గట్టిగా) ఇటు చూడు పంకజం ! ఇది చాలా ఘోరం. ఇట్లాంటి దుబారా ఖర్చులు ఇంక నేను భరించదల్చుకోలేదు తెలుసా ?

పంక : (నిజానికి చాలా ఆశ్చర్యపోతూ, సర్దుకు బొత్తిగా నవ్వులాటగా) బావా ! నేనేదో రెండు బట్టలు కొనుక్కుంటే మీరింతగా ఒగర్చుకొని బుస కొడతా రనుకోలేదు. నిన్నటిదాకా సాదా జాకెట్లతోటే

వుంటున్నా, అసలింతకీ నేను కాస్త గోటుగా బట్టలు వేసుకుంటే మీరేదో ముచ్చట పడతారనుకొన్నా.

రంగ : అవన్నీ కట్టిపెట్టు. నే నసలే సంసారిని. ఒక్క క్రిందటి నెలలో నాలుగువందలు ఖర్చుచేసేవు.

పంక : (నిశ్చలంగా) అంతయిందండి? అయితే ఏం లెండి. అదృష్టవశాత్తూ మీకు సరళాప్రసాద్‌లాంటి ధనికు రాలు వైద్యం దొరికిందాయె.

రంగ: (అనుమానస్పదంగా ఒక్కసారి ఆవిడవైపు దృష్టినిల్పి, తక్షణం సరళాప్రసాద్ చిక్కులోంచి తప్పుకో టానికి కోపంతో) బుద్ధిలేని దూబరా. ఇటు చూడు! ఈ బిల్లు 75 రూపాయిలు జరీజార్జెటు చీర - దండగ కాక మరేమిటి? మార్చి మూడున...

పంక : మినర్వాలో మేనరికం విడుదల.

రంగ : మినర్వాలో మేనరికం విడుదలేమిటి? ఏమిటీ నీ వూహ?

పంక : మరేం లేదండి. మనింటిప్రక్క కమిషనరుగారిభార్యకి ప్రతి చిత్రానికీ మొదటి రోజునే హాజరవటం అలవాటుగా? ఆరోజు ఆవిడగారు ఎలాగో తప్పి పోయిందట. అందుకని పిచ్చాపాటీకి మనింటికి వచ్చింది - నాకు బాగా గుర్తుంది.

రంగ : అయితే? ఆరోజు పనిగట్టుకు బజారుకువెళ్ళి అంత ఖరీదైన బట్టలెందుకు కొనాలి సొచ్చిందో?

పంక : (మధురంగా) బాగుంది. ఇటు చూడండి! బావా! ఆరోజు శ్రీమతి సరళాప్రసాద్‌కి మీరు మొట్టమొదటి ఆపరేషన్ చేసేరు. రోజంతా మీరు బయటే వున్నారు. ఇంటిదగ్గర ఒంటరితనంతో నే నెంతో కుమిలిపోయేను. మీరెంత తహతహలాడుతారో నాకు తెలుసు. అందుచేత నాకూ తహతహ లావై పట్టలేక కాస్త తేలిక పడటానికి బజారుకువెళ్ళి ఆజార్జెటు చీర కోనుక్కుని వచ్చా.

[రంగధామం క్షణంపాటు ఆమె మొఖంలోకి చూస్తాడు. తరువాత తలదించి బిల్లుకాగితాల్లోకి చూస్తాడు. మాట్లాడబోతాడు కాని మౌనం వహిస్తాడు. పంకజాక్షి అతన్ని అవలోకిస్తూ ఉంటుంది.]

రంగ : (తొందరగా) చూడు ఏప్రెల్ ఆరున నీలంపాళ్ళ గాజులు.

పంక : ఔనౌను. అరోజునే పాపం శ్రీమతి సరళాప్రసాద్‌కి రెండవ ఆపరేషన్.

రంగ : పంకజం! అంత తలబిరుసుతనం కూడదు.

పంక : బాగుంది. మీరు బయటికి వెళ్ళినప్పుడు నాకు కాలక్షేపం కావాలామరి? ఊళ్లో విడుదలైన క్రొత్త చిత్రాని కంతా ముచ్చటగా పోతూవుంటే నా ఒంటరి తనం ఎంతో హేయంగా వుందనుకోండి.

రంగ : పాపం! మన్నించు పంకజం!

పంక : చూడండి! జూలై మూడు ఝనక్ ఝనక్ పాయల్ బాజె...

రంగ : బహుశా వున్నవన్నీకూడా యీ ప్రకారంగానే వల్లె వేస్తావనుకుంటా? (అంటూ ఒక బిల్లుకాగితంలోకి చూస్తూ) ఆగస్టుఆరు.

పంక : తెనాలిరామకృష్ణ. (రంగధామం బిల్లుకాగితంగుండా తీక్షణంగా చూస్తాడు కాని మాట్లాడడు) ఇంతకీ వూళ్ళో ఏదో క్రొత్తచిత్రం విడుదలరోజునే విధిగా మీకో ఆపరేషను తగుల్తోంది. వింతగావుందే?

రంగ : అసాధారణంగా వుందనికదూ నీ వూహ?

పంక : కొద్దిగా!

రంగ : మరేంకాదు పంకజం! అది మన అసిస్టెంటు సర్జను శ్రీ శ్రీ అచ్యుతరావుగారి వక్రించిన వివేకానికి నిదర్శనం. నేను చేసే పెద్ద ఆపరేషన్లలో అచ్యుతం సహకరిస్తాడనే సంగతి నీకేం క్రొత్తకాదు. (పంకజాక్షి అంగీకారసూచకంగా తల పంకిస్తుంది) ఆయనగారికి నాటకాలన్నా, సినీమాలన్నా తగనివెర్రి. వాటినుండి కొంతగానే నాతని తప్పుకోటానికి తప్పకుండా ముఖ్యమైన ఆపరేషన్లన్నీ వూళ్ళో మంచి నాటకమో, సినిమాఓ వున్నరోజునే చెయ్యాలంటాడు.

పంక : ఎగ్జిబిషన్‌కి పంపించాలి! (రంగధామం అనుమానాస్పదంగా మీదకు చూసి మందహాసం చేస్తాడు.) మిమ్మల్ని కాదండీ... అచ్యుతాన్ని.

రంగ : ఇటుచూడు పంకజం! జరిగినదానిగురించి జగడం అనవసరం, ఈసారికి ఎలాగో యీ కాగితాలు జమకట్టా...

పంక : నాకు తెలుసుగా? ఆ పని మీ రెలాగూ చేస్తారని.

రంగ : కాని ఇకమీదటమాత్రం యిట్లాంటి కాతాలు పెట్టటానికి వీలులేదు.

పంక : నిజానికి మీరింత గందరగోళం ఎందుకు చేస్తున్నారో నా కర్థం కావటంలేదు. ఇంతకీ శ్రీమతి సరళాప్రసాద్ వైద్యంలో మీరు విపరీతంగా ఆర్జిస్తున్నారామె.

రంగ : కాయలో ప్రత్తికాయ లోవుండగానే కుట్టు పనివానికి కబురుపెట్టటం అవివేకం. ఆవిడదగ్గరనుండి మన కింతదాకా దమ్మిడీకూడా ముట్టలేదాయే.

పంక : అయినా ఇప్పు డెలాగా ఆవిడగారు వూరునుండి వెళుతున్నాదిగా? ఇంక మీ బిల్లు పంపవచ్చు.

రంగ : అమ్మయ్యో! ఇప్పట్లో ఆపని చెయ్యటానికి అవకాశం వుండదనుకుంటా. బిల్లు పంపుతే బెంబేరెత్తి ఆవిడగారు ప్రాణం విడుస్తుంది.

పంక : అలా అయితే ఆ డబ్బుకి నీళ్లొదులుకోవలసి వస్తుందేమో?

రంగ : నీకు బొత్తిగా హృదయం లేనట్టుంది పంకజం! నాకూ ఆముసలావిడికీగల అవినాభావం మరిచిపోతున్న ట్టున్నావు. ఆవిడగారు నాకు కేవలం వైద్యం చేయించుకునే రోగేకాదు. సన్నిహితమైన స్నేహితు రాలుకూడా.

పంక : అలా చెప్పరేం? అయితే బహుశా ఆవిడగారివిల్లులో మీకో వాటా వ్రాస్తుందన్నమాట. పోనీలేండి మనకీ ఏదో చిన్న మేడ కట్టటానికి పనికొస్తుంది.

రంగ : అబ్బెబ్బే! నే నట్లాంటిదేం అంగీకరించను. వైద్యులే రోగుల ఆస్తికి వారసులవటం నాదృష్టిలో చాలా ఘోరం.

పంక : దానికేం. ప్రస్తుతం ఆవిడగారిని నీలగిరి తోడ్కుకొని వెళుతున్నందుకు మీకో నాలుగువందలేనా ముట్ట కుండా పోతాయా?

రంగ : (ఒక్కసారి కంపం ఎత్తినట్టు) పంకజం!

పంక : ...అదేమిటో అనుకున్నానండి. అంతలా గాభరా పెట్టారేమిటి!

రంగ : కొంపతీసి నువ్వింకేం కొనాలనుకోటంలేదు కదూ?

పంక : ...బాగుంది! బావా! రేపు వేకువన లేవగానే నా ప్రక్కన మీరుండరాయె. అప్పుడమాంతం భరించ రాని ఒంటరితనంతో నేను కృంగిపోవాలిసుంటుం దాయె!

రంగ : (మాట కడ్డొస్తూ) మీ అమ్మగారిని భాగవతంపట్టుకు రమ్మను నీకు తోడు పడుకోటానికి.

పంక : ఇప్పుడు గుర్తుకొచ్చిందినాకు. ఇంట్లో వాడుకకు వాయిలుచీరలు బొత్తిగా లేవండోయ్ !

రంగ : (కటువుగా) పంకజం !

పంక : (ఒప్పించే ధ్వనితో) ఇంట్లో వాడుకకు నూంచివాయిల్ చీరలు కొన్నివుంటే జార్జెటుచీరలు ఎక్కువకాలం మన్నుతాయి.

రంగ : అది సరేగాని ఇంతకీ నీ ఒంటరితనం తట్టుకోటానికి ఎన్ని వాయిల్‌చీరలు అవసరం వుంటుందో ?

పంక : (నిశ్చింతగా) నాలుగు.

రంగ : ఇంతకన్నా దారుణం ("దారుణం" సాగతీసి పలుకు తాడు) ఇదివరకెన్నడూ వినలేదు.

పంక : ఇటుచూడండి ! ఆదాయానికి మించిన ఖర్చుతో మిమ్మల్ని కృంగతీయటం నా అభిమతంమాత్రం కాదు. ఆ నాలుగూ నాలుగు ముప్పైలు, అంటే నూట యిరవయికంటేకాదు. నాలుగ్గైదువంద లౌస్తున్నప్పుడు యీమాత్రానికింత రాద్ధాంతం దేనికండీ ?

రంగ : పంకజం ! అసలు వాస్తవానికి శ్రీమతి సరళాప్రసాద్‌ని ఏదో సన్నిహితమైన స్నేహితురాలుగా భావిస్తున్నా కాని కేవలం కిరాయి కిట్టించుకునే రోగిగాకాదు. అదీకాక ఆవిడగారు ఆదిలోనే అనుకున్నంత శ్రీమంతు

రాలు కానట్టుంది. దానా, దీనా ప్రస్తుతం నేనావిడ గారిని నీలగిరి తోడ్చుకువెళ్ళడానికి ప్రతిఫలం యేం ఆపేక్షించటం లేదు.

పంక : (అతిపరుషంగా) అదేమిటండి? అట్లాంటివేం నేను వినబోవటంలేదు సుమండీ? వెనకా ముందూ ఆలోచించటానికి మీకో భార్య వుంది - రేపు మీకేం అయినా నా బ్రతుకు నడివీధులో ఉంటుంది. ఇష్ట మొచ్చినట్టూ పిచ్చి పిచ్చి వేషా లెయ్యటానికి మీకేం హక్కు లేదు. నా బ్రతుకు అభాసుకాకుండా చూసే బాధ్యతకూడా ఉంది మీమీద.

[రంగధామం బదులు చెప్పబోవు సమయాన పనిపిల్ల ప్రియంవద ప్రవేశిస్తుంది.]

ప్రియంవద: బాబూ! ఎవరో ఒకావిడ మిమ్మల్ని చూడాలంటున్నారు.

రంగ : (చిరాకుగా) ఈవేళప్పుడా?

ప్రియంవద: సుభద్రమ్మగారట బాబూ!

రంగ : ఓహో! నాకు తెలుసు. లోపలికి రమ్మను.

[ప్రియంవద నిష్క్రమణ]

రంగ : బ్రతికించింది. వేళకి యెవరో ఒకరు. ఎంతలేదన్నా వందా యేభై రూపాయిలదాకా ఆవిడగా రియ్యాలి సుంటుంది. (విజిట్ పుస్తకం పరికిస్తూ) ఐదు విజిట్లు.

అంటే వందా యేభైరూపాయిలు. కాని ఎంతో కొంత అవసరానికి.

పంక : ఆవిడకి ఏం వ్యాధండీ?

రంగ : నాకూ తెలియదు. తెలిసినట్టు నటిస్తున్నా. బహుశా ఆవిడగారు ఆ విషయం పసిగట్టినట్టులేదు.

పంక : ఇంటిలోకి వెళతా. ఎవరికో ఫోనుచెయ్యాలి ఇప్పుడే.

[పంకజాక్షి బయటికిపోతుంది. సుభద్రమ్మ ప్రవేశించే సమయానికి రంగధామం చిరాకుగా గదిలో అటూ యిటూ పచారుచేస్తూ ఉంటాడు. ఆవిడను చూడగానే ముఖకవళికలు మార్చుకొని నమ్రతగా నవ్వుమొగం పెడతాడు. సుభద్రమ్మ వృద్ధాప్యం సమీపిస్తున్న ఓకమాదిరి పొట్టి వ్యక్తి. అతిగా వాగే స్వభావం. నల్ల సిల్కుచీర ధరించి ఉంటుంద.]

రంగ : ఏమమ్మా! సుభద్రమ్మగారా?

సుభద్రమ్మ: ఔనుబాబూ. ఇం తాలస్యంగా వచ్చినందుకు మన్నించాలి. మీరసలు అయిదయేక ఎవరినీ చూడరని నాకు తెలుసు. అయినా యీ రాత్రికే నే వెళుతున్నానాయె.

రంగ : దానికేంలెండి. మిమ్మలిని ఎప్పుడు చూసినా ఆనందంగానే ఉంటుంది.

సుభద్రమ్మ: బాబూ! రాత్రిబండికి మా అమ్మాయితో తెనాలి పోతున్నా. ఏదో వెళ్ళేముందు మిమ్మల్నోసారి చూసి పోదామని...

రంగ : సంతోషం. ఇప్పుడు మీ ఒంట్లో బాగా నయంగా వుందా?

సుభద్రమ్మ: (పరిపూర్ణమైన తృప్తితో) బాగా? నే నింకెప్పుడూ బాగా నయంగా వుండను నాయనా!

రంగ : వేళపట్టున ఔషధం పుచ్చుకుంటున్నారా?

సుభద్రమ్మ: (ఉల్లాసంగా) పుచ్చుకుంటున్నా. కాని అది నాకేం గుణమియ్యదు.

రంగ : ఏది మీ మోకాళ్ళపట్లు ఎట్లావున్నాయో చూద్దాం- చూద్దామా?

[సుభద్రమ్మ ఒకకాలుమీద కోసుగా రెండవ కాలు వేస్తుంది. రంగధామం మోకాలుక్రింద నొక్కుతాడు. కాలు కొద్దిగా మీదకు లేస్తుంది.]

సుభద్రమ్మ: డాక్టరు రామమూర్తిగారు ఎన్నిమందులోవాడి ఎంతచెయ్యాలో అంతా చేశారు. కాని నావ్యాధి కుదర్చటానికి ఆయనగారి వశమైందికాదు. ఆతరువాత డాక్టరు ధాతారావుగారిదగ్గరకు వెళ్ళే. ఆయనగారు డాక్టరు రామమూర్తిగారు చెప్పినవేం చెయ్యొద్దన్నారు. దాంతో నా పరిస్థితి మరింత అధ్వాన్నం అయింది.

రంగ : అయినా మీరు చాలా ఉల్లాసంగా వున్నట్టున్నారే ?

సుభద్రమ్మ: పట్నంలోవున్న ప్రతి డాక్టరుని చూసేను. వాళ్ళంతా నాదొక విచిత్రమైన వ్యాధిఅన్నారు. వైద్యులచేత పరీక్ష చేయించుకుంటేనే నాకెంతో ఉల్లాసంగా వుంటుంది. పాపం వాళ్ళు నేనంటే యెంతో శ్రద్ధపట్టి గంటలతరబడి చూస్తారు. ఇంతకీ ఎంత కృతజ్ఞత ప్రకటిస్తే వాళ్ళఋణం తీరుతుందో అనుకుంటూ వుంటా.

రంగ : దానికేంలెండి! మంచితనంకొద్దీ మీరు అలా అనుకుంటున్నారు... ఇవాళ మీకేదో మందుమార్చి చూడమంటారా ?

సుభద్రమ్మ: మంచి మందియ్యండీ బాబూ! చూడునాయనా! కొంచెం హీతవుగా వుండాలి సుమా ?

రంగ : మీకు తియ్యటిమందులే నచ్చుతాయనుకుంటా

సుభద్రమ్మ : బాబూ! అసలు మందు పుచ్చుకోటం అంటేనే నాకెంతో ప్రీతి. అందులోకీ యీమధ్య మా అమ్మాయికి పెళ్ళయ్యేక ఒంటిదాన్నయిపోయేనాయె. వాస్తవానికి వస్తుగుణదీపికలోవున్న మందులన్నీ వాడేను. వాటిల్లో ఏ ఒకటీ నాకు నయంచేసినట్టు లేదు.

రంగ : (ప్రిస్క్రిప్షన్ కాగితం అందిస్తూ) బహుశా యిది గుణమియ్యొచ్చు. భోజనానికిముందు ప్రతిరోజూ మూడు సార్లు సేవించండి.

సుభద్రమ్మ : (కాగితంవైపు చూస్తూ) ఓ! ఇది డాక్టరుగారూ! ఇదివరకు వాడేను. డాక్టరు తిరుమూర్తి ఒకటిరెండు నెలలక్రితం యీమందే యిచ్చాడు.

రంగ : బాధలేదు. ఇంకోసారి వాడండి. బహుశా క్రితం సారి మీరు ఆమందు సొంతంగా వాడివుండరు.

సుభద్రమ్మ : ఈమధ్యే వైద్యపత్రిక చూసేనండి. ఎవరో ఒక జర్మను డాక్టర్ నరాలవ్యాధులమీద వజ్రాయుధంలా పనిచేసేమందు కనిపెట్టేడట. ఆ మందయితే నాకు బాగా నిమ్మళిస్తుందనుకుంటూ.

రంగ : వైద్యపత్రికలు మీ రెందుకు చూస్తున్నారండి? విపరీతంగా వుండే?

సుభద్రమ్మ: అందులో వైపరీత్యానికేముందండి? నేనూ చదువుకున్నదాన్నాయె. పాపం మా ఆయన ప్రాక్టీసుకోసం లండన్‌నుండి తెప్పించే "లేన్‌సెట్"తో సహా వైద్య పత్రికలన్నీ కాలక్షేపానికి తిరగేస్తూ వుండటం నాకు పరిపాటు.

రంగ : (ఊపిరి బిగపట్టి) కొంపతీసి మీ ఆయన డాక్టరుకదా?

సుభద్రమ్మ: అయ్యో నా తెలివా! నే నొక డాక్టరుగారి భార్యనని ఇంతకాలమాయి మీకు చెప్పే ననుకుంటున్నా.

[సుభద్రమ్మ వాగుడు సాగుతుంటే రంగధామం తన ఆందోళన తట్టుకోటానికి ప్రయత్నిస్తూఉంటాడు.]

సుభద్రమ్మ: వైద్యులు నాగురించి వేరొకలా అనుకోటం నే నెప్పుడూ వినలేదుసుమండి. వాళ్ళసలు నాకు చేయ గలిగిన మంచేం లేనేలేదు. అయినా పాపం నా పట్ల వైద్యులంతా రూపందాల్చిన దయామూర్తులులాగే మెలుగుతూఉంటారు. ఒక్కసారిమాత్రం నామ రూపాలు లేని ఒక దిక్కుమాలిన డాక్టరు నా మన స్సెంతగనో గాయపరిచేడు. మామోలుగా ఆయన గారికి నా వ్యాధి లక్షణాలన్నీ వినిపించాను. అన్నీ విని ఆ గడుగ్గాయ "అమ్మా! మీకు ఆహారం హితవవుతుందా" అనడిగాడు. "అయ్యో! దానికేం ఉదయాన్నే కాఫీ తీసుకుంటా, పదకొండోగంటకల్లా సుష్టుగా భోజనం చేస్తా, ఎడమధ్యాహ్నం ఏదో ఫలహారంతోపాటు కాస్త కాఫీ పుచ్చుకుంటా, రాత్రి మామోలుగా భోజనం, ఆ తరువాత పడుకోపోయే ముందు ఓ గ్లాసుడు పాలు పుచ్చుకుంటా" అంటూ చెప్పేను. ఆ తరువాత "అమ్మా! నిద్ర బాగా పడు తుందా?" అన్నాడు. "ఓ ఈ వృద్ధాప్యంలోకూడా గాఢంగా నిద్ర పడుతుంది. రోజుకి ఏడెనిమిదిగంటలు పైగా పండుకుంటా" అన్నా. ఆపైని "అమ్మా? మీరునడవగలరా?" అన్నాడు. "దానికేం దగ్గాగా ప్రతినిత్యం నాలుగైదు మైళ్లు నడిచొస్తూఉంటా"

అన్నా. అంతా విని "అయితే మీ కేరోగం లేదు. దయచెయ్యండి" అన్నాడు.

రంగ : బలే!

సుభద్రమ్మ: ఆయనగారిని నఖశిఖపర్యంతం ఒక్కసారి తీక్షణంగా చూసి ఏం చెప్పేనో తెలుసా? "అబ్బాయ్! కొమ్ములుతిరిగిన డాక్టర్లు, డాక్టర్ తిరుమూర్తిగాని, డాక్టర్ గురుమూర్తిగాని ఏ ఒక్కరు నీతో ఏకీభవించటంలేదు." అంటూ కానీయేనా ఇయ్యకుండా విసురుగా వచ్చేసేను. (కొంటెగా) మీరా క్రొత్త మందదేదో ఇస్తారుకదూ?

రంగ : నిజం చెప్పాలంటే, ఆ మందు మీకు ప్రస్తుతానికి ఎందుకూ పనికిరాదని నా అభిప్రాయం.

సుభద్రమ్మ: సరేలెండి. ఆ విషయంలో పరిపూర్ణంగా మీకు తెలుసని నా నమ్మకం. ఇంక మీకాలం అట్టే వృథా పుచ్చటం భావ్యంకాదు.

రంగ : (వ్యంగ్యంగా) బాధలేదు. దానికంత విలువేంలేదు.

సుభద్రమ్మ: (ఉత్సాహపూరితంగా) మీకు నేనేం ఇయ్యాలిసుంటుందో చెప్పండి.

రంగ : ఎంతమాట! సాటి వైద్యుడి భార్యగా మీ దగ్గర నుండి ఫీజు తీసుకోటం స్వప్నంలోకూడా జరగనివని.

సుభద్రమ్మ: అదంతా మీ దయ. కాని మీకో చిన్న బహుమతి ఇయ్యటానికిమాత్రం మీరు విధిగా అనుమతించాలి.

రంగ : (హీనస్వరంతో, అంతలోకీ కాస్త తెప్పరిల్లి) అయ్యో! దానికేం... మీరు...

సుభద్రమ్మ: ఈ పట్నంలో ఆమాత్రం యీమాత్రం నామ రూపాలున్న ప్రతి డాక్టరునీ దర్శించేను. పాపం వున్నమాట చెప్పొద్దు? అందులో ఏ ఒక్కరు నా దగ్గర ఎర్రని కానీకూడా తీసుకోలేదు. కాని నేనెప్పుడూ వాళ్ళలో ప్రతి ఒక్కరికీ ఒక చిన్న బహూకరణ మాత్రం చేయటం పరిపాటయిపోయినది. నాకు తెలుసు మీ డాక్టర్లు అనేక రకాల వ్యధలూ, వ్యాధులూ చూసి యిసుమంతేనా మనశ్శాంతి లేక ఆవేదన పడుతూ ఉంటారు. అందుకనే నేను దర్శించిన ప్రతి వైద్యుడికీ ఒకచక్కని భగవద్గీత బహూకరిస్తూఉంటా. (అంటూ ఆవిడగారు చేతిసంచిలోంచి ఒక చిన్న ఖద్దరు బైండు పుస్తకం తీస్తుంది.)

రంగ : (శూన్యంగా) అచ్ఛా తేంక్యూ!

సుభద్రమ్మ: అది మా ఆయన తీరిక సమయాల్లో స్వయంగా వ్యాఖ్యానం వ్రాసి ఆయనదగ్గర వైద్యం చేయించు కుంటూ పరమపదించిన రోగుల ఆత్మశాంతికి అంకితం చేసి ప్రచురించేరు.

రంగ : బాగుంది, బాగుంది. తద్వారా వైద్యకట్నాలతో పాటు వైతరణి కట్నాలుకూడా ముట్టివుంటాయి.

సుభద్రమ్మ : అదేదో ఆయన్నే అడగాలి. నాకు తెలియదు గాని, డాక్టరు యాజులుగారు ప్రాతఃకాలాన్నే ఈ భగవద్గీతే పారాయణ చేస్తానని మాటిచ్చేరు.

రంగ : నేనూ చాలా కృతజ్ఞుడినండి మీకు !

సుభద్రమ్మ : ఇంక బాబూ ! వెళ్ళొస్తా. పాపం మీకు చాలా శ్రమయిచ్చేను. త్యేంక్యూ.

రంగ : చూడండి ! తెనాలినుండి మీరు తిరిగివచ్చేక, ప్రక్క వీధి చివరినే వున్నాడు డాక్టరు అన్నాజీరావు. ఆయన మీలాంటి కేసులకు పెట్టిందిపేరు. తప్పక కలియండి.

సుభద్రమ్మ : తేంక్యు, త్యేంక్యు !

రంగ : శెలవ్.

[ఆవిడగారు బయటకు పోతుంది. ఆయన తలుపు వేసుకుని త్వరత్వరగా ప్రక్కగదిలోనికి వెళ్ళి బిగ్గరగా.]

రంగ : పంకజం, పంకజం !

పంక : (లోపలినుండే ధ్వని) ఒస్తున్నా.

(తలుపు తట్టినశబ్దం)

రంగ : (చిరాకుగా) ఎవరది ? రండి.

[సుభద్రమ్మ ప్రవేశం]

సుభద్రమ్మ : మిమ్మల్ని ముఖ్యంగా ఒక సంగతడుగుదా మను కొని మరచిపోయేనండి. డాక్టర్ తిరుమూర్తిగారు ఆవుమజ్జిగతప్ప ఇంకొకటి నేముట్టుకోకూడ దన్నారు. కాని డాక్టరు రామమూర్తిగారు ఆవుమజ్జిగ నాఒంటికి

అంతగుణం చెయ్యకపోవచ్చునేమో గేదెమజ్జిగయితే చలవ చేస్తుందన్నారు. ఇప్పుడు నే నేదివాడాలా అని ?

రంగ : (తీవ్రంగా ముఖ్యాతి ముఖ్యమైన విషయం గంభీరంగా వినిపిస్తున్నట్టు) ఆవుమజ్జిగా, గేదెమజ్జిగా సమ్మిళితం చేసి మరీ పుచ్చుకోండి. సమశీతలంగా వుంటుంది.

సుభద్రమ్మ : తేంక్యూ, తేంక్యూ, వస్తాబాబూ ! నే నిచ్చిన భగవద్గీత మీకు బాగా నచ్చిందనుకుంటా ?

రంగ : ఇంకా అడుగుతారా? పూర్తిగానచ్చింది. మరిశలవ్!

[ఆవిడగారు బయటకు పోతుంది. రంగధామం తలుపు తట్టుతాడు]

రంగ : పంకజం ! పంకజం !

[పంకజాక్షి ప్రక్క ద్వారంగుండా ప్రవేశిస్తుంది.]

పంక : ఏమిటి సంగతి ?

[రంగధామం చేతిలో భగవద్గీత పుస్తకంతో అతి చిరాకుగా ఆవిడను సమీపిస్తాడు.]

రంగ : చూడు, చూడు, అదీ నా ఆర్జన !

పంక : అది పుస్తకం.

రంగ : ఏమిటా మూర్ఖత్వం పంకజం ? అది పుస్తకం అని నాకూ కనిపిస్తూనే ఉంది.

పంక : దాని భావమేమి రంగధామా అని !

రంగ : భావానికేముంది? అభావం! ఆవిడగారొక కీర్తి శేషించిన డాక్టర్ గారి ధర్మపత్ని. అందుచేత ఆవిడ గారి దగ్గర దమ్మిడీకూడా ఆశించటానికి అవకాశం లేదాయె. ఈ రోజుదాకా ఆవిడగారా విషయం నిగూఢంగా ఉంచింది. అందుకనే నే మొదటినుండీ అఘోరిస్తున్నా "వైద్యుల భార్యలని వాళ్ళ భర్తలు గతించాక ఒక్క ఘడియకూడా బ్రతుకనివ్వ కూడదు" అని.

పంక : అమ్మయ్యో!

రంగ: పంకజం! నేను పోయేక నీ యిష్టం. నువ్వు వూళ్ళో డాక్టర్లందరి దగ్గరికీ దర్జాగా తిరగొచ్చు.

పంక : అవేం మాట్లండీ! అయినా నాకు అనారోగ్యంగా ఉంటేకదూ?

రంగ : కొంప మునకేం లేదు. ఆమాటందానికి. నన్ను పోగొట్టుకున్నాక నీ కంతో యింతో జబ్బు చేస్తేనే హుషారుగా ఉండొచ్చు.

[పనిపిల్ల ప్రియంవద ప్రవేశం.]

ప్రియంవద: బాబూ! సుభద్రమ్మగారు మళ్ళా వచ్చేరు. ఒకే వక మాట మిమ్ముల్ని అడిగేసి వెళతారట.

రంగ : (ప్రశాంతంగా) పంపించు.

[ప్రియంవద నిష్క్రమణ.]

రంగ : (తనలో) బాగా సంభవించింది. ఇంకేమిటి ఉండిపో యిందో ఆవిడగారికి ?

[ప్రియంవద సుభద్రమ్మను ప్రవేశ పెడుతుంది.]

సుభద్రమ్మ: పాపం! వదలకుండా పీడలా పట్టుకుని వేధిస్తున్నా మిమ్మల్ని.

రంగ : (మృదువుగా) పరవాలేదు, పరవాలేదు.

సుభద్రమ్మ: మీరు చెప్పిన ఆవు మజ్జిగ, గేదెమజ్జిగ మిళితం చెయ్యడం గురించి ఆలోచిస్తున్నా. కాని ముందు దేంట్లో ఏది కలపటమా అని.

రంగ : (గడ్డం క్రింద చెయ్యి ఆనించుకుని) ఆరే దేముడా! ఆవుమజ్జిగలో గేదెమజ్జిగ పోసి పుచ్చుకోండి.

సుభద్రమ్మ: మంచిది బాబూ! మరొక చిన్న ప్రశ్న. అందులో కాస్త లవణం కలిపి పుచ్చుకుంటే నాకేం హాని చెయ్యదుకదా ?

రంగ : (వ్యంగ్యంగా) హాని! ఏహానీ ఉండదు. కాని మెత్తగా నలగగొట్టి ఉప్పు వస్త్రగాళితంచేసి మరీ కలుపుకోండి వంటికి మంచిది.

సుభద్రమ్మ: మంచిదిబాబూ! శలవ్. మీ కెంతగా ఋణ పడ్డానో ?

రంగ : మరేం ఫరవాలేదులెండి.

[సుభద్రమ్మ నిష్క్రమణ]

రంగ : (కోపంగా పిడికిలి బిగించి గుమ్మంకేసి చూపుతూ) సహగమనం... అదొక్కటే సరైనమాట.

పంక : ఏమిటండి మీరు మాట్లాడుతూంట!

రంగ : పది నిమిషాలాయె మెదడు గింగురుపెట్టి ఇప్పటికి గుర్తుకొచ్చింది. ఆ మాట - అదీ డాక్టర్లు దక్షిణ తలంపయిన తక్షణం వాళ్ళ భార్యలు చెయ్యాలిసిన పని - సహగమనం. మరేం ఫరవాలేదు. మన పూర్వులు చేసేవారు.

పంక : బ్రతికుండగా చనిపోయిన భర్తతో దహనంకావడం?

రంగ : అదీ సంగతి. సహగమనం దానిపేరు.

పంక : కానీ బావా! కొంపతీసి మీరు పోతే మంటల్లో పడ డానికి నేను సిద్ధపడనుసుమండీ! నాకు అసహ్యం అల్లాంటి ప్రయాణం. పరమాణుయుగంనుండి పాత రాతి యుగానికి.

రంగ : అంటే నీకు నామీద అభిమానం లవలేశం లేదన్న మాట.

పంక : అపరిమితంగాంది అలాఅని మంటల్లోకి ఉరకమనటం మీకుమాత్రం ఏం భావ్యంగా ఉంటుందండి?

రంగ : ఏమైనా, నీ మన స్సిదివరకులా నాకోసము లక్ష్యం చెయ్యటంలేదు. వాస్తవానికి నువ్వు పూర్తిగా మారిపోయేవు. ఎన్నో విషయాల్లో నే కనిపెడుతూనే ఉన్నా.

పంక : (తొందరగా ఆతనికేసి ఒక్కసారి తిలకించి అంతవరకూ ప్రసంగిస్తూ హాస్యసరళి సడలకుండా) ఛా ఛా, అంతా ఉత్తది.

రంగ : ఉత్తదికాదు. ఉన్నదే. ఈమధ్య నువ్వు బాగా మారిపోయేవు. ఉదయాన్ని నే బయటకు వెళ్ళేటప్పుడు గుమ్మందాకా సాగనంపటం మానివేసేవు. ఎన్నింటికి యిల్లు చేరేదీ అడగటం అసలే మానేసావ్. రాత్రి పూట సాపాటయేక పేపరు పట్టుకునేసరికి వాలుకుర్చీ ప్రక్కన తయారయేదానివి.

పంక : అవన్నీ మీకు యేవగింపుగా ఉండటం లేదూ ? ఏమంటారు ?

రంగ : ఏవగించుకోవటం వాస్తమే అనుకో, అయినా వాటివల్ల నాయెడల నీకెంత మక్కువ ఉందో తెలిసేది. ఇప్పుడు నువ్వవన్నీ మానేసేవు. ఆ సంగతే నా తలపుకు రావటంలేదు.

[ప్రియంవద ప్రేమవల్లిని తోడ్కొని ప్రవేశించి వెనుకకు పోతుంది.]

ప్రేమవల్లి: మీరిక్కడున్నారని పనిపిల్ల తెలియచేస్తేతిన్నగా నన్నిక్కడికి తీసుకురమ్మన్నా - మరేం అనుకోరను కుంటా ?

పంక : ఎంతమాట ! మేం ఎక్కడున్నా మిమ్మల్ని చూడ టానికి ముచ్చటగానే ఉంటుంది - దానికేం గాని మీరు కొంచం కాఫీ తీసుకోరూ ?

ప్రేమవల్లి: థాంక్సు. ఇప్పుడేం వద్దుగాని నిజానికి డాక్టరు గారిని వృత్తిరీత్యా ఒక్కసారి చూద్దామని వచ్చా.

పంక : మీ కేం జబ్బులేదే ?

ప్రేమవల్లి: నాకీమధ్య ఒంట్లో కొంచెం అదేంటో నలతగా ఉందండి. ఎవరో ఒక డాక్టరుని దర్శించా లనుకుంటున్నా. (రంగధామంవైపు తిరిగి) మీరు కాస్త ట్రీట్ చేసిపెడతారండి ?

రంగ: అదెంతలోమాటండి? మీకు చేయగలిగిందంతాచేస్తా.

ప్రేమవల్లి: కాని ఉల్ఫాగా వైద్యం చేయించుకోటం నాకు మనస్కరించదు సుమండోయ్. ఏదో కొంత నన్ను ముట్టచెప్పనియ్యాలి.

పంక : ఛా ఛా ! అదేమిటండి ? ఆయనగారు నాకు కావలసిన స్నేహితురాలిదగ్గర పైకం ఆశించలేరండి.

ప్రేమవల్లి: కాదండోయ్. అల్లాంటి విషయాల్లో నా నియమాలు చాలా నిహితంగా ఉంటాయిసుమండీ! డాక్టరుచేత ఉల్ఫాగా వైద్యం చేయించుకోవా లనుకునే వాళ్ళ గురించి నేను చాలా చెడ్డగా భావిస్తాను. నిజానికి నామట్టుకు నేను మామూలుగా ముట్టచెప్పాలిసిన ఫీజు తీసుకునేవరకు విడిచేదిలేదు.

రంగ : సరిలేండి. ఆ విషయం తర్వాత ఆలోచించవచ్చు.

పంక: నేను బయటకు పోతా - పోయేదా ?

ప్రేమవల్లి: మీరు మరేం అనుకోరుకదా? నా వ్యాధి లక్షణాలు మూడో వ్యక్తిముందు వ్యక్తం చేయటానికి కొంచం బిడియంగా ఉంటుంది.

పంక: ఔనౌను!

ప్రేమవల్లి: ఒక్క అయిదు నిమిషాలు.

పంక: జాగ్రతసుమండీ. మాఆయన మందులన్నీ చాలా మోటుగా ఉంటాయి.

[ఆమె బయటకు పోతుంది.]

రంగ: నీ కొంట్లో బాగాలేదంటే నాకు చాలా విచారంగా ఉంది వల్లీ. నిన్న చాలా ఉల్లాసంగా ఉన్నావు?

ప్రేమవల్లి: (నవ్వుతూ) ఇప్పుడూ ఉల్లాసంగానే ఉన్నా. (రంగధామం విస్తుపోతాడు) తమరు వైద్యులవటంలో ఉన్న ఉపయోగమే అది. మిమ్మల్ని కలియాలని కోరిక కలిగితే ఇట్టే మీ ఆవిడ కన్ను కప్పవచ్చు. అప్రతిహతంగా ఉందికదూ?

రంగ: (పేలవంగా) మహా మహా! (ప్రేమవల్లి చిన్నగా నవ్వుతుంది. నిల్చుని అడుగుల్లో అడుగు వేసుకు గది గుమ్మందాకా పోయి ఒక్కసారి దబాలున తలుపు తెరుస్తుంది) ఏమిటాపని?

ప్రేమ: మరేంలేదు. మీ ఆవిడగారు మాటునుండి వింటోం దేమో అని చూస్తున్నా!

రంగ: (కొంచెం ఉద్రేకంగా) ఫరవాలేదు. ఆవిడ వినటం లేదు. ప్రక్క ప్రక్కల్ని పొంచుండటం ఆవిడకి చేతకానిపని.

ప్రేమ: అదేమిటండి? ఆమాత్రానికే కోపం తెచ్చుకుంటారు? ప్రక్క ప్రక్కల్ని పొంచుండి పసిగట్టే ఆడవాళ్ళు ఎంతమందో? మీకేం తెలుసు?

రంగ: అలాగేం? అట్లాంటి నరజాణల్ని కలిసే భాగ్యానికి నే నింతదాకా నోచుకోలేదు.

ప్రేమ: ఒట్టి చిలిపిమనిషి!

రంగ: దానికేంగాని, ముందు చెప్పు నే నీకు చెయ్యాలి సింది ఏమిటో?

ప్రేమ: (ఒయ్యారం ఒలుకుతూ) ఏం అక్కర్లే. అంత చిరాకైతే నేను చిన్నబుచ్చుకుంటా. ఏదీ మీ కాక్కావా లంటేనే (అంటూ చెయ్యి బారచాస్తుంది. రంగ ధామం వేళ్ళకొసలు నాజూగ్గా పట్టుకు చుంబిస్తాడు) చాల్చాలు. కాని ఇంకా చిరాగ్గా ఉన్నట్టుంది.

రంగ: ఛా ఛా! ఏం లేదు,

ప్రేమ: పూర్వంలా మీరు నన్ను ప్రేమిస్తున్నారా అని?

రంగ: ఔను.

ప్రేమ: అయినా కాకపోయినా ఉన్నదున్నట్టు చెప్తారేమిటి?

రంగ: చెప్పరు.

ప్రేమ: పశువు!

రంగ : (కొంత చిరాకుగా) పసుపూ లేదు పచ్చగడ్డీ లేదు. అసలు ఇప్పుడు నువ్వెందు కొచ్చినట్లు?

ప్రేమ: ఇవాళ నామీద చాలా ప్రసన్నంగా ఉన్నట్టుందే?

రంగ : నిన్న సాయంత్రం అంతా నిశ్చయించుకున్నాం. నీ టికెట్టు నీ కిచ్చేను. ట్రెయిను ఎన్నింటికి బయలు దేరేదీ చేప్పేను. నేరుగా స్టేషనులో కలుద్దాం అనుకున్నాం.

ప్రేమ: అది బాగానే ఉంది. పంకజాక్షిని ఒకసారి చూసి పోదామని వచ్చా.

రంగ : ఎందుకు?

ప్రేమ: ఆవిడగారి అమాయకత్వం చూట్టానికి నాకు ముచ్చటవుతుంది. ఆవిడను చూస్తూఉంటే, ఆవిడ కళ్ళ క్రింద జరిగే తతంగం కించిత్తూ వాసన కట్టలేని వెర్రి బాగులతనం తల్చుకుంటే నా కెంతో ఆనందంగా ఉంటుంది. అంత నమ్మకంగల మనిషిని ఇంతవరకూ నేను చూడలేదు.

రంగ : ఆ విషయం అట్టే తెలుసుకోటానికి నువ్వు ప్రయత్నిస్తే నా కెంతో బాధగా ఉంటుంది.

ప్రేమ: పాపం! ప్రియతములైన అబ్బాయిగారు ప్రసంగిస్తున్నది దేన్ని గురించో?

రంగ : మన మెళుకువలో మనం ఉండటం మంచిదే. కాని మా ఆవిడ మనని పరిపూర్ణంగా నమ్ముతోంది. మనిద్దరినీ ఎప్పుడూ ఏకాంతంలో యెందుకు విడిచి పెడుతోంది? ఈ విషయంలో అణుమాత్రం కూడా

అనుమానానికి తావున్నట్టు ఆవిడ తలకి ఎన్నడూ తట్టలేదు. ఆత్మరక్షణకి అవకాశములేని మానవుడిని క్రిందికి త్రోసినట్టే ఆవిడని ఆడిపోసుకుంటే.

ప్రేమ: అంటే యింకమీద అబ్బాయిగారు నన్ను ప్రేమించటం లేదన్నమాట.

రంగ: నిన్ను ప్రేమిస్తూనేఉన్నా. ఆ విషయం నా నాలుక పొడారిపోయేపర్యంతం చెప్పేను. ఇంకేం చెయ్యాలో నాకు తెలియదు. దేముడికితప్ప.

ప్రేమ: అబ్బే! ఉత్తది. ఇదివరకులా నన్ను నువ్వు ప్రేమించటం లేదు. పురుషులకి ప్రేయసిపైని మక్కువ తగ్గేకమాత్రం సత్యం, ధర్మం స్ఫురణకొస్తాయి (రంగధామం ఏంచెయ్యాలో తెలియని నిస్సహాయత స్ఫురించేలా నిట్టూర్పు విడుస్తాడు.) ఇట్లాంటి రాద్ధాంతాలకి ఇది మొదటిదిమాత్రం కాదు. నీకోసం నేను సర్వం త్యాగం చేసేను, నన్నిప్పుడు అలుసు చేస్తున్నావ్. అవమానిస్తున్నావ్. దేశంకోసం విదేశాల్లో ధైర్యంగా వర్తక వ్యాపారాల్లో అవస్థలపాలవుతున్న మాఆయనన్నితల్చుకుంటే! క్రూరం క్రూరాతిక్రూరం.

రంగ: ఇంతకీ నేన్నదేమిటి? పంకజాన్ని కిన్నడగాచూస్తే నాకు కొంచం న్యూనతగా ఖూణతగా ఉందన్నా. అంతేగా?

ప్రేమ: నేనెంత ఖూణతపడుతున్నానో నువ్వు ఆలోచిస్తేగా? నే నెంతగా బాధపడుతున్నానో నువ్వు పట్టించుకుంటే కదూ? మా ఆయనసంగ తేంగాను?

రంగ : బాగుంది నీ భర్తనుగురించి నాకేం తెలియదు. నా భార్య గురించి నాకు బాగా తెలుసు.

ప్రేమ: అంత మూర్ఖత్వం కూడదు. అవునవును. నీ భార్య గురించి నీకు బాగా తెలుసు.

రంగ : అందుకనే అంత నీచంగా ప్రవర్తించటం నచ్చుకో లేకుండా ఉన్నా.

ప్రేమ: నిజంగా నన్నేగాని నువ్వు ప్రేమిస్తే. నన్నుమినహాగా ప్రపంచంలో మరి దేన్ని గురించీ నువ్వాలోచించవు. మరి దేనిమీదా నీ దృష్టి పోదు. ముమ్మాటికీ పోదు. (చేతి రుమాలు చెమ్మగిల్లుతూన్న — నయనాలకేసి నొక్కుతుంది.)

రంగ : అబ్బె! నే చెప్తున్నా, ఏడవకు.

ప్రేమ: నే ఏడిచితీరాలి. ఇంత నీచంగా ఇదివర కెన్నడూ నేను చూడబడలేదు. ఇంక నువ్వు నన్ను ప్రేమించక పోతే ఆ విషయం ఎందుకు తేల్చకుండా ఉన్నావ్?

రంగ : తేల్చటాని కేంవుంది? నిన్ను ప్రేమిస్తూనే ఉన్నా. కాని...

ప్రేమ: ఏమిటా కాని?

రంగ : (జంకుగా) చూడూ! మనం - మనం - ఆ, అది— మనం ప్రస్తుతానికి మన నీలగిరి ప్రయాణం కొద్దిగా వాయిదావేస్తే చాలా బాగుంటుం దనుకుంటా.

ప్రేమ: (కోపోద్రేకంతో వూపిరందక) ఏమిటీ, ఏమిటీ! ఏమిటన్నావ్?

రంగ: పంకజాక్షి ఎంతో గ్రుడ్డిగా నమ్ముతోంది - మనలిని.

ప్రేమ: మరి నీతో యీ జన్మలో మాట్లాడేదిలేదు. ఎంతో నీచంగా నీచాతి నీచంగా నన్నవమానించేవు. నిన్న సలు ఎప్పుడూ కలియకుండా ఉంటేనే బాగుండేది. (ఆవిడ యేడుపుకి లంకించుకుంటుంది.)

రంగ: అరి దేవుడా! అదేమిటి? ఏడవకు వల్లీ- నా మాట విను. నేను చాలా విచారిస్తున్నా. అంతగా నొప్పిం చాలని నా వుహ కానే కాందే? (అతడు ఆమె ముఖాన్నుంచి చేతులుతీసివేయటానికి ప్రయత్నిస్తాడు)

ప్రేమ: నన్ను తాకొద్దు. నాదరికి రావొద్దు.

రంగ: నువ్వు ఏడుపు మానితే నీ కేది కావాలంటే అది చేస్తా - అబ్బా! ఇటు చూడు! ఈ సమయంలో పంకజాక్షి ప్రవేశిస్తే ఏం జరుగుతుందో ఆలోచించు. మజాగా నీలగిరి తిరిగివద్దామని నాకూ ఎంతో ముచ్చ టగా ఉంది. కాని నీకు కలగబోయే కళంకంగురించి మాత్రం తలుచుకుని తటపటాయిస్తున్నా.

ప్రేమ: నిజం?

రంగ: ఔను వల్లీ!

ప్రేమ: అయితే నిజంగా నేను, కూడా రావటం నీ కిష్టమే అంటావా?

రంగ: అవుననుకో కాని నీకు కలగబోయే కళంకం గురించి నువ్వేం పట్టించుకోకపోతే, నాకేం అభ్యంతరంలేదు.

ప్రేమ: (చిరునవ్వుతో) బాధ లేదు. ఆ విషయం నే చక్క-బెట్టుకుంటా.

రంగ: ఏం ఏంచేస్తావ్ ?

ప్రేమ: ఓ క్షణంపాటు ఆగు నువ్వే చూస్తావుగా? (ఆవిడ పూర్తిగా తేరుకుంటుంది. ఒక్కసారిగా వుల్లాసం వెల్లివిరుస్తుంది)

రంగ: పంకజాక్షికి ఇంక మన పని అయిపోయిందని చెప్పవచ్చా?

ప్రేమ: ఓ చెప్పవచ్చు. (రంగధామం గుమ్మందరికి పోతూ ఉంటే) అన్నట్టు పూర్తిగా మరిచేను – మెదడు వట్టి మట్టిగా తయారయింది.

రంగ: ఏమిటి సంగతి ?

ప్రేమ: ఇంతసేపాయ నీ భాగోతంతో అసలు ముఖ్యంగా నే నెందుకు వచ్చేనో ఆపనే మరిచేను.

రంగ: నేను భాగోతం కట్టేనా? నాకా సంగతే తెలియదు సుమా?

ప్రేమ: నిన్నేదో అడుగుదాం అనుకున్నా. నువ్వు కోపగించుకోవుకదూ? ఏం?

రంగ: అట్లా ఏం అనుకోను. అడుగు.

ప్రేమ: అబ్బే! అంత ముఖ్యమయినదేం కాదు. అయినా కాస్త వ్యగ్రతగాఉంటుందేమోఅని సంకోచిస్తున్నా.

రంగ: ఛా ఛా! అదేమిటది. నీకోసం చెయ్యగలిగిందేదేనా చేస్తాగా?

ప్రేమ: స్టాక్ ఎక్స్ఛేంచి వ్యాపారంలోవున్న మా చుట్టం ఒకాయన నాకో మంచి సదవకాశం ఉంటుందంటూ ఉత్తరం వ్రాసేడు. ఆపైని...

రంగ: ఆపైని అది అక్కడకు రాలేను. ఆ సదవకాశాలన్నీ నాకు తెలుసు.

ప్రేమ: అబ్బెబ్బె! అయినా యీసారి ఫలించి తీరుతుంది. కాని కొద్దిగా మదుపు పెట్టాలిసుంటుంది. అసలా గొడవేదో నాకు సరిగ్గా అర్థంకాలేదు. కాని కనక రాజు...

రంగ: (అడ్డొస్తూ) ఆయనా? స్టాకెక్స్ఛేంజిలో మీ చుట్టం?

ప్రేమ: ఔను. ఏం?

రంగ: ఏం లేదు. ఆ పే రెక్కడో విన్నట్టుంది. అంతే.

ప్రేమ: కనకరాజు తనపేర నన్ను తప్పకుండా రు 900 కో చెక్కు పంపించమన్నాడు. (రంగధామం ఒకసారి వులికి పడతాడు. అతని ముఖం ముకుళించుకుపోతుంది)

ప్రేమ: కాని ఉన్నపాటుగా అది సర్దటానికి నాకు కొంచం చికాకుగా ఉంటుంది. నీకు తెలుసుగా నా రాబడి ఎప్పుడూ అర్ధసంవత్సరానికోసారిఅందుతూఉంటుంది. బ్యాంకులో నిజానికి రు. 900 లు దాకా నిలవలేదు. నే నెప్పుడూ అప్పుకు పోను. పైగా ఆ పేరుకూడా నే భరించలేను. ఇప్పట్లో అరమరకలేని వ్యక్తివి నువ్వొక్కడివే.

రంగ: మనిద్దరం అంతఅభేదమని నువ్వనుకున్నందుకు చాలా సంతోషం. ఇందులో ఇచ్చకం ఏం లేదు.

ప్రేమ: నాకు తెలుసు. తక్షణం అడిగినంతా నువ్విస్తావని. అయినా నాకొచ్చే లాభంలోంచి నీది నీకు తీర్చేస్తా.

రంగ : దానికేంలే – చూస్తా నేనేం చెయ్యగలనేమో.

ప్రేమ: ఉన్నపాటుగా చెక్కు వ్రాయమంటే నీకేం ఇబ్బంది లేదుగదా? ఇప్పు డివ్వగలిగితే నా హృదయంలోంచి ఓ పెద్ద బరువేదో తొలగించినట్టుగా భావిస్తా. (అతను బల్లముందు కూర్చుని చెక్కు వ్రాస్తాడు)

ప్రేమ: (నవ్వుతూ) రొంబ థాంక్స్. నువ్వెంత మంచివాడి వనుకున్నావ్? ఏదీ, ఇంకో చిన్న ప్రిస్క్రిప్షను వ్రాసి పెట్టు. పంకజాక్షి కళ్ళు తుడవటానికి. (అతడు వ్రాస్తాడు)

ప్రేమ: మరి నీకు ఫీజు యివ్వాలి.

రంగ : మరేం బాధ లేదులే.

ప్రేమ: అలా వీలులేదు. పైగా అది పంకజాక్షి కన్నుకప్ప టాని కెంతో అవసరం. (ఆవిడ చేతి సంచిలోకి చూస్తుంది) అయ్యో నా మందమతా? ఆరు కాను లున్నాయి పర్సులో. నీ జేబులో ఓ పది రూపాయి లున్నాయా?

రంగ : ఉన్నట్టున్నాయి. ఈ సాయంత్రానికి నా సంపాదనే అది. (అతడు జేబులోంచి పది రూపాయిలనోటుతీసి ప్రేమవల్లికి అందిస్తాడు. ఆవిడ పది రూపాయిల నోటుతోపాటు పర్సులోంచి ఒక అణాతీసి బల్లమీద పెడుతుంది.)

ప్రేమ : తేంక్సు... అదుగో... ఆఫీజుచూడు ఎంత ఆడంబరంగా వుందో? అలాగేవుంచు. అదోసారి పంకజాక్షి కంటబడాలి.

రంగ : మరి పంకజాన్ని పిల్చేదా?

ప్రేమ : నే పిలుస్తా.

[ఆవిడ గుమ్మంవరకువెళ్ళి కేకవేస్తుంది. పంకజాక్షి మాపని అయిపోయింది.]

రంగ : (మేడమీద మాటలువిని) అదుగో సుబ్బారాయుడు గారు వచ్చినట్టుంది.

ప్రేమ : ఓహో! ఆయనగారిని నిన్న పార్కులో కలిసేను. చాలా వుల్లాసంగా వున్నాడు. నేను కూనవరంవారి తాలూకా అని అడిగేడు. ఆయనగారి భావం నా కర్థంకాలేదు. అయినా "అవును" అన్నా. దాంతో ఆయనగారు చాలా ఆనందించినట్లు కనకపడ్డాడు.

రంగ : కొంపతీసి నువ్వోసాధారణ కుటుంబంలో పుట్టేవని చెప్పేవు గనక. ఆయనగారికి మూర్ఛ వచ్చినంత పనవుతుంది.

ప్రేమ : దానికేం. మహారాజకుమారికా ఆఫ్ మన్మథనగర్ అని చెప్తాను. అది వినటానికికూడా సొంపుగావుం దనుకుంటా.

రంగ : ఎంత సున్నితంగా చెప్పాలన్నా నీ కల్పనాశక్తి అప్రతిహతం అనుకో.

ప్రేమ : అవేం నాకు తెలియవుకాని, స్త్రీత్వంగల పద్మినీ జాతి స్త్రీని నేను. అందుకే పురుషులు నాకోసం పడిగాపులు పడతారు.

[పంకజాక్షి సుబ్బారాయుడు ప్రవేశం]

సుబ్బా : ఓహో! ప్రేమవల్లిగారు! అనుకోకుండా గందరగోళంగా ఆనందం కలిగినా తట్టుకోటం కష్టమేనండోయ్!

ప్రేమ : గందోళిగాడిలా ఏమిటండి ఆసోదె? మీ రుట్టి చిలిపి మనుష్యులని విన్నా.

పంక : ఎవరు? మా సుబ్బారాయుడు మామయ్యా?

సుబ్బా : (ఆనందిస్తూ) అవన్ని చిన్నప్పటి ముచ్చట్లు ప్రేమవల్లిగారూ!

ప్రేమ : తమకిట్లాంటి ప్రఖ్యాతివుందని తెలిస్తే అమాంతం అరగంటసేపు పార్కులో నాతో మాట్లాడనిచ్చేదాన్నే కాదు.

సుబ్బా : (ఉల్లాసంతో వుబ్బిపోతూ) అబ్బె! వినిపించిన ప్రతి విషయానికీ మనం చెవి ఒగ్గకూడదండోయ్. సహజంగా, చూసేరూ, సంఘంలో ఉన్నతవర్గాలతో విచ్చలవిడిగా తిరిగే నావంటి వ్యక్తిగురించి చిత్ర విచిత్రంగా చెప్పుకుంటూ వుంటారు. ప్రపంచం చాలా సంకుచితంగా తయారైంది. పైగా తప్పులు వెతికటం ఒకటేపనిగా పెట్టుకుంది.

ప్రేమ : డాక్టర్ రంగధామూరావుగారు ఇప్పుడే ఒక ప్రిస్కిప్షను వ్రాస్తున్నారు. ఈమధ్య నాకు కొంచం ఒంట్లో బాగుండటంలేదండీ.

సుబ్బా : అయ్యో! పాపం. చిక్కితే పాలుకారేటంత ఆరోగ్యంగా అప్సరసలా కనిపిస్తున్నారండి?

ప్రేమ : ఛా! ఛా! ఒట్టి కర్కశత్వమండి మీది. "అయ్యో పాపం ఎంత చిక్కిపోయేరండి" అంటూ నామీద సానుభూతి చూపుతారనుకొన్నా.

సుబ్బా ; దానికేం! మీయింటిదగ్గర నన్నొకసారి కలియనిస్తే, కావలసినంత సానుభూతి చూపుతా. కాని మీగురించి ఎప్పుడుచెప్పినా అందాలుచిందే మడోనా అనితప్ప ఇంకోలా చెప్ప లేనేమో అనిమాత్రం భయపడుతున్నా.

ప్రేమ : అదంతా మీ చమత్కారంలెండి. నేను నీలగిరినుంచి తిరిగివచ్చిన తక్షణం మీరు విధిగా నన్ను చూడటానికి ఒకసారి రావాలి.

[రంగధామం ఒక్కసారి వులికి పడతాడు]

పంక : మీరు నీలగిరి వెళుతున్నారా?

ప్రేమ : పనిగట్టుకుని అది చెప్పిపోదామనే మీదగ్గరకొచ్చా. నిజానికి నానోట్లో నూగింజ దాగదుసుమండి. పాపం శ్రీమతి సరళాప్రసాద్ తనతో నీలగిరి తోడుగారమ్మని ప్రాథేయపడింది. చాలా దురదృష్టమైన సంఘటనొకటి జరిగిందండి. ఆవిడగారి పరిచారికతల్లి అక

స్మాత్తుగా చనిపోయింది. అందుచేత సహజంచూడండి. వాళ్ళతల్లి అంత్యక్రియలు అయేదాక దానికి కదలాలని లేదు. కాబట్టి...

పంక : శ్రీమతి సరళాప్రసాద్ ఆవిడగారి దాసీదానిస్తానే మిమ్మలిని రమ్మని కోరేరా?

ప్రేమ : ఆ, ఏదో ఒక రెండురోజులపాటేకాని ఏమండోయ్! ఒక్క విషయం ఉన్న దున్నట్టు చెప్పేయండి. మీరేం అనుకోరుగదా?

పంక ॥ నేనా?

ప్రేమ : అసూయా, ఆడజన్మ ఒకేసారి పుట్టేయంటారు. నీలగిరి అంత దూరప్రయాణంలో డాక్టర్ రంగధామారావుగారితోకూడా, నే నుండటం, తిరుగుప్రయాణంలోకూడా యిద్దరంకలిసే రావటం మీకంత నచ్చదేమో అనుకుంటున్నా.

పంక : ఛాఛా! ఎంతమాట. నాకెంతో ఆనందంగావుంటుంది. ఆయనగారికి దారిపొడుగునా ఎవరో ఒకరు ప్రక్కనుంటేనే మంచి ఉల్లాసంగా వుంటుంది.

ప్రేమ : అంతటితో ఆవిషయం చక్కబడ్డట్టే. చూసేరూ! ఏమాత్రం అపోహలకి అవకాశం లేకుండా ప్రతిపనీ బాహాటంగా చేసేయటం నాకెంతో నచ్చుతుందండి.

సుబ్బా : (టేబిల్‌మీద పదిరూపాయిలనోటు చూస్తూ) రంగధామం! నువ్వు వూరు కొల్లగొట్టుతున్నట్టుందే?

ప్రేమ : ఓ! అదా? అది నేను యిచ్చినఫీజు. పుచ్చుకుంటే గాని వీలులేదని నిలతీసేను. ప్రత్యేకించి పంకజాక్షి గారు యీ విషయం గమనించాలని కోరుతున్నా - ఇట్లాంటి విషయాల్లో నేను చాలా నిజాయితీగా వుంటా.

పంక : బాగుంది. కాని ఆయనగారు అదిస్వీకరించగలిగితేగా? (రంగధామంతో) మరీ ఇంత మురికిగా తయారవుతున్నారేమండీ?

రంగ : సరే! ఆ డబ్బుకి నే ఆశిస్తేకదూ?

పంక : వల్లిగారూ! విధిగా మీరది తిరిగి తీసుకోవాలండి.

ప్రేమ : (ఆవిడచెయ్యి అడ్డంపెడుతూ) అబెబ్బే! వాస్తవంగా అట్లాంటిదేం వీలులేదండి. అది నా నియమాలకే విరుద్ధం.

పంక : మీ నియమాలన్నీ అమోఘమైనవి. ఆ విషయం నాకు బాగా తెలుసు. కాని నిజానికి నా ముఖ్యాతి ముఖ్యమైన స్నేహితురాలిని చూడటానికి ఆయనగారు ఫీజు తీసుకోటం నాకు తలతీసుకున్నట్టుంది. (పంకజాక్షి బల్లమీద డబ్బుతీసి ప్రేమవల్లికి అందిస్తుంది)

ప్రేమ ॥ అబ్బా! ఓ చిన్నవిషయానికి మీరింత తీవ్రంగా వాదిస్తే ఏం చెయ్యాలో నాకేం పాలుపోవటంలేదు.

పంక : ఏంచెయ్యొద్దు. చక్కా ఆపైకం తీసుకుని పర్సులో పెట్టుకుని, మరి దానిగురించి మాట్లాడవద్దు.

ప్రేమ : మీరు చాలా మంచివారు.

(ఆవిడగారు పైకం పరసులో పెడుతుంది. చూస్తూ ఉండగా తన కష్టార్జితం అంతర్ధానం అవుతూవుంటే రంగధామం ముఖం దిగజారిపోతుంది) ఇంకనేపోవాలి. (సుబ్బారాయుడువైపు చేతులు జోడించి) నమస్కారమండి. నన్ను చూట్టానికి రావటం మరిచిపోయేరు సుమండి. ఆ అన్నట్టు అదెవరో సినీమాతార ? మొన్న చెపుతూ మంచి రసపట్టులో ఆపేసేరు. ఆవిడ గురించి వివరాలన్నీ మాయింటికి వచ్చినప్పుడు చెప్పాలండోయ్ !

సుబ్బా : (ఉల్లాసం వెల్లివిరుస్తూ) అట్లాంటి అసభ్యపు ఎల్లలు దాకా నన్ను పోమ్మనకూడదండోయ్.

ప్రేమ : (పంకజాక్షితో) వెళ్ళివస్తానండి.

[పంకజాక్షి ప్రేమవల్లి బయటకు పోతారు]

రంగ : (టెలిఫోనుదగ్గరకు వెళుతూ) మీకు సినీమాతారలతో స్నేహం వుందన్నసంగతే నమ్మలేకుండా వున్నా.

సుబ్బా : ఏంలేదోయ్ ? వుత్తది. కాని సినీమాతారలతో మనకి ములాకత్తువున్నాదంటే మనవర్గానికిచెందిన స్త్రీలకి చాలా సరదా.

రంగ : 31 లోకల్ సినీతారలలోకూడా పదింట తొమ్మిది మంది సంధ్యపడగానే గూటికి చేరుతారనీ, వాళ్ళకీ భర్తలు, పిల్లలూ, సంసారాలూ వుంటాయనీ వీళ్ళకి తెలిస్తే! ఆ వుండండి మాతమ్ముడికి కొంచెం ఫోను చెయ్యాలి. (ఫోనులో) హల్లో! ఎవరది ? రమణా !

చూడూ! కోయంబత్తూరులో పరంజిపాయ్ అనే కంపెనీవాళ్లు యీమధ్య ఏవేనా కాఫీషేర్లు ఫ్లోటు చేసేరా? ఆ-అస లలాంటి కంపెనీ లేనేలేదా? దగా! నేనూ అదే అనుకున్నాలే. సర్లే! (టెలిఫోను దించేస్తాడు. తనలో విచారంగా) తొమ్మిదివందల రూపాయలూ గోవిందా!

సుబ్బా : చూడు! రంగధామం! ఇప్పుడే కాస్త నీకు తీరికగా వున్నట్టుంది. నా ఆరోగ్యంగురించి చిన్న సలహా ఇయ్యి. అయితే నీకు యిబ్బందేంలేదనుకో.

రంగ : ఆరిదేవుడా! ధర్మాసుపత్రిగా వుంది నాపని. ఇంక బ్రతుకుతెరువుకి విరామాలేనా లేవాయె.

సుబ్బా : అసలుసంగతేమిటంటే, నా శరీరం ఇప్పట్లో ఇదివరకంత లఘువుగా, సన్నంగా లేనట్టుందోయ్. ఈమధ్య ఆవిషయం నా. దృష్టిలో కొస్తోంది.

రంగ : అది తెలుసుకోటానికి అంత రీసెర్చి అవసరంలేదే?

సుబ్బా : చూడు! రంగధామం! నే నడిగింది చమత్కారం కాదు. సలహా.

రంగ : ఈవయస్సులో ఇంక దేహసౌష్టవంగురించి అష్టేబాధ పడకండి.

సుబ్బా : నీకు నిజంచెప్పాలంటే, ఒక చక్కటి వన్నెలాడికి నా హొషుచూసేక ఏదో కొంతవరకూ నామీద మక్కువ కలుగుతూందేమో అని అపోహగా...

రంగ : (మాట కడ్డొస్తూ) నా సలహా తీసుకుని ఆవిడగారికి ఆ మక్కువ మసిపోకుండా త్వరగా శుభముహూర్తం పెట్టించండి.

సుబ్బా : దేనికి? బాలసారెకా? నీకు కాస్త వింతగా కనిపించవచ్చు. ఆవిడ వివాహిత.

రంగ : అయితే మరి వెనకాముందూ చూడకండి - గొళ్లెం తప్పించండి.

సుబ్బా : అంటే ఏమిటి నీవూహ? రంగధామం!

రంగ : మహాశయా! నాకు మాతామహుండు కాదగిన వయస్సుందిమీకు. వివాహమైన స్త్రీతో సయ్యాటలకిదిగటం వినోదానికి తుట్టతుదిమెట్టు. మీ జాగ్రతలో మీరుండటం మంచిది. అతంకన్నా ఏం చెప్పాలి? జాగ్రత్త.

సుబ్బా : ఏం?

రంగ : ఏం ఏమిటి? ఆవిడగారు మీకరచరణాలు కట్టేసి మెడకో కళ్లెం తగిలించి అల్లాటప్పాయిలా ఆడిస్తుంది. ప్రతిదినం పదిసార్లడుగుతుంది మీ రావిడగారిని ప్రేమిస్తున్నారో లేదో. పోదాం అని మీరులేచిన ప్రతిసారీ రాద్ధాంతంచేసి నిర్బంధంగా ఇంకాస్సేపు మిమ్మలిని కూర్చోపెడుతుంది. చెప్పులు తొడుగుకున్న ప్రతిసారి తిరిగి యెప్పుడొచ్చేది, ఎన్నింటికొచ్చేది, కచ్చితంగా చెప్పమని నిలతీస్తుంది.

సుబ్బా: కానీ! ఆడవాళ్ళంతా అట్లాగేవుంటారు. దాని వల్లేగా వాళ్ళకి నీమీద ఎంతమక్కువ వుండేదీ తెలిసేది?

రంగ: అవునవును ఆడవాళ్ళంతా అలాగే వుంటారనుకుంటా. ఒక్క పంకజం మినహాగా. పంకజం ఏం పట్టించుకోదు. ఆవిడగారిని ప్రేమిస్తూన్నదీ లేనిదీ అడగే అడగదు. పోదాం అని లేస్తే ఇంకోగడియ ఆగమని మాటవరసకికూడ అనదు. ఎక్కడెక్కడికి వెళ్ళేది, ఏం చేసేదీ తెలుసుకోవాలన్న ధ్యాసేవుండదు. నిల తియ్యడంమాట దేముడెరుగు! అన్నింటికంటె ప్రాణాంతకమయిన ప్రశ్న-ఆవిడగారిని వదిలివెళ్లే ప్రతిసారీ, "మళ్ళీ ఎన్నింటికండీ రావటం?" అనదే.

సుబ్బా: బాగుందబ్బాయ్! చూడూ! మా ఆవిడేగాని అంత పెడముఖంగా వుంటే, "ఈవిడ కన్నుపడ్డది ఎవడిమీదా?" అని నన్ను నేనే ప్రశ్నించుకుంటాను.

రంగ: (ఉద్రేకంగా) అంటే మీభావం?

సుబ్బా: అబ్బాయి! నిలతీసి అడగటం స్త్రీలకి నైజగుణం. స్త్రీ తను ప్రేమించే పురుషుడికి కలిగించే చీదర చెప్ప శక్యంకాదు. ఆ చీదరలోనూ, తియ్యటి అనుభూతి వుంది. నా మనస్సుకి అదెంతో నచ్చుతుంది.

రంగ: అంటే పంకజాక్షి ప్రవర్తనగురించి మీఅభిప్రాయం...

సుబ్బా: చూడబ్బాయ్! ప్రస్తుతం పంకజాక్షిగురించి నీతో ప్రస్తావించటానికికాదు నే నొచ్చింది. నా ఆరోగ్యం గురించి తెలుసుకోటానికి.

రంగ : (చిరాకుగా) ఓహో! మీకు జీర్ణించిపోయిన క్రొవ్వు వ్యాధితప్ప మరేంలేదు. ప్రస్తుతం మీ దేహంలో వున్నదోషం అంతా అదే. మరేంలేదు.

సుబ్బా : కొంపతీసేవు! అదివింటేనే కంపనగావుంది. దానికి నే నేంచెయ్యాలంటావ్ ?

రంగ : (క్రూరంగా అతిత్వరగా) పొగాకూ, పళ్లూ, పాలూ, నెయ్యి, నూనె, పెరుగూ, మజ్జిగా, పులుపూ, కారం, పొటేటో, కేబేజీ, వరి, గోధుమా - అన్నీ ఆరు మాసాలు పూర్తిగా వర్జించాలి.

సుబ్బా : అయితే అది వైద్యంకాదు-హత్య!-హత్య!-హత్య!

రంగ : (వినిపించుకోకుండా) ప్రతిరోజూ ఉదయాన్నే కాఫీకి ముందు దట్టమైన కంబళిని కప్పుకుని పార్కు-చుట్టూ పరిగెత్తండి-ఏది ఇంకోసారి మీ వూపిరితిత్తులు చూద్దాం.

సుబ్బా : కాని అబ్బాయ్! రంగధామం!...

రంగ : ఏదీ కాస్త అలా సోఫాలో పడుకోండి-అబ్బ! ఏం గొడవ చెయ్యకండి. మిమ్మలిని ఏం నేను గొంతుక నులిపి చంపీబోవటంలేదు. (సుబ్బారాయిడు పడుకుంటాడు) ఏవి? మోకాళ్ళు పైకెత్తండి.

సుబ్బా : (రబ్బరుతిత్తితో రంగధామం సుబ్బారాయుడు వూపిరితిత్తులు పరీక్షిస్తూవుండగా) అందులో ఏం సందేహంలేదు... ఆవిడకి మంచి అందం, ధైర్యం, దబాయింపూ అన్నీ వున్నాయి.

రంగ : ఇంకమీరు లేవ వచ్చు. ధైర్యం, దబాయింపూ ఏమిటి? ఎవరా అందకత్తె?

సుబ్బా : ప్రేమవల్లి:

[రంగధామం సోఫాదగ్గరనుండి కదులుతాడు. సుబ్బారాయుడువైపు ఒక్కసారి చూచి మాట్లాడటానికా అన్నట్టు తెరువబడ్డ నోటితోటే అక్కడనుండి నడిచి పోతాడు.]

సుబ్బా : రంగధామం! రంగధామం!

(ఎంతో ఆందోళనతో సోఫా దిగిపోతాడు) నా వూపిరితిత్తి పూర్తిగా పాడైందా?

రంగ : (పూర్తిగా సందిగ్ధంగా) చాలా కఠినమైన స్థితిలో వుంది. అలాగే వుంటుందనుకున్నాను.

సుబ్బా : (విషాదం వుట్టిపడే గొంతుకతో) రంగధామం! ఏం ఘోరం జరిగిందో వెంటనే చెప్పు.

రంగ : (చిరాకుగా) ఒట్టి గార్దభంలా గోలచెయ్యకండి? నా గుండెకాయ ఎంత ఆరోగ్యగావుందో మీదీ అలాగే వుంది. ఉన్న విశేషమల్లా ఒక్కటే. మీరుబాగా అమితంగా మెక్కి ఒళ్ళు అంతగా కందనియ్యటంలేదు.

సుబ్బా : (ఉద్రేకంతో సమ్మిళితమైన ఉత్సాహంతో) మహోన్నత వర్గాలతో తరుచూ విందులు గోవిందులూ ఆరగించేవ్యక్తి ఆమాత్రం అనారోగ్యం భరించాలిసుంటుందిలే.

రంగ : (అతనివైపు తీక్షణంగా చూస్తూ) మీమీద కొంత వరకూ మక్కువ కలుగుతోందేమో అని మీరు అపోహపడుతూవున్న వన్నెలాడి ప్రేమవల్లేనా ?

సుబ్బా : (ఎంతో ఆత్మసంతృప్తితో) చూడబ్బాయ్! నే నొక వన్నెలాడి వలలోపడటం అనేది కల్ల.

రంగ : ఓహో!

సుబ్బా : మనలో మనమాట రంగధామం ! చూడూ! ప్రేమ వల్లిని మాయింటికి విందుకి పిలిచేననుకో - ఆవిడగారి కది విచిత్రంగా కనిపిస్తుందంటావా ?

రంగ : విచిత్రం ! వినీవినటంతో ఒక్కసారి ఆవిడగారు ఎగిరి గంతువెయ్యదూ ?

సుబ్బా : ఆవిడగారిభర్త ఏం బాధపడడుకదా ?

రంగ : మరేం బాధలేదు. ఆవిడగారిభర్త దేశంకోసం విదేశాలలో అంతులేని వ్యాపారాల్లో మునిగి తేలు తున్నాడు.

సుబ్బా : ఆవిడగారిది చాలా దొడ్డగుణంలా వుందోయ్ ! అలా కాకపోతే, ఆవిడగారు నీతోకూడా నీలగిరి ప్రయాణం కట్టినట్లు తరువాత తెలిస్తే పంకజాక్షి ఏం బాధపడుతుందో అని ముందుగావచ్చి అనుమతితీసుకు మరీ వెళుతుందా ?

రంగ : ఔనౌను! ఆవిడగారిది చాలా దొడ్డగుణం!

సుబ్బా : నక్కనడుం త్రొక్కేవులే! ఆవిడగారితో నీలగిరి పోతే-నేనే నువ్వయితే !

రంగ : (నిండా ఒప్పుదలతో) అదే నిజమయితే! నేనే మీ రయితే! దీనరక్షకా! ఆపద్బాంధవా! దయకలి గిందా! అని చేయెత్తి మ్రొక్కకపోయేనా!

సుబ్బా : అయ్యో మందమతా! బాగుంది! బాగుంది! రాత్రికి ముడదాం రాణీగారితో విందుంది. అసలీ పెద్దిళ్ళ వన్నెలాడులు నన్ను ఒదలిపెడితేనా? వెళ్ళి వస్తా! గుడ్ బై!

[అంటూ సుబ్బారాయుడు నిష్క్రమణ. రంగ ధామం గదిలో ఆలోచిస్తూ ఇటూ అటూ పచారు చేస్తూవుంటాడు. ఒక్కక్షణంలో పంకజాక్షి తొంగి చూస్తూ]

పంక : ఏమండీ? మీరింకా సామానులు సర్దుకోనక్కర లేదూ?

రంగ : అది సరేగాని లోపలికిరా! ఇద్దరం కలిసి కాస్తకాఫీ త్రాగుదాం. (పంకజాక్షి కప్పులు సర్దుతుంది. రంగ ధామం ఫ్లాస్కులోంచి ఆవిరొచ్చే కాఫీపోస్తాడు)

పంక : మీకు వూటీలో మంచి ఉత్సాహంగా కాలక్షేపం అవుతుందనుకుంటా. (ఆవిడ కూర్చుని కాఫీ చప్ప రిస్తుంది)

రంగ : ఇదివరకులా ఒయ్యారంగావచ్చి నా కుర్చీదండెమీద కూర్చోటం మానివేసేవు.

పంక : పోనిద్దురూ, చిన్నతనంలో చెల్లుతాయి అట్లాంటి చిలిపిపనులు. మధ్యవయస్సులో పడుతూన్న ముత్తై

దుని. ఇలా వేరే కుర్చీలో కూర్చుంటేనే ఎంతో సదుపాయంగా వుంటోంది.

రంగ : (కొద్దిగా కలిగిన చిక్కు పరిస్థితి బయటకు తెలియనీయకుండా ప్రయత్నిస్తూ) ప్రేమవల్లి యీరాత్రికి నీలగిరి వెళ్ళబోతోందని నీతో చెపితే నీకేం ఆశ్చర్యం కలగ లేదు ?

పంక : ఆశ్చర్యం ?

[చిన్నగా పంకజాక్షి నవ్వుతుంది. ఆ వెంటనే ఆనవ్వు అణచివేయటానికి ప్రయత్నిస్తుంది. కాని సాధ్యంకాదు. తరువాత పట్టలేక పకపకా నవ్వేస్తుంది. రంగధామం అత్యధికాశ్చర్యంతో ఆవిడకేసి చూస్తూ వుంటాడు]

రంగ : అరే! ఎందుకలా విరగబడి నవ్వుతున్నావ్ ?

పంక : (గుక్కపట్టకుండా నవ్వుతూ) బావా! మీదృష్టిలో నేనొక అల్లం బెల్లం తెలియని అప్పలమ్మలా కనిపిస్తున్నట్టున్నా. మీరిద్దరూ కలిసే వెళుతున్నారని నాకు తెలుసు.

రంగ : (పూర్తిగా కంగారుపడుతూ) నువ్వు దేన్నిగురించి మాట్లాడుతున్నదీ నాకేం తెలియటంలేదు.

పంక : నేనూ ఏదీ తెలుసుకోకుండా వుండటానికే, ఏదీచూడకుండా వుండటానికే ప్రయత్నించేను. కాని మీరా పని చాలా కష్టతరం చేసివేసేరు.

రంగ : (కోపంగా వుండటానికి మనస్సు దిట్టంచేసుకుని) అంటే నీభావం? అసందిగ్ధంగా బయటకు రానీ!

పంక : బావా! అదంతా నాకు తెలుసు.

రంగ : నీవ్యంగ్యం నాకేం బొత్తిగా అర్థం కావటంలేదు. దేన్నిగురించి నీకంతా తెలుసు?

పంక : అయ్యో! చిలిపితనమా! రంగధామం ప్రేమవల్లుల రాధామాధవం గురించి.

రంగ : (చాలా కోపంగా) పంకజం! నన్ను అనుమానిస్తు న్నట్టు చెప్పదల్చేవా?

పంక : (అభిమాన పూర్వకమైన మందహాసంతో) బావా!

రంగ : (ఒక్కసారి ఉలికిపడి) నీకేమిటి తెలుసు?

పంక : సర్వం. [ఒక్కసారి నోరు తెరుచుకుని ఆత్రుతతో పంక జాక్షికేసి చూస్తాడు అతను] గత రెండుమాసాలూ మిమ్మలిని కనిపెట్టడం నాకెంతో వినోదంగావుంది.

రంగ : వినోదం?

పంక : ఒట్టు! అదంతా ఓ చక్కటి ఆటలావుంది.

రంగ : (ఏమీపాలుపోక)ఇంతకాలం నీకు తెలుసునన్నమాట?

పంక : బావా! మీరు చూడటంలేదూ? ఇద్దరిని ఏకాం తంలో విడిచిపెట్టటానికి నే నెంతగా అవకాశాలు సృష్టించిందీ?

రంగ : కాని, నీకు మాటయిస్తున్నా. అందులో అణు మాత్రం నిజంలేదని.

పంక : (మంచి విలాసంగా) అలా దారికిరండి బావగారూ !

రంగ : అయితే ఏం అనకుండా నువ్వెందుకు వూరుకున్నట్టు ?

పంక : ఏమన్నా మీపరిస్థితి మరింత యిరుకున పడుతుందని వూరుకున్నా. అసలు యీరోజుకూడా ఏం అనదలచుకోలేదు. కాని ఆవిడగారుకూడా వస్తున్నదంటే నీకు ఆశ్చర్యం కలగలేదు? అని ప్రశ్నిస్తే ఇంక నవ్వుపట్టలేకపోయేను.

రంగ : నీకేం కోపంగా లేదూ ?

పంక : కోపం ? దేనికోసం ?

రంగ : నీకేం అసూయగాలేదూ ?

పంక : అసూయ? నేనో చిన్న గార్ధభాన్ననుకుంటున్నారు కాదోలు బావగారు.

రంగ : అయితే ఇంతాజరిగినా పరవాలేదనుకున్నావ్ ? ఓ చక్కటి ఆటలా అనిపించింది నీకు ?

పంక : బావా ! మన వివాహం జరిగి ఐదేళ్ళయింది. ఇంత కాలమాయ మనమధ్య మనస్పర్ధలున్నాయనుకోటం అసందర్భం.

రంగ : ఓహో ! అదా సంగతి ? ఆవిషయం నాకు గుర్తు లేకుండా పోయింది.

పంక : దీనంతటికీ లేనిపోని ప్రాముఖ్యతయిచ్చి పట్టించుకోవలసిన అవసరం నాకేం కనిపించలేదు. మీరు హాయిగా వున్నారంటే నాకు ఆహ్లాదకరంగానేవుంది.

రంగ : (కోపం ముంచుకొస్తూ) బాగుంది పంకజం! నిజానికి ఇదంతా చాలా అవమానకరంగావుంది.

పంక : పోనీలెద్దురూ బావా! అణుమాత్రం అపాయంలేని ఒక చిన్న తప్పిదాన్ని తీసుకుని కొండంత చెయ్యకండి.

రంగ : నావర్తనగురించికాదు నే మాట్లాడేది. నీగురించి.

పంక : నా వర్తనగురించా?

రంగ : ఔను. నిండా అవమానకరంగా వుంది అంటున్నా.

పంక : (పూర్తయిన నిరుత్సాహంతో) అదే నేను, ఎంతో చాకచక్యంగా వుందనుకొన్నా.

రంగ : అఘోరించిన చాకచక్యం. అసలు నీలో మర్యాద అనే దృష్టే మటుమాయం అయిపోయింది.

పంక : అదేమిటి బావా! నేనేం చెయ్యందే?

రంగ : నే చెప్పినదీ సరిగ్గాఅదే. కొంతలోకొంతేనా నవ్వు చేసి వుండాలిసింది. నువ్వు బాగా ఆర్భాటంచేసి జగడానికి దించాలిసింది. నువ్వు వీరంగంవేసి వీధి కెక్కాలిసింది. అన్నీ అయేక నువ్వు నాకు విడాకులే యియ్యాలిసింది. అదేంకాక అదెవరికో అన్నట్టు చక్కా కూర్చుని చూడటం అబ్బా! ఘోరం!

పంక : అయ్యో! పాపం! నే ఆర్భాటం చెయ్యటమే మీ వాంఛితమయితే విధిగా చేసుండేదాన్ని. ఇంతకీ ఈమాత్రందానికి అంత గల్లంతుచేసి గడబిడపడాలిసిన అగత్యం నాకేం కనిపించందే?

రంగ : ఇంతకంటే కఠినమైన, ఇంతకంటే అమానుషమయిన ఇంతకంటే నికృష్టమయిన విషయం నే నింతవరకు వినలేదు.

పంక : మిమ్మలిని మెప్పించడం చాలా కష్టం సుమండీ?

రంగ : ఇంతకాలంగా నిన్నెంత హేయంగా చూసేనో నువ్వేం గుర్తించలేదా ?

పంక : అబ్బె ! అదేంలేదండి. చాలా మంచిభర్తలకన్నా మీరు బాగానయం. మీలో ఎల్లప్పుడు విశిష్టతా, వివేకంకూడా వున్నాయి.

రంగ : కాదు. నేను చాలా చెడ్డవాడిని. చేసిన తప్పిదం ఒప్పుకోటానికి తగ్గపురుషత్వం నాలోవుంది. ఈరోజే నాజీవితపథంనుంచి ఒక కంటకం ఏరిపారేస్తున్నాను. పంకజం! ప్రేమవల్లిని మనస్ఫూర్తిగా విసర్జిస్తున్నా. ఇంకమీద ఆకులట ముఖంకూడా చూడనని నీకు మాట యిస్తున్నా.

పంక : అదేమిటి బావా! ఆవిడకి అనవుసరమైన బాధ యెందుకు కలగచెయ్యాలి మీరు ? ఇంతకీ ఆవిడనాకు చాలాకాలంగా కావలసిన స్నేహితురాలాయె. ఆవిడ యెడల మీ నడవడి మృదువుగా వుండాలనే నా వాంఛ.

రంగ : ఆతతంగం ఇంకా కొనసాగాలనా నీవూహ ?

పంక : అది మన ముగ్గిరిమధ్యా ముగ్గురి అవసరాలూతీర్చే ఓ చిన్న ఏర్పాటు. ఏంవుంది అంతకంటే. ఆఏర్పాటు

మీకు వినోదం కలగచేస్తోంది. ప్రేమవల్లికి విహారం కలుగచేస్తోంది. నాకు కావలసినన్ని క్రొత్తజార్జెట్లు సమకూరుస్తోంది.

రంగ : జార్జెట్లు?

పంక : అవును బావా! నా పరితప్తహృదయానికి, బట్టలబీరువా నింపుకోటంతో, వూరడింపు కలుగ జేస్తున్నా.

రంగ : అంటే నీ జార్జెట్లుకోసం మన జీవిత ఆనందాన్ని త్యజించటానికి సిద్ధంగా వున్నావన్నమాట. కోడె త్రాచుకి ఇంతకాలంగా గంగిగోవుపాలు పోస్తున్న ట్టుంది నాపని. పూర్తిగా పశువులా నేను ప్రవర్తించి వుండవచ్చు. అయిందేదో అయింది. ఆగోడ వెందుకు? నాకూ యేదిమంచో యేది సెబ్బరో తెలుసు. నాకూ నైతికదృష్టివుంది.

పంక : అది బహుశా బావగారి హాస్యదృష్టిని తోసిరాజు చేసినట్లుంది.

రంగ : నీకు తెలియదు. ఇన్నివారాలుగా దోషపూరితమైన నా హృదయాన్ని, నేనే చిత్రవధతో దహించు కుంటున్నా. అను నిత్యం నిన్ను నే నెంతో నీచంగా చూస్తున్నానని నా అంతరాత్మ ఘోషిస్తూనేవుంది. క్షణకాలంకూడా నాకు ఆనందంలేదు. నేను నివ శిస్తూన్నదే ముళ్ళకంచెమీద.

పంక : అయినా మీఆరోగ్యం ఏం చెడినట్టు కనిపించదే?

రంగ : బ్రతుకే చెడిందని బాధపడుతూవుంటే! ఇక్కడ ఇంత కాలంగా నువ్వు మొగము చాటుచేసుకు ముసిముసి

నవ్వులు నవ్వుతున్నావు. మరింక అట్లా జరగటానికి వీలులేదు.

పంక : పోనిద్దురూ! ఎలాగై తేనేం?

రంగ : మనం పరస్పరం అపార్థం చేసుకున్నాం. ఇలాటి పరి పరిస్థితి ఎంతమాత్రం పట్టించుకోకుండా తప్పుకుతిరిగే మనస్తత్వంకాదు నాది. పంకజం! నిన్ను పూర్తిగా అపార్థం చేసుకున్నా. నన్ను ప్రేమిస్తున్నా వను కున్నా.

పంక : మీ ప్రేమకోరకు ప్రాణం పెడతా.

రంగ : ప్రేమప్రదర్శనం చాలా చక్కగావుంది.

పంక : ఉందనే నేనూ అనుకుంటున్నా.

రంగ : ఇంతకాలంగా నా మంచితనాన్ని కొల్లకొట్టేవు.

పంక : సరే మీరిప్పుడు చేసేది?

రంగ : చెయ్యగలిగేది ఒక్కటే-అదిచేస్తా-విడాకులు...నీకు!

పంక : (హాల్లో కంఠస్వరాలు వింటూ) అమ్మా, బాబాయ్ వచ్చినట్టుంది-వస్తామని చెప్పేరు.

రంగ : నువ్వెంత కుచ్చితురాలవో, నీలో ఎంతక్రూరత్వం వుందో వాళ్ళెన్నటికీ తెలుసుకోలేరనుకుంటా. అదే తెలిస్తే యీ వృద్ధాప్యంలో విచారంతో వాళ్ళతలలు కాళ్ళలోకి క్రుంగివుండవే.

పంక : కాని, బావా? వాళ్ళకి యీవిషయం అంతా తెలిసిందే.

రంగ : ఏమిటీ! అయితే తెలియనివాళ్ళంటూ ఏ ఒక్కరేనా వున్నారా?

పంక : రాయిడు మామయ్యకిమాత్రం తెలియనియ్యటం లేదు. మామయ్య అసలే ప్రపంచానికి చెందిన మనిషాయె! పైగా ఆయనగారికి వున్నసమస్యని ఆయలా శాయిలాగా తీసుకు పరిష్కారమార్గం అన్వేషించే వివేకం శూన్యం.

[పనిపిల్ల ప్రియంవద ప్రవేశించి ప్రొ॥ పరంధామయ్య, జానకమ్మ వచ్చేరనిచెప్పి నిష్క్రమిస్తుంది]

ప్రియంవద : పెదబాబుగారూ అమ్మగారూ ఒచ్చేరమ్మా.

[ప్రొ॥ పరంధామయ్య, జానకమ్మ ప్రవేశం]

పంక : (లేచి ఎదురుగాపోయి తల్లి చెయ్యి పట్టుకుని) ఏం అమ్మా! బాబాయ్! నేను విడాకులియ్యాను గనుక ఆయనగారే నానుంచి వేరవుతారట.

ప్రొ॥ పరం: అది వట్టి కుతర్కం.

జానకమ్మ: ఏం? ఏం జరిగిందేమిటి?

పంక : ఏం జరగలేదు. నాకేం తెలియటంలేదు బావగారెందుకంత బిరుసుగా వున్నారో.

రంగ : (హేయభావంతో మిళితమైన కోపంతో) ఏంలేదు!

పంక : ఆవిషయంగురించి నేనేం అనదలచుకోలేదు. కాని మనందరికి వారి ప్రణయవిహారం విషయం వాసన

కొట్టిందని ఆయనగారు ఈరోజే, ఇప్పుడే తెలుసుకున్నారు.

ప్రొ॥ పరం: అమ్మాయ్! నీలో చాకచక్యం నిండాశూన్యం! పురుషుడు ఎప్పుడూ ఇట్లాంటి విషయాలు ఇల్లాలి చెవికి సోకనీయకుండానే ప్రయత్నిస్తాడు.

రంగ: మరి ఈవిషయంలో పంకజం దృక్పథం ఏమిటోమీకు తెలుసా?

ప్రొ॥ పరం: అమ్మాయేం ఆర్భాటం చెయ్యటంలేదా?

రంగ: అదీసంగతి! హృదయంగల ఏస్త్రీ యైనా ఆర్భాటం చేసి తీరుతుంది. మానసికంగా పంకజంతో ఏదో ప్రగాఢమైన అవగ్రతే లేకుంటే తలవిరియబోసుకొని దొర్లి మరీ ఏడ్చేది.

ప్రొ॥ పరం: (మృదువుగా) అబ్బాయ్! నీ తప్పితాన్ని నువ్వే కొండంతగా చేసుకుంటున్నావేమో!

రంగ: కాదు. నేనింక క్షమించబడే అర్హతకూడా కోల్పోయేను.

ప్రొ॥ పరం: అదో అల్పాతి అల్పమైన విషయం. దాన్ని గురించే పంకజం అతిగా పట్టించుకు బాధపడిందంటే అది చాలా విచారకరమైన సంగతే-అంటే అమ్మాయిలో విషయపరిజ్ఞతా, వివేకం అడుగంటేయన్న మాట.

రంగ: అంటే మీరు పంకజంతో ఏకీభవిస్తున్నారన్నమాట.

ప్రొ॥ పరం: అబ్బాయ్! మనమున్నది ఇరవయవ శతాబ్దంలో.

రంగ: (జానకమ్మతో) ఏమండీ! ఎప్పుడో లభించే పరం కోసం భక్తీ, హరికథలూ అంటారుకదా, ఇప్పుడు ఇహంలో మీకన్నకుమార్తె విషయాలలోకూడా కాస్తేనా మీరు ఆసక్తి చూపనక్కరలేదూ ?

[రంగధామం కంటపడకుండా, పంకజాక్షి, తల్లికి పరిస్థితి బిగువు సడలిపోకుండా వుంచేందుకు, ప్రేరే పిస్తూ ముఖంతో సైగచేసింది]

జానకమ్మ: నాయనా చూడూ! పురాణాల్లో అనేక రాక్షస జాతులతో, కూటాలతో చిరకాలం పరిచయం కలగ టంవల్ల అసలు పురుషుడు స్వభావసిద్ధంగానే వెలిచవికి అలవడ్డ ఒకానొక మృగం అనే నిర్ణయానికి నేను ఏనాడో వచ్చేను.

రంగ: నాతల తిరుగుతోంది.

జానకమ్మ: నిజం చెపుతున్నా. ఆవిడగారికి వివాహంకూడా అయిందని తెలుసుకుని తృప్తిపడ్డాను. ఎందుచేత నంటే ఆవిడ వివాహిత కావడంవల్లే ఈసంగతంతటికి ఒకవిధమైన హుందా కలిగింది.

రంగ: ఇక్కడ నే నొక్కడినే నీతిగల మనిషిగా కనిపిస్తోంది.

పంక: బావా! నే నెప్పుడూ మేడమెక్కి యెదుటింటి అబ్బాయి ముఖాన్నైనా చూడలేదుసుమండీ ?

రంగ: చూసినా బాగుండిపోయేది. నిన్నివిధంగా వేధించే వాడినేకాదు.

పంక : చూద్దాం అనుకున్నా కాని తారుపీపాలాంటి ఆ అబ్బాయికాయంచూస్తే కడుపులోవికారంగావుండేది.

జానకమ్మ: పురాణాలలో రాకాసులూ, కిరాతకులూ, అలాగే వుండేవారు.

రంగ : నాకు తెలుసు. దీనికంతటికీ నన్ను నేనే నిందించు కుంటున్నా. నేనూ కిరాతకుడనే. అతి క్రూరంగా ప్రవర్తించేను.

పంక : ఛాఛా! అదేమిటండీ?

రంగ : కాదనకు పంకజం! నన్నుచూసి నేనే సిగ్గుపడుతు న్నాను.

ప్రొ॥ పరం: రా! రా! అలారా! దారికి.

రంగ : ఇంకోసారి చెప్తున్నా. ఇంక నాకు క్షమించబడే అర్హతలేదు.

జానకమ్మ: పోనిద్దురూ పాపం! పూర్తిగా బేజారైపోయి నట్టున్నాడు.

రంగ : ఔను. కాళ్ళందనంతగా బేజారయేను. కాని నాకు నైతికదృష్టివుంది. మీరంతాకలిసి పవిత్రసామాజిక వ్యవస్థ పునాదులే కూకటివ్రేళ్ళతో పెల్లగిస్తూంటే నాకు కలిగేక్రోధం కట్టు తప్పుతోంది. నా నడత యెట్లావున్నా మీ అందరిని కలియగట్టినా లేనంతగా, నాకు గార్హస్థ్య జీవితమంటే గౌరవంవుంది. కుటుంబ సాంప్రదాయం అంటే పవిత్రభావంవుంది. (అంటూ రంగధామం ఒక వూపున గుమ్మందాకా పోతాడు.

ఆగి వెనుతిరిగి, బిగించిన పిడికిలి, వాళ్ళవైపు విసురుగా వూపుతూ) నైతికదృష్టీ అదీ నాకుంది. (తలుపు దబాలున మూసి బయటకు పోతాడు)

పంక : (పకపక నవ్వుతూ) పిచ్చిబావా!

పరం : అమ్మాయ్! కొంప మునిగిపోయినట్టు అదంతా ఎందుకు వెళ్ళకక్కేవు?

పంక : అబ్బే! ఏంలేదు బాబాయ్! ప్రేమవల్లి ప్రియుడిని కలియటానికి ఒయ్యారం ఒలకపోస్తూ ఇవాళ ఇక్కడకి వచ్చింది. ఈయనగారికి ఆవిడమీద చెప్పలేనంత వెగటు పుట్టిందనే విషయం నాకంటపడింది... అమ్మా! నువ్వు నిజంగా పౌరాణికచిత్రాలలో ఆరితేరిన కథానాయికీలా నటించేవనుకో.

జానకమ్మ: రామరామ! మీరు నాచేత పలికించిన ఘోరాతి ఘోరాలైన పాపపుమాట్లకు నాకీజన్మలో పరిహారం వుండదు.

పంక : ఉంటుందమ్మా! మరేం బాధలేదు. రాబోయేది కార్తీకమాసం నాలుగు సోమవారాలతోపాటు ఇంకో రెండు బుధవారాలు కూడా ఉపవాసంచెయ్యి. ఆత్మకీ ఆరోగ్యానికీ మంచిది. ఉభయ తారకంగా వుంటుంది.

జానకమ్మ: పంకజాక్షి!

పంక : (ప్రౌ॥ పరంధామయ్యతో) ముహూర్తము దగ్గరపడిందనుకుంటా.

ప్రా॥ పరం: జాగ్రత్తగా వుండాలి సుమా!

[రంగధామం విసురుగా, కోపంగా గదిలో ప్రవేశిస్తాడు]

రంగ : ఎవరా కుర్రాళ్ళు? ఏదో మూటపెట్టుకు సావిట్లో తచ్చాడుతున్నారు?

పంక : ఏకుర్రాళ్ళు? ఓ, వాళ్ళా (అంటూ ఆవిడ గదిగుమ్మం దాకాపోయి) "అబ్బాయ్! ఇట్లా తెండి" వీళ్లు కరాచీ సిల్కుస్టోర్సునుండి వచ్చేరు.

[కుర్రవాళ్ళు బట్టలమూటతో గదిలో ప్రవేశం]

పంక : మీరు నీలగిరి వేంచేసినప్పుడు నావూరడింపుకి ఓ మూడు నాలుగు మంచి వాయిల్‌చీరలు కొనుక్కోమని మాటయిచ్చేరు కదండి?

జానకమ్మ: రంగధామం! చాలామంచివాడివోయ్! దీన్నిబట్టే తెలుస్తోంది నీలోఅణుమాత్రం స్వార్థచింతలేదని.

[పంకజాక్షి చాటుగా తల్లికేసి మళ్ళి ముఖంతో సైగ చేస్తుంది.]

జానకమ్మ: చూసేరండి! మీరు నన్నెప్పుడేనా నాకు నచ్చిన చీరలు కొనుక్కోనిచ్చిన పాపాన పోయేరూ?

పరం : నిన్ను వెంటపెట్టుకోకుండా నీలగిరి, మజావుడాయించటానికి నే నెప్పుడూ పోనూలేదు.

జానకమ్మ: ఇంతకీ కొందరు ఆడవాళ్ళు పెట్టిపుడతారు–మంచి భర్తలని కట్టుకోటానికి.

[ఈ సమయంలో కుర్రాళ్ళు మూటవిప్పి చీరలు బయటికి తీస్తారు. ఒకచీర చేత్తో పుచ్చుకుని పంకజాక్షి చూస్తూ ఆనందిస్తుంది]

పంక : అమ్మా! చూసేవ్? ఈరంగు ఎంతబాగుందో? (ఇంకోచీరతీసి చూస్తూ) ఇట్లాంటి మజిలిన్ ఎప్పుడేనా చూసేవమ్మా! బావా! మీరు చాలామంచివారండీ! మీరు నీలగిరి వెళుతున్నారంటే నాకెంతో ఆనందంగా వుంది.

రంగ : (కోపంగా) నేను నీలగిరికి వెళ్ళటంలేదు.

పంక : ఏమిటి?

రంగ : ఈ చీరలన్ని తక్షణం తీసుకుపొండి.

పంక : అయితే శ్రీమతి సరళాప్రసాద్?

రంగ : శ్రీమతి సరళాప్రసాద్ స్వర్గానికి పోతుంది.

[అంటూ విసురుగా టెలిఫోను తీస్తాడు]

రంగ : 72 లోకల్. హల్లో! ఎవరది? గురువులూ చూడు శ్రీమతి సరళాప్రసాద్ జబ్బుతిరగపెట్టింది. చచ్చే స్థితిలోవుంది. ఆవిడగారు నీలగిరి వెళ్ళటంలేదు. ప్రేమవల్లికి యీసంగతి వెంటనే తెలియచెయ్యి.

[రెండవరంగం సమాప్తం]



# మూడవ రంగం

తెర : [పంకజాక్షి శయ్యాగారం. గది చాలా ఆకర్షణీయంగా నిగనిగా మెరిసే రోజువుడ్ బల్లలూ, సోఫాలూ, కుర్చీలతో అలంకరించబడి వుంటుంది. రంగురంగుల డాలియా పుష్పాలూ. పంచరంగుల క్రోటను ఆకులతో గాజుపూలకుండ్లు వుంచబడ్డ చిన్నచిన్న గుండ్రని రోజ్‌వుడ్ బల్లలు గది నాలుగుమూలాలా మెరుస్తూ వుంటాయి. గోడకో నిలువుటద్దం అమర్చబడి వుంటుంది. గదిలో చిందరవందరగా పుస్తకాలూ పత్రికలూ పడివుంటాయి. ఊహాపథానికి అందే ప్రతికోణంనుండీ తీయబడ్డ రంగధామం రూపచిత్రాలు అనేకం మెరిసే చట్రాలతో గోడలకు వ్రేలకట్టబడి వుంటాయి. పంకజాక్షి మిరుమిట్లుగొలిపే జరీఅంచు సిల్కుచీరతో గదిమధ్య ఒంటరిగా నిల్చొంటుంది. నిలువుటద్దంలో తనని తాను చూసుకుంటూ చుట్టూ తిరుగుతుంది. తృప్తిగా మందహాసం చేస్తుంది. అలంకరణ అంతా వయ్యారంగా ఒకసారి సవరించుకుంటుంది. అంతలోనే ఆవిడకి నచ్చంది ఏదో కంటబడి కొద్దిగా చిరాకుపడుతుంది. అద్దంలో చిలిపిగా తనను తాను వెక్కిరించుకుంటుంది. తరువాత విలాసంగా ఒకసారి శబ్దమయేలాగున చుంబిస్తుంది.

గాలిలోకి పనిపిల్ల ప్రియంవద, ప్రొ॥ పరంధామయ్యనీ, జానకమ్మనీ తోడ్కుకొస్తుంది.]

ప్రియంవద : అమ్మా! పెదబాబుగారూ అమ్మగారూవచ్చేరు.

పంకజాక్షి : (చేతులు బారచాస్తూ) అమ్మా! ఒచ్చేవ్!

జానకమ్మ : (జాపోస్తూ) అబ్బా! జీవితంలో యిన్నిమెట్లు నేను ఎన్నడూ ఎక్కలేదు.

పంక : ఇక్కడైతే యెవరువచ్చి గొడవచెయ్యరుగదా అని మిమ్మలిని తిన్నగా తీసుకురమ్మని ప్రియంవదకి చెప్పేను. (మజాగా ముఖం ఎగరేస్తూ) ఏంబాబాయ్!

ప్రొ॥ పరం: ఏం అమ్మా!

జానకమ్మ : ఏం చిలిపితనం ఒచ్చిందే!

పంక : అమ్మా! ఇప్పుడింకోసారి నిన్నెట్లాగా ఉక్కిరిబిక్కిరి చెయ్యబోతున్నా. అందుచేత అట్లా కూర్చుని కాస్త వూపిరి బాగా పీల్చుకో.

జానకమ్మ: అమ్మాయ్! ఏమిటంత విడ్డూరం?

పంక : ఆయనగారు నన్ను ఆరాధిస్తున్నారు.

జానకమ్మ: ఒస్సీ! అంతా ఇదేనా?

పంక : ఇదేనా అంటావేంటి అంత తేలికగా!అది మహోత్కృష్ట మైన, ప్రపంచంలోకల్లా ఆశ్చర్యకరమైన విడ్డూరమైన విశేషం. నే నిప్పుడు బ్రహ్మానందంలో పారవశ్యమై భూతలస్వర్గంలో తేలిపోతున్నా.

ప్రొ॥ పరం: అదిసరే! ఆరాధిస్తున్నట్లు చెప్పేడా అతను?

పంక : అబ్బే లేదు. నాకు ఆయనకీ ప్రస్తుతం మాటలు లేవు.

ప్రొ॥ పరం: ఓహో! మూగ సైగలతో మీరిద్దరూ పరస్పరం ప్రేమవ్యక్తం చేసుకుంటున్నా రనుకుంటున్నా.

పంక : నిన్నరాత్రి మీరువెళ్ళినవెంటనే ఆయనా బయటికి పోయి అర్థరాత్రిదాటేక యిల్లుచేరేరు. నాగదిముందు ఆయన అగినచడి విని, శాలువ నిండా కప్పుకుని నిద్ర నటిస్తూ, కోరుండి ఓచెయ్యిమాత్రం ఓరగా పరుపు పైని జారవదిలేను. తరువాత చిన్నగా ఆయనగా రోసారి తలుపు తట్టేరు. జవాబులేక తలుపు తోసుకుని పిల్లిలా నెమ్మదిగా నడుచుకుని లోనికివచ్చి, మంచంముందునిల్చుని కన్నారకుండా నన్నుచూసేరు. ఆచూపులో నన్ను అమాంతం తినెయ్యాలన్నంత కాంక్ష కనిపించింది.

ప్రొ॥ పరం: అమ్మాయ్! నువ్వు కవిత్వం అల్లుతున్నావు. కాకపోతే నీ కదెట్లా తెలిసింది?

పంక : (చేతివ్రేళ్ళు తలవెనుకకు పెడుతూ) తల వెనుకనుంచి ఆయన్ని కనిపెట్టేను. అది సంగతి. ఆ తరువాత ఆయనగా ఒరిగి పెదవులతో నాచెయ్యి తాకేరు. జానకమ్మకు (చెయి చూపుతూ) ఇదుగో ఇక్కడా! ఆయనగారు చుంబించింది. సరిగ్గా గోళ్ళకు కొంచం పైగా!

జానకమ్మ: (భయంగా చేతికేసిచూస్తూ) కొంపతీసి పళ్ళు నాటలేదుగదా ?

పంక : పోనిస్తూ చిలిపితనం. తరువాత తిరిగి ఆయనగారు నెమ్మదిగా గది వదిలివెళ్ళేరు. నిజంగా నెలరోజులు తరువాత నాకు నిన్నరాత్రి తొలిసారి సుఖంగా నిద్ర పట్టింది. ఉదయం కాఫీ ఫలహారం ఇక్కడే తీసు కున్నా. నేను మేడదిగేసరికి ఆయనగారు వూళ్ళోకి వెళ్ళేరు.

జానకమ్మ: ఈరోజు నువ్వింకా అతన్ని చూడటంలేదన్నమాట.

పంక : లేదు. మధ్యాహ్నం ఆయన భోజనానికి రాలేదు.

జానకమ్మ: బాగుందండి! నయం మీ రెప్పుడూ యిలాఇంటి ముఖం చూడకుండా నామీద మీకున్న అనురాగం ప్రకటించలేదు.

పంక : అందుకు కారణం మరేంలేదమ్మా! ఒట్టి మొద్దబ్బాయినిచేసి ఆయనగారి అవివేకం కళ్ళకుకట్టినట్టు చూసేను. అందుచేత ప్రస్తుతం, ఆయనకి కోపం పట్టశక్యం కాకుండావుంది. ఆయనగారికి కినుక కలిగించినప్పుడు నావర్తన ఎట్లావుండాలో, దేవుడుదయ వల్ల అయిదేళ్ళకాపురం తరువాత తెలుసుకున్నా. మరేంలేదు. కాస్త తప్పుకుతిరగటానికి ఆయనికి అవకాశం యిస్తేచాలు. ఆతరువాత తిరిగి యథాప్రకారంగావుంటాం. [బల్లముందు కూర్చున్న ప్రొ॥ పరంధామయ్య తనముందు కొంకకాగితం లాక్కొని కోటు

జేబులోంచి కలంతీసి ఆలోచనా పూర్వకంగా వ్రాయ టానికి ప్రారంభిస్తాడు]

జానకమ్మ: కాని అమ్మాయ్! కాలం వృథాచెయ్యకు. అదే దో వెంటనే కానీ.

పంక : అదేంకాదు. నేనూ అంతకన్నా తెలివిమీరేను. ప్రేమవల్లి పూర్తిగా నాదారిలోంచి తొలగిపోతేగాని నేనేం చెయ్యదలచుకోటంలేదు.

జానకమ్మ: ఆవిడసంగతెట్లాఉన్నదీ ఏమేనా తెలిసిందా?

పంక : లేదు. కాని ఏక్షణంలో నే నా ఆవిడగారుయిక్కడ వాలవచ్చు.

జానకమ్మ: (ఊపిరి బిగపట్టి) ఇక్కడా?

పంక : నాకు గుర్తుదొరకకుండా వుండటానికని కంఠస్వరం గొళంగామార్చి పురుష కంఠస్వరం అనుకరిస్తూ "డాక్టరుగా రింటిదగ్గరున్నారా?" అని నిన్నరాత్రి ఫోనులో అడిగింది. నేనూ గొంతుకమార్చి పురుష స్వరంతో "లేరు" అన్నా. "అయితే ఆయనరాగానే శ్రీమతి సరళాప్రసాద్‌కి ఒకసారి ఫోనుచెయ్యమని చెపుతారా?" అంది. "ఓహో! ఆయనగారు సాయంత్రింనుండీ శ్రీమతి సరళాప్రసాద్ సమక్షం లోనే వున్నట్టుంది. "అంటూ ఫోనుదించేసేను. ఈఉదయం ఎన్నిసార్లు పిలిచిందో! నేను ఫోనుప్లగ్గు తప్పించి వేసేను. ఈపాటి ఆవిడగారుకోపంతో చిందులు త్రొక్కుతూవుంటుంది.

(పంకజాక్షి ప్రా॥ పరంధామయ్యకేసి ఒక్కసారి అవలోకించి ఆయన వ్రాస్తున్నదేమిటో చూడటానికి దగ్గరగా వెళుతుంది)

పంక : (విసురుగా చేత్తో బల్లమీద చరుస్తూ) రెండూ, రెండూ అయిదుకాదు బాబాయ్!

ప్రా॥ పరం: అబ్బే! అవుతుందని నేనూ అనటంలేదమ్మాయ్!

పంక : అట్లాఅయితే మరెందుకట్లా కూడుతున్నారు?

ప్రా॥ పరం: రెండూ రెండూ అయిదవుతుందని నువ్వనుకుంటున్నట్టుగా వుందమ్మాయ్. మరి నీ మేధస్సు గురించి నాకు సదభిప్రాయముందాయె!

పంక : అమ్మా! ఏమిటే యీయన గొడవ?

(ప్రా॥ పరంధామయ్య జవాబు చెప్పడు. కాని త్వరత్వరగా రెండు, రెండు కూడుతూ వుంటాడు. పంకజాక్షి ఒక క్షణంపాటు ఆయన్ని పరకాయించి చూస్తుంది)

పంక : అయితే నేను పూర్తిగా అవివేకిననా మీభావం? బాబాయ్?

ప్రా॥ పరం: ఔనమ్మాయ్!

పంక : ఏం?

ప్రా॥ పరం: నువ్వు తిరిగి ఇంకోసారి రంగధామానికి అవిరామంగా చాక్లెట్సు ముప్పొద్దులా ఆహారంగా సిద్ధం చేస్తున్నావు.

(పంకజాక్షి లేచి తండ్రిదగ్గరకుపోయి ఆయనకు యెదురుగాకూర్చుంటుంది. ఆయన చేతినుండి కలం తీసుకుంటుంది)

పంక : అదలావుంచి మీరు దేన్నిగురించి మాట్లాడు తున్నారో చెప్పండి బాబాయ్ !

ప్రొ॥ పరం: (చేతులు రెండూ కలియతీసుకుని కుర్చీవెనుకకు వ్రాలి) మీ ఆయన ప్రేమ తిరిగి పొందగలిగేవు. కాని అది ఎట్లా స్థిరంగా నిలపెట్టుకోపోతున్నావు ?

పంక : (తలతటాయించి మందహాసం చేస్తూ) నాఅనురాగం అమితంగా ప్రదర్శించి, ఆయనగారిని విసిగించను. ఆయనగారు నన్ను ప్రేమిస్తున్నదీ లేనిదీ ఎప్పుడూ ప్రశ్నించను. ఆయన బయటకు వెళ్ళేటప్పుడు తిరిగి యెన్నింటికి యిల్లుచేరేదీ ఇంకెన్నడూ తెలుసుకోను.

ప్రొ॥ పరం: (నిశ్చలంగా) అదిసరే. భర్తచేత విసర్జించబడ్డ ఇంకో వన్నెలాడి తిరిగిఆయనగారికి తటస్థించి ఢీకొడితే నువ్వు చేసేది ఏమిటాఅని ?

పంక : (ఆతలంపు కలిగినంతమాత్రాన తీవ్రమైన కోపోద్రేక తతో) ఆయనగారు ఒక్కసారి వంగి దెబ్బకు దొరక కుండా ఆకులటని ప్రక్కకు విసిరికొడతారని నమ్ముతా.

ప్రొ॥ పరం: (అనంగీకార సూచకంగా బుజములు కుద్దిస్తూ) భక్తి తత్పరురాలైన మీఅమ్మ తన తిరుగులేని పురాణపాడిత్యంతో, మగజాతి మనస్తత్వం కాచి

పడపోసి, పురుషుడు స్వభావసిద్ధంగానే వెలిచవికి అల
వడ్డ ఒకానొక మృగం అని నీకు నిర్వచనంచేసింది.

జానకమ్మ: రామ! రామ! ఆపాపానికి నాకీజన్మలో పరిహారం లేదు.

పంక : ఏమిటి బాబాయ్! మీభావం? ఆయనగారు అర డజను స్త్రీలతో సయ్యాటలాడుతున్నారని నేను సర్వ త్రా శంకించాలనా!

ప్రొ॥ పరం: దాని నివృత్తికి నాకు ఒకే ఒకమార్గం కనిపిస్తోంది.

పంక : ఏమిటది?

ప్రొ॥ పరం: నీలో భిన్నత్వం రూపందాల్చాలి. అంటే ఆ అరడజను స్త్రీలగాను నువ్వే నటించాలి.

పంక : అది వింటేనే బాబాయ్! బరింప శక్యంకాని అలసట కలుగుతోంది.

ప్రొ॥ పరం: చేతికందనిదానిని వేటాడటం పురుషుడికి, సహజ ప్రవృత్తి అనేసంగతి గుర్తుంచుకో. కాని నీకునువ్వే సర్వదా మీ ఆయన ఒడిలో వాలిపోతే ఇంక ఆయన గారు నిన్ను వెంటాడేదెట్లా? ఆఖరుకు ఒకేగూట్లో పెరిగే గువ్వపెట్టసహితం పలుతిప్పలు పెట్టి పరుగెత్తిస్తే గాని పుంజుని దరికి చేరనివ్వదు.

(పంకజాక్షి తండ్రిగుండా తల్లికేసి చూస్తుంది. చిన్నగా నిట్టూర్పు విడుస్తుంది)

పంక : ఆయనను ప్రేమించటం, గౌరవించటం, ఆయనమాట శిరసా వహించటం నాకు తెలికే – ఎంతో ఆనంద

దాయకం కూడా, కాని నా మనోభావాలకి నేనే పగ్గం వెయ్యాలనే విషయం ఎప్పుడూ నాకు తట్టనే లేదు.

ప్రొ॥ పరం: సృష్టిలో ప్రతిజీవి సౌఖ్యంకొరకు ప్రయాసపడు తుంది. కాని రిక్తదశలోవున్న చుట్టంలా, అసౌఖ్యం మనని సదాచుట్టుముట్టి పూదిసలాడితే?

పంక: (తలఫంకిస్తూ) ఉదయం ఉపహారానికీ, మధ్యాహ్నం భోజనానికీ, రాత్రి సాపాటుకీ చాకలైక్లే.

ప్రొ॥ పరం: ఠాగూరు కవిత్వం, నారాయణదాసు గానం, వెంకటస్వామినాయుడు వాయిద్యం వరసగా వారం రోజులువింటే ఎనిమిదోరోజు నువ్వే ఆదారి తప్పించు కొని మరీ యిల్లుచేరుతావు.

పంక: (అంతటితో వారించేటట్టు చెయ్యిజాచి) బాబాయ్! మీ ఉత్ప్రేక్షలతో నన్ను వేధించకండి.

ప్రొ॥ పరం: (చిరునవ్వుతో) అమ్మాయ్! నీప్రేమ కారు చవక చేసివేసేవు. నీ ప్రేమభిక్షుకి, నీభర్తను ఆరాట పెట్టాలిసింది. అందుకు మారుగా నీప్రేమ అంగట్లో లభించే ఔషధమాత్రంగా చేసివేసేవు. నీ సౌందర్య సంపదక్వచిత్, క్వచిత్‌గా విదిలించాలి. ఏరోజు కారోజు ఎంతో ప్రయాసతో దాడిచెయ్యాలిసిన ప్రేమదుర్గంగా, నువ్వు కనిపించాలి నీభర్తకు. అంతే కాదు నీహృదయం పరిపూర్ణంగా ఆయనమీదేలగ్న మైందనేసంగతి ఎన్నడూ ఆయనగారికి సూచాయగా

నైనా తెలియనియ్యరాదు. నీ హృదయం అట్టడుగున ఒక అమూల్యరత్నం తనకు అందనిపండుగా దాగివున్నట్టు నీభర్త సర్వదా భ్రమించాలి.

పంక : ఏమిటి బాబాయ్! నేను సర్వేసర్వత్రా నా మెలపులో వుండాలనా మీభావం?

ప్రొ॥ పరం: విజ్ఞతగల ఏస్త్రీ తాను, తనభర్తకు పూర్తిగా-పరిపూర్తిగా వశ్యురాలు అనే విశ్వాసం కలుగనియ్యదు. భర్తకు అట్లాంటినమ్మకే కలుగుతే (బుజాలు విసురుగా కుద్దిస్తూ) మన్మధుడు మరుక్షణం మట్టగో చీధరించి పసులకాపరిగా మారి పూరుకుంటాడు.

పంక : (కటువుగా) ఇంత ప్రయాసపూరితంగా ఆయనగారిని దక్కించుకోవలసిన అగత్యం వుందనా మీభావం?

ప్రొ॥ పరం: ఆప్రశ్నకు, నీకు నీవే ప్రత్యుత్తరం ఇయ్యాలిసుంటుంది.

పంక : బహుశా ఆవిషయం నేను ఆయనగారిని ఎంతగా ప్రేమిస్తున్నాను అనే దానిపై ఆధారపడి వుంటుందని మీభావం అనుకుంటా. (కొద్ది విరామం తరువాత చిరుకంపనముతో) పూర్ణమైన హృదయంతోనే నాయనను ప్రేమిస్తున్నా. ఆయన ప్రేమ నేను నిలుపుకోగలిగితే సర్వం నాకు ఆనందమయంగానే వుంటుంది. (ఆమె అరిచేతులో ముఖం ఆనించుకుంటుంది. తనకు తిన్నగా తీక్షణంగా అవలోకిస్తుంది. ఆమె కంఠం

శోకపూరితం అవుతుంది) కాని...అబ్బా...విజ్ఞతా, వివేకం, అనే దృష్టిలేకుండా మా ఉభయులం పరస్పరం ప్రగాఢంగా ప్రేమించుకొన్న, మాప్రణయం తొలిదశలలోకి ఎందుకు పోలేం బాబాయ్? అదే నిజమైనప్రేమ. అదెందుకు నిల్చిందికాదో?

ప్రొ॥ పరం: (మృదువుగా) రంగధామం నువ్వు భార్యాభర్తలు గనుక.

పంక : (పోగొట్టుకొన్న చిత్తస్థైర్యం ఒక్కసారికూడ తీసుకొని) నాకువివాహితులైన స్నేహితురాండ్రెందరోవున్నారు. కాని వారిభర్తలు కంటబడిన ప్రతి వన్నెలాడితోటీ తారాడటంలేదే?

ప్రొ॥ పరం: వెనుక నుయ్యీ, ముందు గొయ్యీ! దానికి వారు చెల్లించే మూల్యం పరస్పర వైమనస్యం. అందులో పదింట తొమ్మిండుగురు దంపతులు గత్యంతరంలేక విముఖత్వంతో గానుగెద్దులలాగ గడిపేజీవితంతో, తృప్తిపొందుతావా? లేక తాత్కాలికంగా కలిగిన అలజడికి తట్టుకు విజ్ఞతతో, వివేకంతో ఒడుపుగా నీభర్త అనురాగం ఆజన్మాంతం చూరగొంటావా?

పంక : (కొంటెగా కళ్ళు చిట్లిస్తూ) అయితే అమ్మా, మీరూపరస్పరం వైమనస్యంతోగాని విముఖత్వంతోగాని కృంగి కృసిల్లుతూన్నట్టు కనిపించదే?

ప్రొ॥ పరం: భక్తితత్పరురాలైన మీఅమ్మ గడచిన రెండు దశాబ్దాలనుండి నాయెడల ఒకే ఒకలాంటి అవిశ్వాసత చూపుతూనేవుంది.

జానకమ్మ : (తత్తరపాటుతో) అదేమిటండీ?

ప్రొ॥ పరం: కావాలంటే అడుగు. ఆవిడగారు మహిళా సమాజంతో మజా వుడాయించింది. ప్రేమసమాజంతో సయ్యాటలాడింది. భారత భాగవతాలతో తారాడింది. ఆయుర్వేదంతో కన్నుగిలికింది. నోములూ, వ్రతాలతో పెట్టుకొన్న అక్రమసంబంధాలతో కృశించింది. అన్నీ అరికట్టిన ఆవిడగారిని ఆరాధించక నేను చెయ్యగలిగే దేమిటమ్మా!

జానకమ్మ: (విలాసపూరితంగా) ఘోరం! ఆయనగారు అహర్నిశలూ ఆల్జీబ్రాసంకేతాలతో రాణివాసం చేస్తూ నన్నెంతలా ఆడిపోసుకుంటున్నారో?

పంక : (హాస్యపూరితమైన ఆందోళనతో చేతులు పైకెత్తి) అమ్మో! మాఅమ్మ బాబాయ్ ఇంత అవినీతిపరులనే విషయం తలచుకుంటేనే నాతల తిరుగుతోంది.

ప్రొ॥ పరం: (భార్యచెయ్యి ప్రేమపూరితంగా తట్టుతూ) మనం చాలా అదృష్టవంతులం. రెండు దశాబ్దాలు నిండేయి మన వివాహంజరిగి...

పంక : (మాటకి అడ్డొస్తూ) దరిదాపు మూడు దశాబ్దాలు అనండి బాబాయ్! నాకు పాతికేళ్ళలోపంటే నమ్మలేకుండా వున్నారు

ప్రొ॥ పరం: (భార్యతో) అయినా మనం ఆనందంలోనే నెట్టుకొస్తున్నాం-కదూ ?

జానకమ్మ: (అభిమాన పూరితంగా) నిజానికి నాయెడల మీరు మొదటినుండి మంచిగానే వుంటున్నారండి.

ప్రొ॥ పరం: మానజీవితనౌకకు నేను సరంగునైతే నువ్వు చుక్కానివి. చెయ్యీ, చెయ్యీకలిపి యీదే సాగరం... సంసారం...

పంక : అయ్యో! అయ్యో! అయ్యో! నాకళ్ళముందే నాతల్లీ తండ్రీ సినిమా ప్రేమికులలా ప్రేమగీతం మొదలెడితే అహహ! కనీ వినీ ఎరగం!

ప్రొ॥ పరం: (నవ్వుతూ) పాపముశమించుగాక!

పంక : (బయట సవ్వడివింటూ) వినండిబాబాయ్! ఆయనగారు వచ్చినట్టుంది. త్వరగా, స్థిరంగా, సర్వదా ఆయనగారు నన్ను ప్రేమించటానికి నేనేం చెయ్యాలి?

ప్రొ॥ పరం: ఒకమాటలో చెప్తున్నా. ఆయన్ని ఒంటిపిల్లి రాక్షసిలా విడిచిపెట్టు.

పంక : (పశ్చాత్తాపంతో) హేయమైన గతాన్ని మరచి ఆయనగారి ఒడిలో సోలిపోటానికి నేను పొందుతున్న ఆరాటమే మీకు తెలుసుంటే?

ప్రొ॥ పరం: అదేంచెయ్యకు. నువ్వు లేడీస్‌క్లబ్ స్నేహితులతో కారుమీద మాచ్‌కండ్ వినోదయాత్రకుపోతూన్నట్టు ఆయనగారికి తెలియచెయ్యి.

పంక : (ముఖం ముకుళించుకుంటూ) ఆయనగారు "సరే" అంటే ?

ప్రొ॥ పరం: అమ్మాయ్! మన్మథుని కృపవల్ల కెంపునీలాల్లాంటి నీ నయనాలకి సమ్మోహితశక్తివుంది. నీ నాల్కకీ మంచి పదునుంది. ఆ రెండూ రంగరించు.

జానకమ్మ: రామరామా! మీరు మరేం పట్టించుకోకుండా అంకెలు కూడుకుంటూ వుంటేనే బాగుండునండీ! నీతిలేని ఆ దిక్కుమాలిన గణితశాస్త్రం మీవల్ల యిప్పటికే అనవలసినంతగానూ అవినీతిపాలయింది.

పంక : నిజానికి బాబాయ్ ! ప్రాయంలోవున్న పిన్నలకి వారి చూపటానికి మీకు మంచి కొంటెత్తులూ, ముందు చూపూ వున్నాయ్!

ప్రొ॥ పరం: (హావభావాల్లో ఆడంబరం వుట్టిపతుతూ) కలి మహిమ! హృదాంతరాళం పెకిలించి జ్ఞానజ్యోతి వెలికితీసి, కారుచీకట్లు క్రమ్ముకొన్న నీ జీవితపథానికి పున్నమవెన్నెల ప్రసరించినందుకు ప్రతిఫలం – కృతఘ్నత.

[రంగధామం లోపలికి వస్తాడు. అత్తమామలను చూచి తటపటాయించి ఆగిపోతాడు]

రంగ : మీరేదో మాట్లాడుకుంటూన్నటుంది ?

ప్రొ॥ పరం: బాధలేదు రావోయ్! (అంటూ భార్యకేసితిరిగి) ఇంక లేస్తావా ?

జానకమ్మ: (నిల్చుంటూ) పదండి.

ప్రొ॥ పరం: అబ్బే అదేంలేదు. అమ్మాయి వూరికివెళు తుందంటే ఒకసారి చూచిపోదామని వచ్చేం.

(అదివిని ఏం అంతుపట్టక రంగధామం ఆశ్చర్యంగా పంకజాక్షి కేసి ఒక్క సారి చూస్తాడు)

రంగ : నువ్వా... (అని వూరుకుంటాడు.)

ప్రొ॥ పరం: అమ్మాయ్! మంచి సరదాగా నీకు కాలక్షేపం అవుతుందనుకుంటా?

పంక : ఔను బాబాయ్! కారు జర్రిపోతులా కొండలమీద జారిపోతూవుంటే చూడటానికి బలే తమాషాగా వుంటుందిట!

ప్రొ॥ పరం: ఒచ్చేక ఆముచ్చట్లన్నీ చెపుదువుగానిలే (భార్య తో) మరి పదా...

పంక : తిరిగి వచ్చేక కబురు పెడతా... (అంటూ బల్లదగ్గరకు పోయి బెల్ నొక్కుతుంది)

ప్రొ॥ పరం: మేం పోగలంలే, పనిపిల్లకోసం ఏం అవస్తపడకు.

పంక : అందుకుకాదు బాబాయ్! వేరే పనుంది.

ప్రొ॥ పరం: ఓహో! (రంగధామం కేసి తలవూపుతూ) వెళతా నోయ్!

[ప్రొ॥ పరంధామయ్య, జానకమ్మ బయటికిపోతారు.] పంకజాక్షి చిన్న చిరునగవుతో సోఫాలో పడుకొని ఒకపత్రిక తిరగవేస్తూ వుంటుంది. రంగధామం గురించి యేం పట్టించుకోదు. అతను ఆమెను వోరగా

చూసి నిల్చునే నిలువుటద్దంలో 'టై' సవరించు కుంటాడు, ప్రియంవద ప్రవేశిస్తుంది]

పంక : (పత్రికపైనుండి చూస్తూ) చూడూ! ప్రియంవదా! క్రిందబీరువా ప్రక్క ట్రంకుమీది తోలుపెట్టెతీసి నా బట్టలూ అవీ సర్ది... బీరువా అడుగుఅరలో శాలువా కూడాతీసి దాంట్లోవుంచు...

ప్రియంవద: అలాగే అమ్మా!

పంక : అరగంటలోపున ఒక టేక్సీ పిలుచుకురా.

ప్రియంవద: అలాగే అమ్మా! (బయటకు పోతుంది)

రంగ : వూరికి వెళుతునావా ?

పంక : ఓ! ఔను. మీతో చెప్పనేలేదా ?

రంగ : (బిగుసుగా) లేదు.

పంక : అయ్యో మందమతా! చూసేరా! మీరు, ప్రేమ వల్లి నాలుగురోజులు నీలగిరి తిరిగివస్తారనుకుని, లేడీస్ క్లబ్ స్నేహితులతో మూచ్‌కండ్ ఎక్సర్షను పెట్టు కునాను.

రంగ : కాని నీకు కలతకలిగించటానికి మనస్కరించక నా ప్రయాణం మానుకున్నానుగా ?

పంక : (చిరునగవుతో) బావా? అందువల్ల అణుమాత్రం నాకు కలత కలిగేదిలేదుగా ?

రంగ : నేనే వెళ్ళివుంటే విధిగా నువ్వు కలతచెందేదానివే.

పంక : ఏమయినా నాప్రయాణం విరమించుకోటానికి వీలుండ దనుకుంటూ, ఏదో మూడురోజులు ముచ్చటగామూచ్

ఖండ్ ప్రాజెక్టూ, పరిసరాలు చూసివద్దామని వాళ్ళం దరిని పురించింది నేనే నామె.

[రంగధామం పంకజాక్షి సమీపానికిపోయి ఆమె ప్రక్కన సోఫాలో కూర్చుంటాడు]

రంగ : ఇటుచూడు! పంకజం! గతం మరిచిపోయి మనం మున పట్లాగ ముచ్చటగా గడిపేద్దాం.

పంక : (మంచి ఆనందంతో) ఇంతకీ మనమేం పోట్లాడుకో లేదుగా? ఏం పోట్లాడేమా?

రంగ : (చిరునవ్వుతో) నిన్నిప్పుడు హత్తుకోవాలో, ఒడిలోకి లాక్కోవాలో నాకే తెలియకుండావుంది.

పంక : బాగుబాగు! నేనే మీరైతే ఆ రెండూ చెయ్యాను.

రంగ : (ఆమె రెండుచేతులూ పట్టుకొని) పంకజం! నీతో కొంత తీక్షణంగా మాట్లాడాలిసుంది.

పంక : (చేతులు వదిలించుకుని గోడగడియారము కేసిచూస్తూ) మీ కసలు తీరికవుందా అని?

రంగ : అంటే నీభావం?

పంక : సాధారణంగా మీరు శ్రీమతి సరళాప్రసాద్‌ని చూడ టానికి వెళ్ళేది ఈవేళప్పుడేగా?

[రంగధామం లేచి నిలుచుని గదిలో అటూ యిటూ పచారుచేస్తూ వుంటాడు]

రంగ : (నిశ్చింతంతో) శ్రీమతి సరళాప్రసాద్ చచ్చింది.

పంక : (ఒక్కసారి సోఫాలోంచి వురికి గంతువేసి) చచ్చింది! దహనక్రియలు ఎప్పుడు?

రంగ : అదే యింకా నిశ్చయం కాలేదు.

పంక : మంచిది. ఇంక మీబిల్లు పంపించవచ్చు.

రంగ : (జంకుగా) పంకజం! శ్రీమతి సరళాప్రసాద్ అనేస్త్రీ అసలు కేలేదు.

పంక : (చిరునవ్వుతో) బావా! ఆవిడవుందని నేనుమాత్రం అనుకుంటేకదూ?

రంగ : ఏమిటీ? (పంకజాక్షి కిలకిలా నవ్వుతుంది) ఆవిడగారిని నేనే సృష్టించినట్లు ఇంతకాలంగాను నీకు తెలుసంటూవా?

పంక : అబ్బే! ఇల్లువదిలి విలాసం చిత్తగించటానికి సాకుగా మీరో చక్కటికథ అల్లేరనుకుంటున్నా.

రంగ : అయితే నే నేదో ధనం రెండుచేతులా ఆర్జిస్తున్నానంటూ కంటపడ్డ నగలూ, చీరలూ, కొన్నది నన్ను గోతులో దించటానికే అన్నమాట.

పంక : (చిరునవ్వుతో) బాగుంది! బాగుంది!

[రంగధామం ఒక్కసారిగా పెద్దగా విరగపడి నవ్వుతాడు]

రంగ : అమాతం మాయిద్దరినీ పట్టులో పట్టేసేవు. నిజానికి నువ్వు దేవాంతకురాల్లా వున్నావ్. అయినా ఆ ప్రేమవల్లిలో నాకు కనిపించిందేమిటో న్నాకే అయోమయంగా వుంది.

పంక : ఓహో! కాని ఆవిడ మంచి అందకత్తే అనుకుంటా.

రంగ : పోనిద్దూ. దిక్కుమాలిన అందం. అది నన్ను ఎంతగా వేధించుకుతిందో నీకే తెలిసుంటే !

పంక : ఆవిడగారిని నిజంగా మీరు ప్రేమిస్తున్నదీ, లేనిదీ పదేపదే మిమ్మల్ని ప్రశ్నించేదనుకుంటా...

రంగ : రోజుకు వందసార్లు

పంక : ఆవిడని వదలివెళ్లేటప్పుడల్లా తిరిగి ఎన్నింటికిరావడం? అని మిమ్మల్ని నిలతీసి అడిగేదా ?

రంగ : నీకెలా తెలుసు ?

పంక : (కణతమీద ఎడమచేతి చూపుడువ్రేలితో కొడుతూ) తెలుసండీ.

రంగ : (అమాంతం ఆవిడని చేతుల్లోకి తీసుకోటానికాఅన్నట్టు పంకజాక్షికి ఎదురుగావెళ్ళి) పంకజం! గతం మరిచి పోయి నన్ను క్షమించవూ ?

పంక : (అతని బారిలోనుండి తప్పుకొని) ఇందులో క్షమించ టాని కేంవుంది బావా ?

రంగ : (ఆవిడ కేసి ఒక అడుగువేసి) నాచేత నీపాదాలుపట్టిం చాలనుంటే... నేను పశువులా ప్రవర్తించేను. దానికి నే నెంతగానో దహించుకు పోతున్నా. ఇంకెన్నడు పెడదారి పట్టను.

పంక : (మెలపుగా అతన్నుంచి తప్పించుకుంటూ) ఇదంతా వట్టి దీపం దండుగ భాగోతం బావా !

రంగ : (ఆ మొహమాట -చొరనియ్యకుండా) ఆ విషయం యింక వదిలిపెట్టీ...

పంక : (అతనికి అందకుండా నిల్చుని) ఇంత కాలమాయి మీరు ఆనందడోలికల్లో నోలలాడుతున్నారనుకుం టున్నా.

రంగ : లేదు. గాయపడ్డ హృదయంతో క్రుంగుతున్నాను.

పంక : అదుగో అక్కడేవుంది. పురుషులకన్నా స్త్రీల ఆధిక్యత. స్త్రీల రక్తం మళ్ళీ జవ్వనం జారిపోయేవరకు హృదయానికి గాయం తగలనే తగలదు.

రంగ : (నిలుచుండిపోయి) అరే! ఎందుకట్లా గానుగెద్దులా గదంతా తిరుగుతున్నావ్ ?

పంక : వానావానా చెల్లప్ప ఆడుకుంటున్నాం అనుకున్నా.

రంగ : అంతకరకుతనం కూడదు పంకజం! పెడదారిపట్టినా, సహనంతో నన్ను పూర్వంలాగే నువ్వు ప్రేమిస్తూనే వున్నావు. నీ అంతరాత్మే అందుకుసాక్షి. నాతప్పి తాన్ని తెలుసుకు పరితప్తహృదయంతో నిన్నూ నే నెంతో వెర్రిగా ప్రేమిస్తున్నాను. అంతకన్నా ప్రస్తుతం నేను చేయగలిగేది ఇంకేంవుంది ?

పంక : ఓహో! అయితే నేనిప్పుడు చేయాలిసింది ఏమిటా అని ?

రంగ : చేయాలిసింది ఒక చిన్నచుంబనం, ఆపైని గతం మరచి ప్రేమగానం.

పంక : (విలాసపూరితంగా) అపశ్రృతి సరిగా సర్దుకోకుండానే ?– అభాసుకాదూ ?

రంగ : అంటే ప్రేమవల్లి ఇంకా నీ దృష్టిపథంలో మెలుగు తున్నాదన్నమాట.

పంక : నిజానికి ఆవిడగారు సాహృదయంలో కలుగచేసిన గాయం ఇంకా పూర్తిగా మానుపట్టనట్టే.

రంగ : దాని శిఖాంతరగా !

పంక : ఆశిక్ష చాలా క్రూరం. ప్రాణాంతకమైన మీఆకర్షణకి ఆహుతయింది. పాపం ఆవిడ చేసింది అంతకు మించి మరేంలేదు.

రంగ : సరితే ! ఇటాంటి విషయాలలో వీలుచూసుకుని వెంట పడేది కేవలం పురుషులే అన్నట్టు ఆతప్పితమంతా నాతలమీదేవుంచు. కాని దానిముఖం మరి యీ జన్మలో చూడదలుచుకోలేను.

పంక : మీరు యెంతసూక్ష్మంగా మారిపోతారండీ ?

రంగ : (ఆతృతగా ఆవిడకేసి పోతూ) పూర్తిగా గుణపాఠం నేర్చుకున్నా. మరి ఆజన్మాంతం నేను మారేది లేదు. మిగిలిన నా జీవితమంతా మంచితనానికి గీటురాయిగా గడిపివేస్తా.

పంక : (ఆమెకు, అతనికి మధ్యగా ఒకకుర్చీ అడ్డు పెడుతూ) ఎలాగేనా పాతప్రణయంనుండి మీరు పూర్తిగా విడివడ్డాకే క్రొత్తదానికి దారితీస్తే మంచిదేమో ?

రంగ : అవుననుకో, కాని దానికి నువ్వే తోడ్పడాలి.

పంక : కొంపతీసి, మీరు ఇంకమీదట ఆవిడగారిని ప్రేమించబోవటంలేదని ప్రేమవల్లికి నన్ను చెప్పమనా మీ భావం ?

రంగ : అట్లాంటి తెగతెంపులయ్యే విషయాలు ఎవరికివారే చెప్పటానికి వికృతంగా కనిపిస్తాయి... కదూ ?

పంక : అవునులెండి. ఆవిడగారు అసలే స్త్రీత్వంగల పద్మినీ జాతి స్త్రీ ఆయె. మురుసుతనం జాస్తీ. (అని నవ్వుతూ ఆమెదవడ అర్థోక్తితో అటుచేత రాస్తుంది)

రంగ : అబ్బా! నీవేళాకోళం ఓమాటు శ్రీకాకుళం పంపించి ఆ శనికి విరుగుడు సూచించమంటే?

పంక : (బుజాలు కొద్దిగా కుదించి) బావా! కలియుగారంభం నుండి, భర్తచేత విసర్జింపబడ్డ వనితామణికి మనస్తాపం పరిపూర్ణంగా చల్లార్చటానికి మార్గం ఒకే ఒకటుంది.

రంగ : (ఒక్కసారి ఎగిరిగంతేసి) సుబ్బారాయుడుమామయ్య!

పంక : (ఆతృతతో) ఏం జరిగింది? సుబ్బారాయుడు మామయ్యకి?

రంగ : నిన్ననే మీ మామయ్య ఆవిడగారికి మంచి అందం, ధైర్యం, దబాయింపు వున్నాయని నాతో చెప్పి నోరు చప్పరించేడు.

పంక : అదేమిటి బావా? నాకున్న ఒక్కగా నొక్క మామయ్యని బలివ్వటానికి నేను అంగీకరించేది లేదండోయ్?

రంగ : మరేంబాధలేదు. ఇప్పుడే ఆయనగారికి ఫోనుచేసి ప్రేమవల్లి నీలగిరి పోవటంలేదని తెలియచేస్తా.

పంక : ఒద్దుబావా! ఒద్దుబావా!

రంగ : (ఫోనుదగ్గరకుపోయి) హలో! లోకల్ 72 (రిసీవర్ చెవుకి వుంచుకునే, మాట్లాడేచోటమాత్రం అరిచెయ్యి అడ్డంవుంచి) మీ మామయ్యకి మరేం ప్రమాదంవుండదు. విషయం సృతిమించకముందే ఆవిడగారు

కూనవరంవారి తాలూకుకాదు కలెక్టరాఫీసు గుమాస్తా తాలూకు అని చెప్పేద్దాం.

పంక : (కిలకిలా నవ్వుతూ) ఛాఛా! ఏంపని పోనిద్దురూ–పాడు పని!

రంగ : పాడుపనే. ఆవిషయం నాకు తెలుసు – గత్యంతరం లేక చేసే పాడుపనికి తరువాత నన్ను నేనే నిందించు కుంటాలే.

పంక : మీకున్న నైతికదృష్టితోసహా–

రంగ : (ఫోన్లో) హలో! సుబ్బారాయుడుగారున్నారా? హలో! మీరేనా? ఆ–లేదు. నేను నీలగిరి వెళ్ళటం లేదు. (పంకజాక్షికేసి కన్ను గిలుకుతూ) శ్రీమతి సరళాప్రసాద్‌కి జబ్బు ఒక్కసారి తిరగబెట్టింది. లేదు ప్రేమవల్లికూడా వెళ్ళటంలేదు.

[పనిపిల్ల ప్రియంవద ప్రవేశం]

ప్రియంవద: ప్రేమవల్లిగారువచ్చి సావిట్లో కూర్చున్నారమ్మా!

రంగ : (ఫోనులో) ఏమిటీ? ఒక్కనిమిషం – అలాగే పట్టుకు నుండండి.

పంక : ఆవిడగారు ఏక్షణాన్నయినా ఇక్కడ వాలుతుందని ఉదయంనుండి అనుకుంటూనే వున్నా. మరేం అనుకోకపోతే ఇలా మేడమీదికి రమ్మను.

ప్రియంవద : ఆలాగే అమ్మా! [నిష్క్రమణ]

రంగ : గంగారమ్మ చింతలని నే చెపుతూవుంటే (ఫోనులో) హలో! మీరిప్పుడోసారి రాకూడదూ? ప్రేమవల్లి

ఇక్కడికి వస్తోంది పంకజాక్షిని చూట్టానికి. పనిలో పని మీావిందు పిలుపుగురించికూడా మాట్లాడవచ్చు. సరే మరయితే త్వరగారండి... (ఫోను దించివేసి)... నే చెప్పేగా? (చిటికవేస్తూ) గొల్లెం తప్పిస్తాలని.

పంక : ఒట్టి పిరికిపంద!

రంగ : (చాలా హుందాగావున్నట్టు నటిస్తూ) పిరికిపందను కానునేను. పంకజం! రెండు నిమిషాల్లో తిరిగివస్తా. దాహంగావుంది. క్రిందికివెళ్ళి కాస్తకాఫీ తీసుకు వస్తా. (పంకజాక్షిని చుంబించడానికి అతడు వంగు తాడు. ఆవిడ అందకుండా జరిగిపోతుంది)

రంగ : అబ్బా! ఎంతసేపాబెట్టు! ఒక్కటంటే ఒక్కటి-ఆ మాత్రాని కెందుకట్లా కొట్టుకుపోతున్నావు?

పంక : (చిరునవ్వుతో) బావా! పాతనాటకానికి ఇంకా పూర్తిగా తెరపడినవరకు ఓపిక పట్టాలిసిందే.

రంగ : తలబిరుసుతనంతో కట్టుకున్నభార్యే కౌగిటచేరనియ్యక పోతే మగవాడు ఎంతగా మధనపడాల్లో?

పంక : దానికేం! ముందు మీారు మంచి అనిపించుకోండి.

రంగ : అయ్యో! ఆవిడగారు వస్తూన్నది. ఇప్పట్లో ఈగదికి రెండుగుమ్మాలుండటం వాస్తవానికి వరప్రసాదంలా వుంది.

[అతడు నిష్క్రమిస్తాడు. పంకజాక్షి సోఫాలోంచి లేచి నిలుచుంటుంది. నిలువుటద్దంలో చూసుకుని

చెదిరిన ముంగురులు ఒయ్యారంగా సవరించుకుం
టుంది. చెయ్యి బారచాచి]

పంక : (ఆప్యాయత వుట్టిపడేటట్టు గాఢంగా కరచాలనం
చేస్తూ) తిన్నగా మేడమీాదికే మిమ్మలిని రప్పించి
నందుకు మరేం అనుకోరని తలుస్తాను.

ప్రేమవల్లి: మరేంబాధలేదు. ఈగదంటే నాకెంతో యిష్టం.
అదీకాక హృదయంవిప్పి మాట్లాడుకోవటానికి ఇదే
అనువైన స్థలం.

పంక : (తేరిపారి ప్రేమవల్లి అలంకరణ తిలకించి) ఎంత
ముచ్చటగా కనిపిస్తున్నారండి ?

ప్రేమవల్లి: నాచీర నచ్చిందా మీాకు ?

పంక : ఈచీరే మీాఅందానికి వన్నెతెస్తోందని చాలాసార్లను
కున్నా.

ప్రేమవల్లి: (తీవ్రంగా) క్రొత్తచీరండీ. ఇపుడే కట్టుకున్నా.

పంక : ఓహో! అయితే యిట్లాంటిచీరే ఇంకెవరో ధరిస్తే
చూసి వుంటాను.

ప్రేమవల్లి: ఏం అమ్మా! తరుచూ యింటికివచ్చి మిమ్మలిని
వేధిస్తున్నానని తలుస్తున్నారనుకొంటా.

పంక : ఛాఛా! మా ఆయనా, నేనూ మిమ్మలినిచూస్తేఎంతగా
ఆనందిస్తామో మీాకే తెలుసాయె.

ప్రేమవల్లి: డాక్టరు రంగధామారావుగారు ఇంట్లోవున్నారా?
నిన్న ఆయనగారు నాకువ్రాసియిచ్చిన ఔషధం
గురించి కొద్దిగా తెలుసుకోవాలి.

పంక : ఇప్పుడుకూడా మీరు ఆయన్ని చూట్టానికే వచ్చేరన కండి, నన్నే చూట్టానికే వచ్చేనని చెప్పండి, నేనెంత గానో ముచ్చటపడుతున్నా.

ప్రేమవల్లి: ఒకటేదెబ్బకి రెండుపిట్టలని కొట్టటం నాకలవాటు లెండి.

పంక : సత్యభామలా మీకు విలువిద్యలోకూడా మంచి ప్రవే శంవున్నట్టుందే ?

ప్రేమవల్లి: సత్యభామను కాదండోయ్! అన్నట్టు ఇందాక ఏమిటి చెప్పేరో మరిచా. డాక్టరు రంగధామారావు గారు ఇంటిదగ్గరే వున్నారనికదూ ?

పంక : ఆయనగారితో అయిదునిమషాలపాటు పరిచయం అయేక "రంగధామం" అని ఆప్యాయంగా పిలవని వారు మీరొక్కరే మిగిలేరనుకుంటా వూరంతటికీ.

ప్రేమవల్లి: అలాపిలుస్తే డాక్టర్‌గా ఆయనమీద నాకుగల గురి చెడిపోతుంది.

పంక : నే నెప్పుడూ ఆయనచేత వైద్యం చేయించుకోను సుమండీ, డాక్టరు అన్నాజీరావుదగ్గరికి వెళుతూ వుంటా.

ప్రేమవల్లి: అదేమిటమ్మా! మీకు డాక్టరెందుకూ ? ఉక్కు తునకలా కనిపిస్తూ వుంటారు.

పంక : ఘోరం! చూసేరా! కొనముక్కునప్రాణము పెట్టుకొని కాలక్షేపం చేస్తున్నా. చస్తే ఆయనగారికి దిక్కూ మొక్కూ లేకుండా పోతుందికదా అని.

ప్రేమవల్లి: ఛాఛా అవేంమాటలు ! డాక్టరు రంగధామారావు గారు కులాసాగా వున్నారా ?

పంక : ఏంకులాసా ? బాగా అలిసిపోయి వున్నారు.

ప్రేమవల్లి: (ఎందుకో తెలియక వింతపడుతూ) ఓ ! ?

[చిన్న విరామం]

ప్రేమవల్లి: ఆయనగారు ఎంతలో యింటికి తిరిగివచ్చేది మీకు బొత్తిగా తెలియదనుకుంటా ?

పంక : ఆయన బయటికి వెళ్ళినట్టేనాకు తెలియదే !

ప్రేమవల్లి: ఓ ! క్షమించండి. ఆయనగారు బయటకువెళ్ళి నట్లు మీరు చెప్పేరనుకున్నా.

పంక : లేదు.

ప్రేమవల్లి: అదే! అదే! నేనే అపార్థం చేసుకుని వుంటా.

పంక : ఆయనగారు పడుకొని దొర్లుతున్నారనుకుంటాను. అర్ధ రాత్రి దాటేదాకా పాపం ఆ అభాగ్యురాలు శ్రీమతి సరళాప్రసాద్ సాన్నిధ్యంలోనే వున్నారాయె !

ప్రేమవల్లి: (కొద్దిగా చెలించి) అట్లానా ?

పంక : కర్మంగాని, పాపం ఆవిడగారు బాగా కోలుకుంటు న్నట్టు కనిపించే సమయానికే ఒక్కసారి తిరగబెట్టింది.

ప్రేమవల్లి: (చకితురాలవుతుంది కాని ఆ విస్మయత వెలికి తెలియనీయకుండా ప్రయత్నిస్తూ) చెప్ప నలవికానంత తగా విచారిస్తున్నా.

పంక : తీరా నీలగిరి ప్రయాణానికి నాలుగూ సిద్ధంచేసు కున్నాక ఇట్లా జరగటం మీకు చాలా ఇబ్బంది కలిగించి వుంటుంది.

ప్రేమవల్లి: ఆ! అంతగా ఏం లేదులెండి. అయినా నాసౌఖ్యం కొరకు నే నెంతమాత్రం ఆలోచించలేదు.

పంక : ఆయనగారు చెపుతూవుంటారు. పాపం మీరు శ్రీమతి సరళాప్రసాద్‌కు చేసే పరిచర్య ప్రశంసించటానికి ఆసర్వరాజుకే అలవికాదట.

ప్రేమవల్లి: ఈజీవితంలో శక్తివంచన లేకుండా యితరులకు సహాయపడాలిసిన ఆవశ్యకత వుందని నే ననుకుంటా. కేవలం నావిధి నిర్వర్తించేను. అంతే.

పంక : అట్లా ఆదుకునేవారు మనలో అతిస్వల్పంగాఉంటారు.

ప్రేమవల్లి: దేశంకోసం విదేశాలలో వల్లమాలిన వ్యాపారాలలో మునిగి తేలుతున్న మా ఆయన్ని తల్చుకుంటే నాశక్తివంచనలేకుండా వీలైనంతగానూ సహాయం యితరులకు చేసితీరాలనే సంకల్పం కలుగుతూ వుంటుందినాకు.

[పంకజాక్షి ఆలోచన పూరితంగా ఒక్కసారితనకి తానే కన్ను చిట్లిస్తుంది]

పంక : అంత్యగడియలలో మీరు అక్కడే వున్నారా?

ప్రేమవల్లి: (ఆశ్చర్యపోతూ) ఏ అంత్యగడియలు?

పంక : కొంపతీసి మీకేం తెలియదనటం లేదుకదా?

ప్రేమవల్లి: పంకజాక్షిగారూ! మీరు దేన్నిగురించి ప్రసంగించేదీ నాకు వూహాతీతంగావుంది.

పంక : కాని మా ఆయన ఈ ఉదయమల్లా శ్రీమతి సరళా ప్రసాద్ దగ్గరేవున్నారు.

ప్రేమవల్లి: ఛా! ఛా! అసందర్భం!

పంక : మీకెందుకు కబురుచేయలేదో వింతగా వుందే?

ప్రేమవల్లి: అయితే... (అత్యధికాశ్చర్యంవల్ల, ఆగ్రహంవల్ల మరి మాట్లాడలేక పోతుంది)

పంక : అయితే మీకు నిజంగా తెలియదన్నమాట.

ప్రేమవల్లి: (నిస్సహాయతతో నిండిన దురుసుతనంతో) నాకేం తెలియదు.

పంక : పాపం! ప్రేమవల్లిగారూ! ఇలాంటి భరించ శక్యం కాని గాయం మీకు కలిగించటానికి నాకునోరాడటంలేదు. శ్రీమతి సరళాప్రసాద్ - చనిపోయింది - పాపం!

ప్రేమవల్లి: చనిపోయింది?!!

పంక : మాఆయన ఆవిడగారికి చేసినదానంతకీ అభినందిస్తూ ఆయనగారి-చేతుల్లోనే ఆవిడ ప్రాణం విడిచింది.

ప్రేమవల్లి: అంతా వట్టిది.

పంక : మీరట్లాఅంటే నాకేం ఆశ్చర్యంలేదు. ఒకటి రెండురోజులక్రితందాకా ఆవిడగారెంతో వుల్లాసంగా

వుంది... మరి... అట్లా కూర్చోండి. పాపం మీరు పూర్తిగా చలించిపోయేరు. ఆవిడంటే మీకు వల్లమాలిన అనురాగం. ఔనుకదూ ?

ప్రేమవల్లి: చనిపోయింది ?...

పంక : ఏంచేస్తాం ? కళ్ళబరువు తీరా ఒకసారి బాగా ఏడ్చేయండి. మీచేతిరుమాలు కనిపించటంలేదా ? ఇది తీసుకోండి (బల్లమీదనుండితీసి రుమాలందిస్తుంది) చాలా విషాదకరం ఏమంటారు ? అయినా ఆవిడకి మీరు చెయ్యగలిగిందల్లా చేసేరు.
(ప్రేమవల్లి చేతిరుమాలుతో కళ్ళు ఒత్తుకుంటుంది)

ప్రేమవల్లి: (స్వాభావికంగా ఉండటానికి – ప్రయాసపడుతూ) అది ఎంతో మరువరాని గాయం !

పంక : ఔనౌను. నాకు తెలుసు. మీకుకలిగిన విపత్తుకి నేనెంతగానో విచారిస్తున్నాను. మాఆయన ఆవిడగారిని, నిజానికి ఆరాధించేరు. అట్లాంటిరోగి ఈజన్మలో తనకింక లభ్యంకాదని వాపోయేరు. (ఆవిడ చేతిరుమాలు తన కళ్ళకు అద్దుకుంటూ) పరలోకంలోవున్న ఆమెగారి భర్తనామం స్మరిస్తూ, పెదిమెలపైని చిరునవ్వు చిందుతూ ప్రాణం విడిచింది. మా ఆయనహృదయం ద్రవించిపోయింది. పాపం యీపూట అన్నంముట్టుకో లేకపోయేరు–అన్నట్టు మాకారు మార్చేసి ఇంకో సరికొత్త స్టుడ్‌బేకర్ కొనుక్కుంటున్నామండోయ్ !

[రంగధామం గదిలో ప్రవేశించి ఆ ఇద్దరుస్త్రీలూ వలవలా కళ్ళ నీళ్ళు కారుస్తూవుండటంచూసి గుమ్మం దగ్గర నిల్చిపోతాడు]

రంగ : అరే! ఏంజరిగింది?

పంక : (చిన్న రోదనస్వరంతో) ఇప్పుడే, పాపం ప్రేమవల్లికి ఆ విషాదవార్త వినిపించేను.

రంగ : ఏ విషాదవార్త?

పంక : శ్రీమతి పరళాప్రసాద్–స్వర్గస్తురాలయిందని పాపం ఈవిడగారికి తెలియదు.

ప్రేమవల్లి : (అయోమయస్థితి, కోపోద్రేకత మరుగుపర్చటానికి ప్రయత్నిస్తూ) యధార్థంగా నాకేం తెలియదు.

పంక : మీరు విధిగా ఆవిడగారికి తెలియచెయ్యాలిసింది సుమండీ–పాపం అవసానదశలో దగ్గరుండటానికి ఈవిడ ఎంతో ఇచ్ఛగించేది.

రంగ : మీరు మనోవ్యధ తట్టుకోలేరని.

ప్రేమవల్లి : మీ దయార్ద్రితకు ఇదొక నిదర్శనం!

పంక : అంతే అయివుంటుందని నాకు తెలుసు. మాఆయనది వట్టి వెన్నలాంటి మనసు (వ్యంగ్యంగా) చూస్తేఅంటుకుంటుంది! తాకుతే కరగిపోతుంది!

ప్రేమవల్లి : (కోపోద్రేకత అణచిపెడుతూ) ఆ–ఆవిషయంనేను ఏనాడో గుర్తించేను.

పంక : (భర్తతో) మీరు ఆవిడయెడల ఎంతో ఆసక్తికలిగివుండేవారుకదూ? – ఏం?

రంగ : ఔనౌను. నిజానికి ఆవిడగారిని నాకో అత్యంత సన్నిహితత్వంగల స్నేహితురాలుగా ఎంచుకునే వాడిని.

పంక : బావా! ఇప్పుడే ప్రేమవల్లికి చెపుతున్నా. పాపం ఆవిడగారు మీచేతుల్లో అసువులు విడిచేరని.

రంగ : పుణ్యాత్మురాలు. పెదిమెలమీద చిరునవ్వు చిందు తూ ప్రాణం విడిచింది.

పంక : సరిగ్గా అదే నేనూ చెప్పేను. నలభై ఏండ్ల క్రితం స్వర్గస్థుడైన ఆమెగారి భర్తనామం స్మరిస్తూ–బావా! ఆయనగారి నామం ఏమిటన్నారు?

రంగ : నరాంతక ప్రసాద్.

పంక : ఆవిషయం అంతా ప్రేమవల్లికి విపులంగా చెప్పండి. పాపం అవిడగారికి ఆ వివరాలన్నీ వినాలని వుంటుంది.

రంగ : ఆవిడగారిని మీకు జ్ఞాపకం చెయ్యమందండి. మీ భర్తగారికి ఆశీస్సులు పలికింది.

పంక : అవసానదశలో సర్వం గుర్తుంచుకున్నట్టుంది. దహన క్రియలకి బావా! మీరు విధిగా వెళ్ళాలండి,

రంగ : విధిగా ఆవిడగారియెడల అట్లాంటి గౌరవం కనపర్చా లని నాకూ కుతూహలంగానే వుంది.

పంక : (ప్రేమవల్లితో) కొంచెం కాఫీ తీసుకు తెప్పరిల్లండి. పాపం పూర్తిగా మనస్సు చెదరకొట్టుకున్నట్టున్నారు– తీసుకుంటారా?

ప్రేమవల్లి: ఆవార్త నన్ను విస్మయంలో ముంచెత్తింది.

పంక : నిజంచెప్పాలంటే నిన్నరాత్రి గడియటం కల్లఅని నాకు తెలుసు. కాని మీరుపొందే పరితాపంకూడా పూర్తిగా అర్థంచేసుకున్నా.

ప్రేమవల్లి: మీరు ప్రదర్శిస్తు సానుభూతికి నేను ఎంతగానో ఋణపడుతున్నా.

పంక : దానికేం! ఉండండి నేనే స్వయంగాపోయి మీకు కాస్త కాఫీతీసుకువస్తా.

రంగ : ఓ! కాఫీ! నువ్వుండు నేనువెళ్ళి పంపిస్తాను.

పంక : అదేమిటిబావా! పాపం ఆవిడదగ్గర కూర్చుని కాస్త సముదాయించండి. మంత్రించినట్టు, ఉల్లాసంగా కబుర్లుచెప్పి ఒరుల కష్టాలు మటుమాయం చేయ టంలో మీకు మీరేసాటి.

రంగ : (బయటకు జారుకోవటానికి ప్రయత్నిస్తూ) అబ్బే! ఇట్లాంటి సమయాల్లో ఏస్త్రీ ఐనా తనపజ్జను ఇంకో స్త్రీ వుండాలనే వాంఛిస్తుంది.

పంక : (అతడిని కదలకుండా ఆప్తుతూ) కాదు. బుజ్జగింపు లకీ, బురుడింపులకీ మీతరువాతే! క్రిందటి కోసారి మన వంటలక్క పనిమానేస్తే మీరెంత మజాగా నన్ను బుజ్జగించేరో ఆజన్మాంతం మరుపురాదే.

[ఆమె బయటకు పోతుంది. ప్రేమవల్లి తోక త్రొక్కిన త్రాచులా ఒక్కసారి కుర్చీలోంచి లేస్తుంది]

ప్రేమవల్లి: ఏమిటీ!!!

రంగ: అమ్మయ్యా! (గుండెమీద రెండుచేతులూ ఆనిస్తూ) ఒక్కసారి గుండె ఝల్లుమంది!

ప్రేమవల్లి: ఏమిటి దీనంతటికీ అర్థం.

రంగ: అర్థానికేముంది. మనందరిలాగ శ్రీమతి సరళా ప్రసాద్‌కూడా మృతిస్వభావంగాగల మర్త్యురాలే. అంత్యక్రియలు రేపుఉదయం జరిపించుటకు పెద్దలచేత నిశ్చయింపబడినది గావున తుదిసారి చూడదలచే చుట్టాలు, పక్కాలూ దయచేయ ప్రార్థితులు.

ప్రేమవల్లి: శ్రీమతి సరళాప్రసాద్ చావటం ఏమిటయ్యా? అసలలాంటి వ్యక్తంటూ లేనేలేదని నాకూ నీకూ కూడా తెలుసాయె.

రంగ: ఒట్టు. అదేపనిగా ఇంతకాలం ఆవిడగురించి విధీ విరామం లేకుండా మాట్లాడేక వాస్తవంగానే వుందేమో? అని నాలో నాకే చిత్తవిభ్రాంతి కలుగుతోంది. ఆవిడగారి రోగలక్షణాలగురించి వైద్య పత్రికకు ఒక చక్కటివ్యాసం వ్రాయగలనంటే నమ్ము.

ప్రేమవల్లి: (కోపోద్రేకతతో) ఓహో!

రంగ: ఇంతకీ వృద్ధాప్యంలో ఆవిడగారికి పాపం రోజులు బాగాలేవు. ఆపరేషన్‌మీద ఆపరేషన్. ఆస్థితిలో బ్రతికేకంటె మరణించటం మేలు. ఆవిడ ఎట్లాగా మరణించాలిసిందే. నన్నడుగుతే సరదాగా, సుఖంగా విముక్తి పొందిందంటాను.

ప్రేమవల్లి: నిన్నరాత్రి తమ రెక్కడున్నట్టు ?

రంగ : శ్రీమతి సరళా–లేదు, లేదు. అక్కడ కాదు. మరేం అనుకోను. నాకు నోరువిప్పితే అతిసహజంగా ఆ విషయం నాలుకచివరనుండి జారేటంత పరిపాటయి పోయింది.

ప్రేమవల్లి: నాకే అట్లాటిఅబద్ధా లెట్లా చెప్పగలుగుతున్నావ్?

రంగ : నాకు తెలియదు. బహుశా అదో అలవాటుగా పరిణ మించిందనుకుంటా.

ప్రేమవల్లి: ఆ పరిణామం పంకజాక్షికి నిలవచెయ్యి.

రంగ : బహుశా నేను పంకజందగ్గర ఎన్నిఅబద్ధాలాడినా నీ దృష్టిలో ఏంబాధ లేదనుకుంటా ?

ప్రేమవల్లి: ఓ! ఆవిడగారు తమ ధర్మపత్ని–ఆవిషయం వేరు.

రంగ : ఓహో !

ప్రేమవల్లి: ఓహో ! అంటే నీభావం ?

రంగ : అభావం ! భావానికేంవుంది ? ఆ క్షణానికి అదొక్కటే సరియైన సమాధానంగా నాకు తోచింది.

ప్రేమవల్లి: కాదు నీ భావానికి టీకాతాత్పర్యంకూడా నాకు తెలుసు.

[ఆసమయంలో పనిపిల్ల ప్రియంవద ట్రేలో రెండు కప్పులూ, కాఫీకోపా, సిగరెట్టుడబ్బా వుంచుకుని ప్రవేశిస్తుంది. ప్రియంవద నిష్క్రమించేవరకు నిశ్శబ్దంగా వుంటారు.]

రంగ : కొంచెం కాఫీ తీసుకో.

ప్రేమవల్లి: నాకేం అవసరం లేదు.

రంగ : (కోపాలోంచి కాఫీ కప్పులో వంచుకుంటూ) నాకు అవుసరం వున్నట్టుందిలే.

ప్రేమవల్లి: వుండేం ?

రంగ : (కప్పు పెదిమెలవరకు పోనిచ్చి) విపత్ సమయాల్లో హృదయం తేలికపరుచ్చుకొని చిరునవ్వు నవ్వటం-నాకు ఉగ్గుతో పుట్టింది. (ధైర్యం కూడకట్టుకొటానికి కాఫీ త్వరగా పీల్చేస్తాడు) చూడూ! నీకు సుతలాం నచ్చని సంగతి ఒకటి చెప్పాలిపొచ్చినందుకు చింతిస్తున్నా. కాని అది చెప్పితీరాలిసిందే. (ప్రేమవల్లి మారు పలుకదు. క్షణిక విరామం తరువాత రంగధామం సిగరెట్టు అంటించి తిరిగి మొదలుపెడతాడు) నిజానికి మన రహస్య ప్రణయకలాపం కలలాలం కొనసాగ టానికి సరియైన రస్తానిర్మాణం నాకు సాధ్యపడలేదు. తలా తోకా లేకుండా అసందర్భంగా, అవిరామంగా చెపుతూన్న యీ అసత్యాలన్నీ నన్నెంతో యిరుకున పెట్టి కలవరపరుస్తున్నాయి. పంకజాన్ని అలుసుగా చూస్తున్నానన్న భావనే, నాకు బాధాకరంగా వుం టోంది. (ఇంకో విరామం) మన ప్రణయగాథ గుట్టు బట్టబయలైంది. పైగా పంకజం ప్రేమకొరకు తిరిగి నా హృదయం పరవళ్ళు తీస్తోంది.

ప్రేమవల్లి: (నిశ్చలంగా) తరువాత?

రంగ: (ఆశ్చర్య చకితుడై) తరువాత అంతే!

ప్రేమవల్లి: అంతే అయితే నాకేం... అని?

రంగ: (పూర్తిగా చిక్కు పరిస్థితిలోపడి) నేను కనీ... నీ...

[ప్రేమవల్లి పగలబడి నవ్వుకు లఘించుకుంటుంది. రంగధామం వెన్నువిరిగినట్లు ఒక్కసారి వెనుకకువ్రాలి, విస్తుపోయి ఆమెకేసి చూస్తూవుంటాడు]

ప్రేమవల్లి: నీకొరకూ నీ ప్రేమకొరకూ నేను ఏనాడేనా పరితపిస్తున్నాననే భ్రాంతిలో పడటంలేదుగదా నువ్వు?

రంగ: (అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తూ) అబ్బ! ఎంత మాట! స్త్రీ తనవలపులో చిక్కుకుని తానే సర్వస్వం అని ఆవిడగారు భావిస్తూన్నదని భ్రమించే పురుషుడు ఒట్టి గర్వంబలిసిన గార్దభం. ఆవిషయం నాకు తెలుసు.

ప్రేమవల్లి: మనకు పరిచయం కలిసిన తొలిరోజులలో నాకు నువ్వు ముచ్చటగా మరులుగొలిపేవు. కాని ఆదశ దాటి చాలాకాలం అయింది.

రంగ: చాలా సంతోషం.

ప్రేమవల్లి: సదా ఆపనీ ఈపనీ చేసిపెట్టటానికి నన్ను అంటిపెట్టుకుని ఎవరో ఒకరుంటే సదుపాయంగా వుంటుంది. నేనసలే పద్మినీజాతి స్త్రీత్వంగల స్త్రీ నాయె. అదీ కాక...

రంగ : నీకు దారీ తెన్నూ తెలియదాయె.

ప్రేమవల్లి: తెలుసుకోలేంది నేను కాదు... గత నెలరోజులాయి నువ్వు చెప్పలేనంతగా మొగం మొత్తేవన్న విషయం తెగేసి నీ ముఖాన్న అనీటం తరువాయిగా నా శక్తి వంచన లేనంతగా చేష్టల్లో ప్రదర్శిస్తూనే వున్నా.

రంగ : బహుశా బాగా బండబారి వుంటాను.

ప్రేమవల్లి: బాగా ఏమిటీ! బ్రహ్మాండంగా బండబారేవు.

రంగ : పోనీలే! ఏదో మంచిదానివిగనుక నేనేం అనుకుని మధనపడతానో అని ఇంతవరకూ దయతల్చేవు.

ప్రేమవల్లి: (ప్రేమపూరితమైన దరహాసంతో) నీమాటల్లోనే నిన్నో గర్వాంబలిసిన గార్దభం అని నే నభివర్ణిస్తే మరేం మోటుగా భావించవుగదా ?

రంగ : దాని కేం! మన పరిచయం యింకమీద ఎథాలాపంగా వుంటుంది.

ప్రేమవల్లి: ఇంకమీంద పరిచయం అంటూ మిగిలి తేగా ?

రంగ : బ్రతికించేవు-మరి బాధలేదు. [ప్రేమవల్లి విసురుగా గుమ్మంవరకు పోతుంది. ఒక్కసారి ఆగుతుంది]

ప్రేమవల్లి: నేను ప్రథమంలో నిన్ను కలిసినప్పటంత గ్రుడ్డిగా పంకజాక్షి నిన్నారాధిస్తోందా ?

రంగ : నే నెంతగా ఆమెను ప్రేమిస్తున్నానో ఆమె నన్నూ అంతగానే ప్రేమిస్తున్నదని భావిస్తా.

ప్రేమవల్లి: నేను నీకు వ్రాసిన జాబులన్నీ ఏంచేసేవు ?

రంగ : మనం నిర్ణయించుకున్నట్టే! ఆ వెంటనే దగ్ధంచేసి వేసేను.

ప్రేమవల్లి: ఆపని నేను చేయలేదు. నీవాటిని దాచిపెట్టి వుంచేను.

రంగ : చిరస్థాయిగా పదిలపర్చుకోవలసినంత భావనాపటిమ వాట్లలో అంతగా లేదనుకుంటా.

ప్రేమవల్లి: ఆలేఖలలో నువ్వు నెలగబెట్టిన ఉదాత్తమైన కవిత్వానికి ఉబ్బితబ్బిబ్బైకాదోయ్ వాటిని నే భద్రపరిచింది?

రంగ : ఓహో! మరి దేనికో!

ప్రేమవల్లి: నీభార్యామణికి వాటినిబహూకరిస్తే పారవశ్యంతో పఠిస్తుందనుకుంటా.

రంగ : అయితే అవశ్యం పంపించు.

ప్రేమవల్లి: నువ్వు అన్యథా భావించకపోతే... పంపాలనే అనుకుంటున్నా.

రంగ : అబ్బే బాధలేదు. ఇంతకీ పంకజాక్షికి ఇదివరకే తెలియని నూత్నవిషయాలేం వాట్లలో లేవుగా?

ప్రేమవల్లి: (విభ్రాంతితో వెనుకకు వస్తూ) నువ్వంతా ఆవిడగారికి చెప్పివేసేవా? – ఏం?

రంగ : అదేంలేదు.

ప్రేమవల్లి: మరి?

రంగ : ఆవిడగారికి అంతా తెలుసు.

ప్రేమవల్లి: ఏదంతా తెలుసు?

రంగ: ఆదినుండీ తెలుసు.

ప్రేమవల్లి: (భయభ్రాంతితతో) ఆవిడ ఎట్లా తెలుసుకో కలిగింది?

రంగ: దేముడికిమాత్రం తెలుసు ఆవిషయం.

ప్రేమవల్లి: అదంతా కుట్ర. ఆవిడగారు బయటకు అగుపించేటంత అవివేకి కాదని నే తెలుసుకొని ఉండాలిసింది. ఆ మాయదారి మగనాలి నీకు విడాకులియ్యాటానికి నిశ్చయించుకుని నన్ను సాకుగా వినియోగించుకుంది. మాఆయన ఇట్లాంటి దెన్నడూ సహించరు.

రంగ: ఎంతో అభిమానంగా చూసేభర్తేనా, సరిగ్గా అక్కడికే హద్దుగీస్తాడనుకుంటా.

ప్రేమవల్లి: ఓ! సిగ్గులేక, ఈసమయంలో నవ్వులాటొకటి.

రంగ: ఇప్పటికేంలేదు. నవ్వులాటే ఇంక రావలసింది.

ప్రేమవల్లి: ఏమిటీ?

రంగ: బాధలేదు. దానిగురించి నువ్వేం గాభరాపడకు. పంకజాక్షి ఏం చెయ్యబోటంలేదు.

ప్రేమవల్లి: అయితే! తరువాత, ఏమిటీ ...?

రంగ: (బుజాలు కుద్దిస్తూ) పంకజాక్షి లవవేశం పట్టించుకోందే?

ప్రేమవల్లి: నాకేం అర్థంకావటంలేదు.

రంగ : కాలేదూ ? చాలా స్వల్పవిషయం. అవిడదృష్టిలో దానికి అసలు విలువేలేదు. నాకు ఆహ్లాదకరంగా వుందని ఆవిడా ఆనందించింది. కాని నాకందులో ఎంత ఆహ్లాదం లభించిందో ఆవిడకే తెలిసుంటే ! ఇదంతా ఆవిడదృష్టిలో ఏదోచిన్న-చిన్న తమాషాలా వుంది.

ప్రేమవల్లి: (కోపోద్రేకతతో) హా! హా! హా! చిన్న గులాబీ పైరులా భావిస్తోందనుకుంటా.

రంగ : అట్లాంటిదే ఏదో.

ప్రేమవల్లి: ఆవిడ నీకు విడాకులిస్తే నన్ను వివాహము చేసుకుంటావా ?

రంగ : తేంక్సు, అదేం జరగని సంగతి.

ప్రేమవల్లి: ఘోరం! అవమానకరం? మీఆవిడగారు పైపైని ఆడే సయ్యాటలకి నేనొక సాకుగా వినియోగపడ్డాను. ఈ వ్యవహారమంతా అవినీతికి పుట్టినిల్లుగా పరిణమించింది! ఆనాడు నేను ప్రణయానుభవంకొరకు ఎంతగానో పరితపించేను. కాని పంకజాక్షి నిన్ను ప్రగాఢంగా ప్రేమిస్తుందని నేనే నమ్మివుండకపోతే నీకేసేనా చూసివుండేదాన్నికాదు.

రంగ : ఒరులకు ఇట్లాంటి సంఘటనలు సంభావ్యమయినప్పుడే ముచ్చటగా వుంటుంది. నీకే సంభవిస్తే-ఆ, అది ! ప్రాణసంకటం-సరియైన పదం.

ప్రేమవల్లి: (ఒకసారి స్మృతి పథానికి తెచ్చుకుని) మరి శ్రీమతి సరళాప్రసాద్ ?

రంగ : అది సర్వం పంకజాక్షికి తెలుసు.

ప్రేమవల్లి: అంటే... నీవూహా... ఇందాక మేం ఇద్దరం...

రంగ : కలిసి కన్నీళ్లు కార్చేరా! నీలాగే ఆ విడవికూడా నిజమయిన అశ్రుధారలే అయివుంటాయిలే-మరేం బాధలేదు.

ప్రేమవల్లి: మరి నంగనాచిలా నటించి నాచేత ఒకటి తరువాత ఒకటి వాగించింది.

రంగ : అతిచమత్కారం నిన్నూ నన్నూ జోగొట్టి జోలపాడి గోతులో దించింది.

ప్రేమవల్లి: అరిదేముడా! ఇప్పుడు నే నావిడగారి ముఖం చూడటం ఎట్లాగో ?

రంగ : మరేం బాధలేదు. పంకజాక్షి ఎప్పటిలాగే నీతో ముచ్చటగా వుంటుంది.

ప్రేమవల్లి: మొద్దబ్బాయ్! ఆవిడగారు నాతో ముచ్చటగా ఎందుకుంటోందో ఆ మాత్రం తెలియదూ? నా కన్నా అందకత్తెలని ఆవిడ భావిస్తోంది. నాకన్నా గడసరిఅని ఆవిడ గర్విస్తోంది. నాకన్నా మరులు గొల్పుతోందని ఆవిడ మురిసిపోతోంది. నన్ను చూసి అసూయేనా పడటంలేదు సరికదా అధమం నావునికే ఆవిడగారు గుర్తించడంలేదు. (నిలువుటద్దంవరకూపోయి అందులో తన ప్రతిబింబంకేసి

చూసుకుంటుంది. కోపోద్రేకతతో వివశురాలవు తుంది. అంతలోనే ముఖకవళికలు మార్చు కుంటుంది.)

[తలుపు మెల్లగా తెరువబడుతుంది. పంకజాక్షి లోన ప్రవేశిస్తుంది. శీతకట్టులో కారుప్రయాణానికి ఉపయోగించే నిండాచేతుల ఉన్నిబనియనూ, దళమైన ఖద్దరుచీరా ధరించి వుంటుంది. పంకజాక్షి కంట బడగానే ప్రేమవల్లి ఒక్కసారి బరువుగా శ్వాసించి ముఖం త్రిప్పివేసుకుంటుంది. క్షణంపాటు పంక జాక్షి నిశ్చలంగా వారికేసి చూస్తుంది. రంగధామం అనాలోచితంగా ప్రక్కనున్న బల్లమీది వస్తువులు అటూ, ఇటూ సర్దుతూ వుండాడు]

పంక : (అప్పటికప్పుడే హరించిపోయే చిరునగవుతో) నేను మీ సంభాషణకేం అంతరాయం కలిగించటంలేదు గదా?

రంగ : నువ్వా?

పంక : ఔను.

రంగ : ఏంలేదులే.

[ఉన్నపాటుగా ప్రేమవల్లి బయటకు చిన్నగా రోదిస్తూ కుర్చీలో కూలబడిపోతుంది. పంకజాక్షి ఆమెకేసి ఆశ్చర్యకరంగా తిలకించి త్వరత్వరగా ఆమె దరికి పోతుంది. ప్రేమవల్లి బుజంమీద చెయ్యివేసి మృదువుగా ఆమెమీద వాలుతుంది]

పంక : (బుజ్జగిస్తూ) ఏమిటిది? నిజమైన కన్నీళ్ళే?

ప్రేమవల్లి: (డగ్గుత్తికతో) ఎంతో హేయంగా పరిణమించింది నా బ్రతుకు.

పంక : (పసిపాపతో ముచ్చటిస్తున్నట్టు చిన్న చిరునగవు పెదిమలమీద చిందిస్తూ) ఒద్దు. ఛాఛా! ఏడుపేమిటి?

ప్రేమవల్లి: నాలాంటి అవివేకి బ్రతుకుకు ఏడుపే అలంకరణ.

పంక : మనోదౌర్బల్యానికి లోనై మనం చేదొసగులుబయలుటడినపుడు దుష్కృత్యాలుగా కనిపించటానికిబదులు అవివేకాలుగానే అనిపిస్తూవుంటాయి.

ప్రేమవల్లి: నా బ్రతుకు నాకే ఏనాటికీ మచ్చమాయనంత నీచంగా, హేయంగా కనిపిస్తోంది.

పంక : ఛా! ఛా! కళ్ళనీళ్ళు తుడుచుకోండి. సుబ్బారాయిడు మామయ్య ఇప్పుడే వచ్చేడు. క్రింద కూర్చోపెట్టేను. మిమ్మలిని ఒంటిగా ఇందుకి పిలిస్తే మరేం అనుకోరు కదా అని అడుగుతున్నాడు.

ప్రేమవల్లి: కోల్పోయిన వుల్లాసం కూడకట్టుకుంటూ) పాపం ఆయనకు నామీద అపారమైన సానుభూతివుంది. అరమరికలు లేకుండా హృదయంవిప్పి ఆయనతో కాస్సేపు మాట్లాడితే నా మనోవ్యధ కొంత వుపశమిస్తుంది.

పంక : ఔనౌను! బాగుంది. కారుమీదే వచ్చినట్లున్నాడు. భీమిలీబీచిన ఆయన కో మంచి బంగళావుంది, అక్క

డయితే ఏకాంతంలో అన్నివిషయాలూ ముచ్చటగా మాట్లాడుకోవచ్చు.

ప్రేమవల్లి: నా నయనాలు ఎరుపెక్కేయా ?

పంక : ఏంలేదు. కొంచెం పౌడరు తెస్తా అద్దుకోండి. (అంటూ ప్రక్క బల్లమీదున్న పౌడరుడబ్బా తీసి అందిస్తుంది. ప్రేమవల్లి ఆలోచనా పూరితంగా ముఖానికి పౌడరద్దు కుంటుంది)

ప్రేమవల్లి: ఆయన చాలా సరదాఅయినవ్యక్తి. పెద్దింటి స్త్రీలగురించి ఎంతో పరిచితంగా మంచిసీళ్ళలా మాట్లాడుతూ వుంటాడు.

[ప్రియంవద ప్రవేశం]

ప్రియంవద : మామయ్యగారొస్తున్నారమ్మా !

[సుబ్బారాయుడు ప్రవేశించే సమయానికి ప్రేమవల్లి ముఖాన విషాదచ్ఛాయలు పూర్తిగా తొలగిపోయి వర్చస్సు వెల్లివిరుస్తుంది యథాప్రకారంగా]

పంక : ఏం మామయ్యా ! కులాసా ?

సుబ్బా : (ధీరత్వం వుట్టిపడుతూ ప్రేమవల్లివరకు చురుకుగా పోయి) అరే ! వింతలుకూడా తియ్యగావుంటాయే ? మీరు వూటీలో వున్నారనుకుంటున్నా.

ప్రేమవల్లి: లేదండి ! పాపం శ్రీమతి సరళాప్రసాద్‌కి వున్నపాటుగా వ్యాధి తిరగపెట్టింది.

సుబ్బా : అది నా మేలుకేలెండి.

ప్రేమవల్లి: మీకు ఆమాత్రం సౌహార్ద్రితవుంటే అదేచాలు కాని ఈరోజునే వూరువదిలి వెళుతునా.

సుబ్బా: ఇంత హాటాత్తుగా? మీరే లేకపోతే మేం చేసే దేమిటా అని?

ప్రేమవల్లి: దాని కంతికీ బాధ్యత డాక్టర్ రంగధామారావు గారిది.

రంగ: (ఆశ్చర్యపోతూ) నాదా?

ప్రేమవల్లి: డాక్టర్‌గారు నా ఆరోగ్యం బాగా కుదటపడింది; ఇంక నేను విదేశాలకుపోయినా అక్కడి వాతావర ణానికి తట్టుకోగలనని చెపుతున్నారు. అట్లాంటప్పుడు మరోక్షణంకూడా మా ఆయనున్నుండి వేరుపడి వుండ టానికి నామనస్సు అంగీకరించదు సుమండి.

సుబ్బా: కాని ఆయనగారు దేశంకోసం విదేశాల్లో అంతు లేని వ్యాపార సంప్రదింపుల్లో మునిగి తేలుతున్నారను కుంటా.

ప్రేమవల్లి: ఔననుకోండి. అమెరికాలో వ్యాపార సంప్ర దింపులతో విసుగెత్తి ఈమధ్య సిలన్‌చేరి సముద్రపు టొడ్డున ఓ చక్కటి బంగాళా పుచ్చుకొని విశ్రాంతి తీసుకుంటున్నారట. నేను రేపే ప్రయాణం కడు తున్నా.

సుబ్బా: ఎంతపనండీ! ఘోరం! అన్యాయం! అనకాపల్లి అన్యాయం! అయితే మరి మీరు నేరుగా సిలన్ వెళుతున్నారా?

ప్రేమవల్లి: లేదు. దారిలో ఒకటి రెండురోజులు మదరాసులో ఆగాలనుంది.

సుబ్బా: అరే! వింతగావుంది. రేపటి మెయిలుకే నేనూ మదరాసు పోవాలని సన్నాహాలన్నీ పూర్తిచేసేను.

ప్రేమవల్లి: బాగుందండి. మరేం, అయితే దయచేసి దారిలో నన్ను కాస్త కనిపెడుతూవుంటారా? మీకు తెలుసుగా? నే నసలే పద్మినీజాతి స్త్రీత్వంగల స్త్రీనాయె. ట్రెయిన్‌లో ఏంకావలసివచ్చినా...

సుబ్బా: అయ్యో! దానికేం! ఇంతకీ నాఅదృష్టం అనుకొండి ఇదంతా. మదరాసులోని సినిమాప్రముఖులందరికీ మనంఅంటే గురుభావం. మీకు కావాలంటే స్టూడియోలు, షూటింగులూ అవీ చూద్దాం.

ప్రేమవల్లి: స్టూడియో సెట్టుమీది అట్టపువ్వులూ, దూది నెమళ్ళూచూసి మీరు విరహగీతాలు ఆలాపించగు కదా?

సుబ్బా: బలే! బలే! బలే!

ప్రేమవల్లి: (పంకజాక్షితో) వెళ్ళివస్తానండి. తిరిగి ఎన్నాళ్ళకో! దయమాత్రం వుంచండి. గుడ్‌బై.

(ఇద్దరూ ఎంతో ఆప్యాయంతో కరచాలనం చేసుకుంటారు)

ప్రేమవల్లి: (రంగధామంతో) గుడ్‌బై! పరంజిపాయి కాఫీ షేర్ల పెరుగుదలగురించి మీరేమేనావింటే నాకు తెలియచెయ్యండి.

రంగ : విధిగా!

సుబ్బా: క్రింద నా కారుంది. మీకు కావలసినచోట దిగ విడిచి మరీ పోతా. పదండి.

ప్రేమ : తేంక్సు.

[రంగధామంకేసి ఒక్కసారి తలపంకించి ఆమె నిష్క్రమిస్తుంది.]

సుబ్బా: (పంకజాక్షితో) ఒస్తానమ్మా! గ్రేటాగారో్బ! – ఈస్తర్ విలియమ్స్! 

పంక : జాగ్రత్త! మామయ్యా! మరేం చిలిపిపనులుచేసేవు గనుక.

సుబ్బా: అమ్మాయ్! ప్రయోగాత్మకంగా ప్రపంచాన్ని ఆకళింపు చేసుకున్న మనిషినాయె. పైగా ఐదో పది దాటి రెండేండ్లయింది.

పంక : (సుబ్బారాయిడు నిష్క్రమిస్తూవుంటే)అంటే మనస్సు ప్లేటోనిక్ స్థితి చేరుకుందన్నమాట.

రంగ : (ఎంతో తేలికపడ్డట్టు శ్వాసవిడిచి) అమ్మయ్యా! విరగడైంది.

[పంకజాక్షి నిలువుటద్దంలో చీర సర్దుకుంటూవుంటుంది. రంగధామం చిరునవ్వుతో ఆమెకేసి తేరిపారిచూస్తూ వుంటాడు] ఇంక ... ఏదీ?

పంక : (ఆశ్చర్యపోతున్నట్టు నటిస్తూ) ఏమిటి?

రంగ : ఏది ... ఇందాక ఇస్తానన్నది?

పంక : ఇస్తాననలేదు. తీసుకోనిస్తానన్నా.

రంగ : (ఆమెను వెనుకనుండి బుజాలు పట్టుకుని దగ్గరకు తీసు కుంటూ) పెంకిపిల్లా!

పంక : చచ్చేను బాబోయ్!

రంగ : వుత్తది... ఇంకెక్కడ!

పంక : అయితే బావగారు ఇంకొకసీతాకోకచిలకతో ! భమర గీతం ఆలాపించాలసుంటుంది. గుమ్మంలో నాకోసం కారు కనిపెట్టుకుంది.

రంగ : (అడుగు పెనుకకువేస్తూ) ఇప్పుడు నీకు కారు దేనికి ?

పంక : (నవ్వుతూ) ఆవిషయం వింటే మీా వుత్సాహం నీళ్ళు కారిపోతుందనుకుంటా.

రంగ : నువ్విప్పుడు ఆ దిక్కుమాలిన మోటారు ప్రయాణం మానుకున్నావుగా ?

పంక : ఎవరన్నారు ? నే వెళ్ళితీరాలి.

రంగ : (కొంత దెబ్బతిన్నట్టు ఆశ్చర్యకరంగా) పంకజం !

పంక : (చేతి గడియారం కేసి చూస్తూ) అమ్మయ్యో! వాళ్లు నాకోసం వేచివుంటారు.

రంగ : (ఆమె రెండుచేతులూ మృదువుగా పట్టుకుని ప్రాధేయ పూర్వకంగా) ఇప్పుడు నన్నింకేం వేధించకు. నా మాటవిని ఆ వున్నదుస్తులు మార్చుకునిరా. కులా సాగా కూర్చుని కాఫీ తీసుకుందాం. నువ్వింట్లో లేవని ప్రియంవదని తెలియచేయమను.

పంక : మీఆశ అడియాశ చెయ్యాలిసొచ్చినందుకు చాలా విచారిస్తున్నా. కాని ఖరారుచేసిన ప్రయాణం తీరా చేసి సమయానికి కాదనటం నావల్లకాదు సుమండీ.

రంగ : ఉట్టినే అంటునావు.

పంక : కాదు గట్టినే.

రంగ : కాని పంకజం, ఇప్పుడు సర్వం సవ్యంగా మారిపో యింది. నేను పూర్వంలాగే నిన్ను ప్రేమిస్తున్నా-నీకు తెలుసునో లేదో ?

పంక : ఇప్పుడు తెలుసుకుంటున్నా లెండి.

రంగ : తెలుసుకు ... ఆనందించటం లేదన్నమాట.

పంక : ఆ, అంతగా ఏంలేదు.

రంగ : (ఆమెభావం గ్రాహ్యంకాని విభ్రాంతితో) అదేమిటి? పంకజం ! నువ్వు నన్నెంతగా ప్రేమిస్తున్నావో, నేనూ నిన్నంతగా ప్రేమిస్తున్నాను. కాదంటే, చాటుగా నీ అంతరాత్మనడిగి చూడు.

పంక : (చిన్న చిరునగవుతో) అయితే మిమ్మలిని నేను ప్రేమి స్తున్నానని ఎందుకు భావిస్తున్నారో ?

రంగ : (భయవిభ్రాంతులతో తబ్బిబ్బవుతూ) నువ్వు-నువ్వు నాగురించి యింకేం పట్టించుకోటంలేదని అర్థంకాదు గదా ?

పంక : (నింపుగా) మీారు-నాగదిదాటి బయటకు వెళ్ళిన ప్రతిసారీ ప్రపంచము మునుచుకుపోయి ప్రళయం సంభ

విస్తుందన్న చిత్తవిభ్రాంతి ఇంక నన్నేంబాధించటం లేదు.

రంగ : ఏమిటీ!...ఆ డొంకంతా ఎందుకు తిరుగుతావ్? నేను కంటబడితేనే కంటగించుకుంటున్నావని, అసందిగ్ధంగా, సూటిగా అనీరాదు?

పంక : అట్లాఅన్నా సత్యదూరం అవుతుంది. మీరంటే నేనెంతగానో ఇష్టపడతాను.

రంగ : ఇష్టపడతావ్! నాయెడల యిష్టత ప్రదర్శించమని నిన్ను అర్థించటంలేదు. ప్రేమించమని కోరుతున్నాను.

పంక : నేనూ ప్రేమించాలనే వాంఛిస్తున్నా. అట్లా చేయగలిగితే నాకూ చాలా ప్రయాస తప్పుతుంది.

రంగ : నాకేం అర్థం కావటంలేదు. పుట్టిపెరిగేక నేనువిన్న మొట్టమొదటి వైపరీత్యం ఇదే. నన్ను నువ్వు ఆరాధిస్తున్నావని సర్వదా భావిస్తున్నా.

పంక : ఎందుకనో?

రంగ : నేను నిన్ను ఆరాధిస్తున్నాగనుక.

పంక : ఎప్పటినుండి?

రంగ : ఎల్లప్పుడూ, ఎల్లప్పుడూ, ఎల్లప్పుడూ.

పంక : బలే! బలే! బలే!

రంగ : ఔను నేనెంత అవివేకినయూనో నాకు తెలుసు. ఆ జన్మాంతం ఆ విచారం నన్ను వెంటాడుతూనే వుం

టుంది. నేను ఎంతగానో సుఖించేనని భ్రమించి నట్టున్నావ్ ? నే నింతకాలం విలాసాలతో ప్రొద్దు పుచ్చేనని అపోహపడ్డట్టున్నావ్ ? అంతగా ఏం లేదు. ఇదంతా భ్రమ, భ్రాంతి, భ్రష్టమైన నాగతానికి క్షమించబడే అర్హతలేదు.

పంక : ఛాఛా! మరేం బాధలేదు. మిమ్మలిని మన్నిస్తున్నా. ఇంతకీ అందువల్ల నాకు ముంచుకొచ్చిం దేంలేదుగా!

రంగ : (నిస్పృహద్యోతకమయేటట్టు) అంతా అయోమయం గావుంది నాకు. పంకజం! నిన్ను సర్వదా ప్రేమి స్తూనే వున్నా, నా జీవితంలో నిన్ను ప్రేమించని క్షణంలేదు.

పంక : ఎందుకుబావా! అంత ఆర్భాటం? ప్రేమించినా మానినా ప్రస్తుతం నాకంతగా పట్టించేంలేదులెండి.

రంగ : ఇంతకాలంగా, నా అవివేకం హద్దులేకుండాపోయింది. నాపై ఆటలు నువ్వెంత ప్రశాంతంగా సహించేవంటే నాపైన నీకు సుతలాం శ్రద్ధలేదనేసంగతి నేను ఏనాడో గ్రహించాలసింది. అసూయ స్త్రీకి తోబుట్టువు. ఆర్భాటం స్త్రీకి సహజప్రవృత్తి. స్త్రీ ఆ రెండింటికీ అతీతమైనదంటే ఆమెలో ప్రేమ సమూలం నశించి నట్టే. నువ్వు నన్ను ప్రేమించేదానివికదు ?

పంక : కాదనటంలేదే ?

రంగ : పంకజం! నీలో ఎంత చపలత్వం! నన్నింత అలు సుగా చూస్తావని నేను ఏనాడూ నమ్మలేదు. (పంక

జాక్షి ఏదో పోగొట్టుకున్నట్టుగా అటూ యిటూ చూస్తుంది) ఏమిటి అట్లా చూస్తున్నావ్ ?

పంక : అదే! మీరు పోగొట్టుకున్న హాస్యదృష్టి, దొరుకుతుందేమో చూస్తున్నా.

రంగ : హాలాహలంలో దహించుకుపోతున్న నాలో హాస్య దృష్టి ఏనాడో సమూలంగా నశించింది.

పంక : (నొక్కి పలుకుతూ) దహించుకు పోతున్నారు.

రంగ : ఔను. నిలువునా దహించుకుపోతున్నా—నీకోసం—నీ ప్రేమకోసం.

[అతను ఆమెముఖమువైపు చూడడు. ఆమె ముఖంలో భర్తను వేధిస్తున్నందుకు పొందుతూన్న మనోవ్యథద్యోతకం అవుతుంది. అమాంతం అతని వక్షస్థలంమీద వ్రాలిపోవుటకా అన్నంత వురుకుగా కూర్చున్న స్థలమునుండి లేస్తుంది. కాని తక్షణం తమాయించుకుని తిరిగి కూర్చుంటుంది]

పంక : (అపహాస్యంచేసే కిలకిల నవ్వుతో) అయ్యో బావా!

రంగ : (చిరాకుగా) నన్నుచూసి నవ్వనక్కరలేదు.

పంక : లేదు. నేను నవ్వటంలేదు. మీస్థితికి విచారిస్తున్నా— జాలిపడుతున్నా.

రంగ : నాకు కావలసింది నీజాలిఅనా నీభాగ్యం ?

పంక : నేను చాలా దురదృష్టవంతురాలిని. మిమ్మలిని ఆనందపర్చటం నాకు అసాధ్యంగా కనిపిస్తోంది.

ఇంతకీ ఇప్పుడే నేను పోతున్నాగా. ఇంకో వారం పాటు మనకీ గొడవలేంవుండవులెండి.

రంగ : (ఆమెకేసి చురుకుగాపోతూ) అబ్బే! అదేంలేదు. నువ్వెక్కడికీ పోవటంలేదు.

పంక : (కనుబొమ లెగరేస్తూ) ఎందుకని అట్లా భ్రమిస్తున్నారు ?

రంగ : భ్రమించటంకాదు. భర్తగా నిన్ను ఆజ్ఞాపిస్తున్నా.

పంక : (చిరునవ్వుతో) మీ ఆజ్ఞానుసారం, సాష్టాంగపడతానని భ్రాంతిలో వున్నట్టున్నారు.

రంగ : ఈయింటికి అధినాధుడుని నేను. ఇక్కడ నామాట చెల్లి తీరాలిసిందే.

పంక : ఔనుబావా! ఈయింటికి పన్ను చెల్లిస్తున్నది మీరే గనుక మీ యిష్టానుసారంగా ఈయిల్లు యేలబడాలి అనుకోటానికి మీకు పూర్తిహక్కుంది. కాని వ్యక్తిగతంగా ఈక్షణంలో నాకు కావలసిందల్లా, మీ యింటినుండి బయటకు పోవటం.

రంగ : నువ్వాలా ఏం బయటకు పోవటంలేదు.

పంక : అంటే నా అభీష్టానికి వ్యతిరేకంగా నన్ను యిక్కడ బంధించాలనా మీ ఆలోచన ?

రంగ : అవసరమైతే అంతపనీ విధిగా జరుగుతుంది.

పంక : ఓహో!

[ఆమె లేచి గుమ్మందాకా పోతుంది. అతను ఆమెను అడ్డగించి తలుపుకు తాళంవేసి తాళంచెవి తన జేబులో పెట్టుకుంటాడు.]

పంక : పశుబలం !

రంగ : నేను కట్టుకున్న భార్యని అదుపులో వుంచ లేనంత సెంగ ళప్పని కాననేవిషయం నీకు నిరూపించటానికి సరిగా ఇదే మంచిసమయమనుకుంటా.

[పంకజాక్షి బుజాలు విసురుగా కుద్దించి కుర్చీలో కూలబడుతుంది. ఒక్కసారి వికటంగా నవ్వుతుంది.]

రంగ : నవ్వుతున్నావ్ ? ఎందుకని ? దేన్నిచూసి ? ఇప్పుడు నవ్వాలిసిన సంగతి నాకేం కనిపించటంలేదు.

పంక : నాకు కనిపిస్తోంది – అదే ! బూజుపట్టిన మీ, పాత కాలపు మొఱటుప్రవర్తన. అయితే కాళ్ళూచేతులూ కలియకట్టి నన్ను పోషిస్తారా ?

రంగ : (కోపోద్రేకతతో) ఇస్ ! (ఆమెకేసి చూస్తాడు) ఇటు చూడు పంకజం ! మొండితనంకూడదు. మెదడు లేని పనికాకపోతే ఇప్పుడు యీదిక్కుమాలిన ప్రయాణం ఎందుకుచెప్పు నీకు.

పంక : మీరు తిరిగి తలుపుతెరచేవరకు ఆవిషం మీతో చర్చించేదిలేదు.

రంగ : మాచ్ కండ్ చూడటానికి యిది సమయంకాదు. (విరామం-పంకజాక్షి ఆమెకు తిన్నగా అవలోకిస్తూ

వుంటుంది. ఆయనగారు ఏం చెప్పూచున్నదీకూడా పట్టించుకోదు) కొండలమీద యీ ఋతువులో వర్షాలు కుండపోతగా వుంటాయి. నీకు భరించ శక్యముకాని శీతలం చేస్తుంది. దాంతో నీకునేమో నియాలో దించవచ్చు. (విరామం) ' నేనే ఏదో అవ్యక్తమైన వ్యాధి సమీపిస్తున్నట్లు కృంగి కృశిస్తున్నా.

[పంకజాక్షి దాటుకొస్తున్న దరహాసం అణచుకొని యథాప్రకారంగా శూన్యంలోకి అవలోకిస్తూవుంటుంది – రంగధామం తిరిగి ఉద్రిక్తతతో ప్రక్రమిస్తాడు] ఇంతకీ నాదృష్టిపథంనుండి నువ్వొక్క క్షణంకూడా దూరంకావటం నాకు భరించశక్యం కాదు. అందుకనే నిన్నంతగా నిరోధిస్తున్నా. నిన్నెంతగానో కాంక్షిస్తున్నా. సర్వదా నువ్వు నాపజ్జనే వుండాలని కోరుకుంటున్నా. నన్ను నువ్వు పూర్వంలాగే ప్రేమించాలని ప్రాధేయపడుతున్నా ... ఔను! నేను ఎంతగా నిన్ను ప్రేమిస్తున్నానో నీకే తెలిసి వుంటే నువ్వింత హృదయంలేకుండా వుండలేవు.

పంక : (ఆయనకేసి తిరిగి, నిశ్చలంగా) కాని, నిజానికి మీరు నన్ను అణుమాత్రం లక్ష్యంచేసినా యీపాటిస్వల్పాతిస్వల్ప వినోదంకూడా నాకు కలుగనీయకుండా నిరోధించేవారుకాదు. మీలో త్యాగతత్పరతవుండేది.

నా ఆశలూ, ఆకాంక్షలయెడల మీకు కొంత గౌరవం వుండివుండేది. రాకరాక ఏదో కాస్త ఆనందించ టానికి నాకు అవకాశం కలిగిన యీ సమయాన అర్థం పర్థంలేని అవరోధాలు కల్పించివుండేవారు కాదు.

[క్షణంపాటు రంగధామం ఆవిడ కేసి అవలోకిస్తాడు. తరువాత వెనుతిరిగి తల క్రిందికి వంచుకొని గదిలో అటూ, యిటూ పచారు చేస్తాడు. జేబులోనుండి తాళంచెవి వెలికితీసి నిశ్శబ్దంగా ఆమె ప్రక్కగా వున్న బల్లమీద వుంచేస్తాడు]

పంక : ఏమిటి దాని అర్థం ?

రంగ : (గద్గదస్వరంతో) యథార్థం !—నువ్వు చెప్పినది అక్షరాలా యథార్థం. నాలోని స్వార్థం కరడుకట్టింది. నాకంటికి స్వీయ ప్రయోజనం వినా వేరే యేమీ కనిపించటంలేదు. నిన్ను ఎంతగానో విసిగించివుంటాను. బహుశా కొద్దిరోజులు నానుండి వేరయితేనే నువ్వు తిరిగి నన్ను పూర్వంలా ఆదరించగలుగుతావు.

[పంకజాక్షి హృదయం ద్రవించిపోతుంది. ఇంక ఏమాత్రం 'నటన' నిలబెట్టుకోలేనంతగా ఆమెలో అంతర్ సంఘర్షణ చెలరేగుతుంది. అమాంతం ఆయన బాహువల్లరిలో వాలిపోదామని ఆవిడకు

తీవ్రంగా జనించిన కోరిక క్షణంలో జయించి తమా యించుకుంటుంది]

పంక : తాళం బిగించిందిమీరు. స్వయముగా మీరే అది తెరిచే సౌహృదయం కనపర్చగలిగితే బాగుంటుం దేమో ?

[అతను మారుమాటాడకుండా తాళంచెవి తీసు కుని గుమ్మంవరకూపోయి వేసినతాళం తీసివేస్తాడు]

పంక : అంటే దానిఅర్థం?-ఇంక నాప్రయాణానికి మీఅభ్యంత రాలన్నీ తొలగిపోయినట్టేనా ?

రంగ : పూర్తిగా-ఈ ప్రయాణంవల్ల నీకు వినోదం లభిస్తే నేను హృదయపూర్వకంగా ఆనందిస్తాను.. నువ్వు హాయిగా వున్నావన్న భావనతోనే, నాకో అనిర్వాచ నీయమైన ఆనందం వుందని నమ్ముతున్నా. ఇంక నాకు కావలసిందంతా నీ సౌఖ్యం ఒక్కటే.

పంక : నేను యీ ప్రయాణం విరమించుకోవాలని కోరిక లేదూ మీకు ?

రంగ : లేదు.

[పంకజాక్షి కొద్దిగా వులికిపడుతుంది. ఆమెకు కావలసినది యీ పరిణామంకాదు]

పంక : ఓహో !

రంగ : నువ్వులేని యీ ఒంటరితనం ఎట్లాభరించాలో, ఏం చెయ్యాలో నాకేం పాలుపోటంలేదు. నిజానికి ఇప్పుడిప్పుడే నీతో ఏదో వూహాకందని నూతనత్వం నా నయనాలకి గోచరిస్తున్నట్టు, ఇప్పుడిప్పుడే నిన్ను క్రొత్తగా తెలుసుకుంటూన్నట్టుభావిస్తున్నా–ఆభావన భాషకి అందదు. అనిర్వచనీయం.

పంక : కాని, క్షణం క్రితం నేను యీప్రయాణం విరమించుకోవాలని మీకు కోరికలేదన్నారు.

రంగ : ఇంక నాకు, నాగురించి యోచనేలేదు. నాకుకావలసిందల్లా నీగురించి ఆలోచన ఒక్కటే. పంకజం! అందులోనే నాకొక అనిర్వచనీయమైన ఆనందం వుంది. స్వార్థత్యాగానికి నామనస్సు ఉరకలేస్తోంది.

పంక : (తేలికపడి) అయితే నాపెట్టీ, బెడ్డింగు క్రిందకు తీసుకువెళ్ళిందో లేదో ప్రక్కగదిలోకిపోయి కాస్త చూసి వస్తారా?

[అతడు క్షణంపాటు బయటకు వెళతాడు. ఆమె వదనంలో మహదానందం ద్యోతకమౌతూ అట్లానే కూర్చుండిపోతుంది. అతను తిరిగి ప్రవేశిస్తాడు.]

రంగ : ప్రియంవద క్రిందకు తీసుకువెళ్ళింది.

పంక : అలాగయితే (క్రీగంట అతనిని ఒకసారి చూస్తుంది) దానికి కేకవేసి వాటిని తిరిగి మేడమీదకు తెమ్మని చెప్పండీ.

రంగ : (తన అదృష్టాన్ని ఎంతమాత్రం నమ్మలేకుండా) పంకజం !

పంక : ఆనందం కలిగిందా మీకు ?

రంగ : ఓ అడుగుతావా ! నిజంగా నీ హృదయం నవనీతం లాంటిది. నాకృజ్ఞత వ్యక్తంచేయటానికి భాష చాలటంలేదు. పంకజం ! నేను నిన్నెంతగా ఆరాధిస్తూన్నదీ నీకే తెలిసంటే.

[అతను ఆమె కూర్చున్న స్థలంవరకుపోయి, మోకాళ్ళమీద కూర్చుని, ఆమెచేతులు మృదువుగా తన చేతులలోనికి తీసుకుంటాడు. కొనవ్రేళ్ళని చుంబిస్తాడు. ఆమె మరింకెంతమాత్రం తట్టుకోలేక అతన్ని లేవతీసి అతని కంఠానికి తన చేతులు చుట్టి వేస్తుంది]

రంగ : గతంలోలాగ నన్ను ప్రేమించగలవని తలుస్తున్నావా? చెప్పు పంకజం ! ఆ మధురానుభూతి, తిరిగి నాకు లభిస్తుందా ? పంకజం ! చెప్పవూ ?

పంక : ఏమిటో పోనిద్దురూ !

రంగ : కాదు పంకజం! మనం మధురాతి మధురమైన మన దాంపత్య ప్రథమదశకే పోగలిగితే, లేమావిచిగురు కొరికే గండుకోయిల దంపతులలాగ మనం పరస్పరం ప్రగాఢంగా ప్రేమించుకుని, ఆలాపించిన ప్రణయ గీతాలు నీకు గుర్తున్నాయ్? నేను యిల్లువిడిచి బయటకువెళ్ళే ప్రతిసారీ నన్ను వీధివాకలివరకూవచ్చి సాగనంపేదానివి. నేను తిరిగివచ్చే ప్రతిసారీ పరుగు పరుగునవచ్చి పలుకరించేదానివి. రాత్రి సాపాటయేక నేను సిగరెట్టు వెలిగించి పత్రిక పట్టుకుని వాలు కుర్చీలో వాలేసరికల్లా ప్రక్కనే ప్రత్యక్షమయే దానివి. ఇద్దరంకలిసి పత్రిక చదువుకునేవాళ్ళం. నీకు గుర్తుందా?

పంక : (దాటుకొస్తూన్న చిరునవ్వు దాచుకుంటూ) అవన్నీ మీరెంతగా ఏవగించుకున్నారోకూడా గుర్తుంది.

రంగ : ఏవగింపా? నా జీవితానికి అదే శుక్లపక్షం.

పంక : సరేలెండి దానికేం. ఇంకమీాద మనం సర్వదా సన్నిహితమైన స్నేహితులలాగ జీవితాన్ని నెట్టుకు పోగలమని ఆశిస్తా.

రంగ : (విస్తుపోతూ) స్నేహితులలా!!! పంకజం! నీస్నేహం వల్లనాకు ప్రయోజనం శూన్యం. నేను నీ ప్రేమ

కొరకు పరితపిస్తున్నా. నా మనస్సెంతగా నువ్వెట్లా గాయపర్చ గలుగుతున్నావో ?

పంక : (చిలిపిగా చిరునవ్వు నవ్వుతూ) ఎంతగానూ నేను మీామనస్సేం గాయపర్చబోవటంలేదు. ఎల్లప్పుడూ మీాతో ఏకీభావంతో ఆహ్లాదకరంగా వుండగలననే ఆశిస్తా.

రంగ : అవన్నీ నాకెందుకు ? పంకజం ! నువ్వు నన్ను ప్రేమించటానికి ప్రయత్నిస్తానని మాట ఇయ్యి.

పంక : (చిరునవ్వుతో) సరేలెండి. అంతగా మీాకు కోర్కె వుంటే మాటయిస్తా.

రంగ : నీచేత ప్రేమించబడగలనని నాకు నిండా నమ్మకం వుంది. నీప్రేమ పొందేవరకు నేను విశ్రమించేది లేదు.

పంక : ఆనమ్మకంకాస్తా కుదిరేక బావగారు తిరిగి ప్రక్క దాట్లు వేస్తారనుకుంటా.

రంగ : చూడకూడదా ! (ఆమెచేతులు ఇంకోసారి అతడు చుంబిస్తాడు – ముఖంకేసిమాత్రం చూడడు. ఆవిడ చిరునవ్వుతో తల తటాయిస్తుంది) ఇంతవరకు నీలో ఇంత అమరత్వ ముందని నేను తెలుసుకో లేక పోయేను. నీ కొనచేయి చుంబించినంతమాత్రాన

నేను మహదానందమైన పారవశ్యతలో మునకలేస్తు న్నాను.

[పంకజాక్షి చిన్నగా నవ్వి అతనినుండి విడివడు తుంది.]

పంక : ఇంక మీ ప్రేమ కవిత్వం కొంతసేపు కట్టిపెట్టండి. ఇప్పుడు నేను ఒకసారి క్లబ్ కిపోయి వాళ్ళతో నేను రాలేనని తెలియచేయాలి.

రంగ : ఆసంగతికాస్తా ఫోనులో చెప్పేస్తే పోతుందిగదా? నా దృక్పథంనుండి నువ్వు దూరంకావటం నేనుసైచ లేను సుమా!

పంక : సరిపోయింది! ఆ క్లబ్ కి చందాలు సరిగా వసూలు కాక దినపత్రికలకే దిక్కులేదు. టెలిఫోనొకటా? నేను ఒకసారి వెళ్ళిరావలసిందే.

రంగ : బాగుంది, సరే. తప్పనిసరి అయితే - అయితే ఏమిటి, తప్పనిసరే అనుకుంటూ నువ్వు వెళ్ళటం (ఆమె చిరునవ్వు చిందిస్తుంది. గదిగుమ్మంవరకు పోతుంది. గుమ్మం చేరేసరికి అతను త్వరత్వరగా పోయి ఆమెను ఆపివేస్తాడు).

రంగ : ఓ! పంకజం!

పంక : ఏమిటండీ?

రంగ : ఎన్నింటికి తిరిగివస్తావ్ ?

[గతంలో భర్త యిల్లువదిలి వెళ్ళే ప్రతిసారీ అదే ప్రశ్న ఆమె వేసేదిగదా అని గుర్తుకుతెచ్చుకుని వినోదం వ్యక్తపరిచే హాస్యవిన్యాసంచేసి ఆమెచేయి చుంబించటానికి ఒకసారి త్వరగా పెదిమెలకు తాకించి, చల్లగా గుమ్మములోనుండి బయటకు జారుకుంటుంది. సావడిలో గోడమీాద చిరునవ్వు చిందిస్తూన్న ప్రొఫెసర్ పరంధామయ్య ఛాయాచిత్రానికి ఆనందబాష్పాలతో చేతులెత్తి మ్రొక్కుతుంది.]

సమాప్తం.

